AMMA NUDI
Telugu Monthly
Vol. 1
Issue 10
Rs. 20
December
2015
Tenali, AP

తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

డిసెంబరు, 2015












## పిల్లల పండుగ..ఒక కలలా...ఒక కథలా...
## కొత్తగూడెంలో బాలోత్సవ్







"భాషా భావజాల
దారిద్ర్యంలో
మన పాలకులు.."

'ఎబికె'తో మాటామంతీ

- తెలుగు కోసం రాజకీయ ఉద్యమం తప్పదు
- తెలుగు రాష్ట్రాల్లో వ్యవసాయం కుదేలు!
- తురక తెలుగు - తురక వేదం!!

**'అమ్మనుడి'** పత్రిక మీకు నచ్చితే, దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

*చందా సొమ్మును మీకు ఈ క్రింది రీతుల్లో మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.*

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో డబ్బు పంపేవారు NEFT / RTGS ద్వారా పంపించాలి.
- బ్యాంకు డి.డి. / మల్టీసిటీ చెక్ పంపవచ్చు.

*వివరాలు 4వపుటలో చూడండి.*

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తున్నది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి. 2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

24 ఏళ్ళ చరిత్రను మూటగట్టుకున్న కొత్తగూడెం బాలోత్సవ్ కార్యక్రమాలు ఒక ఆదర్శంగా...ఆచరణలో మన ముందు కనపడుతున్నాయి.

డా॥వాసిరెడ్డి రమేష్, ఆయన మిత్ర బృందం కలిసి సృష్టిస్తున్న ఈ జాతి నిర్మాణ కార్యక్రమాన్ని చూసి వద్దాం రండి!

**పుటలు....26-30**



## లోపలి పుటలలో....




ౖకసేత-ముఖచిత్రం : **కలిమిశ్రీ**

రేఖాచిత్రాలు : **బాలి**

ఫోటోలు : **టి.శ్రీనివాసరెడ్డి, రాజేంద్రప్రసాద్**

పకపకలు : **సరసి, శేఖర్**





**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**

జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com

దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 : మన్మథ నామ సంవత్సర కార్తీక మాసము ***(జీరాపి)** బహుళ షష్ఠి మంగళవారము నుండి మార్గశిర ***(ఈరాపి)** బహుళ షష్ఠి గురువారము వరకు

*** జీరాపి * ఈరాపి** : తెలుగు నెలలు


## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| **శాశ్వత చందా** | : | **రూ.5000** | **రూ.7500** | -- |
| **6 సం॥** | : | **రూ.1000** | **రూ.1500** | **150 డాలర్లు** |
| **3 సం॥** | : | **రూ. 600** | **రూ.1000** | **75 డాలర్లు** |
| **1 సం॥** | : | **రూ. 240** | **రూ. 400** | **25 డాలర్లు** |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా


**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంప గలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000/- లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వత చందా రు. 5000/-లకు గాను రు. 4000/- లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన.

'అమ్మనుడి'కి శాశ్వత చందా దారులుగా కొనసాగలేని వారు సాధారణ చందాదారుగా చేరి పత్రికను తెప్పించు కోవచ్చును. దయచేసి సహకరించగోరు తున్నాము.

## 'నడుస్తున్నచరిత్ర' చందాదారులకు...

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్న చరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్న చరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటి వరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరు నామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్నచరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయి పోయిన వారికీ కూడా పంపించాము. ఆ తర్వాత చందా మిగిలి ఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపిస్తున్నాము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందా సొమ్మును పంపించక పోయి ఉండవచ్చు. అటువంటి వారు దయచేసి వెంటనే పత్రిక చందాను పంపించి సహకరించగోరుతున్నాం.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపి స్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేర వలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తిమంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరి ప్రతి (శాంపుల్‌కాపి)ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.



### శ్రీమతి మన్నవ స్రవంతి

1975 అక్టోబరు 30న పుట్టిన స్రవంతి ఇంగ్లీషు సాహిత్యంలో బి.ఏ.చేశారు. తెలంగాణ లోని ఖమ్మం జిల్లా వీరిది. ఆమె భర్త శ్రీ మన్నవ శ్రీనివాస్. తూర్పుతీర నావికా దళానికి ఆర్థిక సలహాదారుగా ఉన్నారు. ఉద్యోగరీత్యా మూడేళ్ళకోసారి రాష్ట్రం మారవలసి వచ్చినా, తన ఇద్దరు కుమారుల్ని చక్కని తెలుగులో మాట్లాడేట్లు ఈమె తీర్చిదిద్దారు. ఇద్దరూ తెలుగును చక్కగా రాయగలరు. ఎక్కడ చదువుకొన్నా వారిద్దరూ ఒక సబ్జెక్టుగా తెలుగును నేర్చుకొనేట్లు ఆమె తగు ఏర్పాటు చేస్తారు. స్రవంతి తను 2వ తరగతి చదివే రోజుల్నుంచీ ఎప్పుడూ తెలుగు పుస్తకాలను చదవడం అలవాటు చేసుకొన్నారు. నేటికీ ప్రతిరోజూ ఒకటి రెండు తెలుగు పుస్తకాల్ని చదువ వలసిందే. భర్త శ్రీనివాస్ 1996 వరకు కస్టమ్స్ ఇన్స్పెక్టర్‌గా పనిచేస్తూ యు.పి.ఎస్.సి పరీక్షలో ఉత్తీర్ణులై ఐడిఏఎస్‌ను పొందారు.

తెలుగు భాషోద్యమకారులకు, సాహితీవేత్తలకు, ఆత్మీయంగా ఆతిథ్యం ఇవ్వడం స్రవంతికి ఇష్టమైన పని. తెలుగుజాతి ట్రస్టును నమోదు చేసిన చిరునామా గల ఇల్లు వారిదే. 'అమ్మనుడి'ని ఎంతో అభిమానించే స్రవంతి రు.50,000/-లు విరాళం ఇచ్చి విశిష్ట పోషకులుగా 'తెలుగుజాతి' ట్రస్టును ఆదరిస్తున్నందుకు వారికి ధన్యవాదాలు తెలుపుతున్నాము.

విశాఖపట్నం
సెల్ : 96524 20130



హైదరాబాదు

### డా॥సోమూరి ప్రమీల

పదివేల రూపాయలు విరాళం ఇచ్చి తెలుగుజాతి ట్రస్టును ఆదరించిన శ్రీమతి డా॥సోమూరి ప్రమీల స్వాతంత్ర్య సమరయోధులు కీ.శే.సోమూరి వెంకట్రామయ్య గారి కుమార్తె. హైదరాబాద్ నాంపల్లి లోని ఇందిరా ప్రియదర్శిని ప్రభుత్వ మహిళా కళాశాలకు ప్రిన్సిపాల్‌గా పనిచేసి, 1998లో ఉద్యోగ విరమణ చేశారు. వీరి భర్త డా॥వై.పి. ప్రభాకరరావు గుంటూరులోని లాంఫామ్‌లో పనిచేసి ఉద్యోగ విరమణ చేశారు. 'నడుస్తున్న చరిత్ర' పత్రికకు సోమూరి వెంకట్రామయ్యగారు శాశ్వత చందాదారు, శ్రేయోభిలాషి. అప్పటి నుండి వారి కుటుంబ సభ్యులు నాటి 'నడుస్తున్న చరిత్ర'కు, నేటి అమ్మనుడి'కి అభిమాన పాఠకులు. వారికి ధన్యవాదాలు.

## తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగింది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది.దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సుకోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

**పుస్తకాల ప్రచురణ:** తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలో మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించబోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | | | |
|---|---|---|---|
| పోత్సాహకులు | రు. 10,000/-లు | పోషకులు | రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు | రు. 50,000/-లు | రాజ పోషకులు | రు. 1,00,000/-లు |

దాత ఫోటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.
వీరికి పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136
ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# అయినా... ఏలినవారి తీరు మారలేదు!!




**రా**జధాని నిర్మాణానికి ప్రధానమంత్రి చేత శిలాఫలకాన్ని వేయించినప్పుడు దానిపై ఒక్క తెలుగు అక్షరం కూడా లేకుండా చేసిన మన పాలకుల దుశ్చేష్టలను ప్రజలంతా అసహ్యించుకుంటున్నా, ఈ ప్రభుత్వానికి తెలివి రాలేదు. ఇదే ప్రభుత్వ భాషా విధానం అని, ఇది తెలుగు ప్రభుత్వమే కాదని పలువురు పెదవి విరిచినా పట్టించుకొనే వారు లేరు. చేసిన తప్పునే మళ్లీ కావాలనే ప్రభుత్వం చేసిందని ప్రజలు అనుకొంటున్నారు. గుంటూరులో వ్యవసాయ విశ్వవిద్యాలయానికి శంకుస్థాపన చేసి, వేసిన శిలాఫలకంపైన కూడా ఒక్క తెలుగు అక్షరం కూడా లేకుండా చేసి తన అంతర్జాతీయ భాషావిధానాన్ని చాటుకుంది ఈ ప్రభుత్వం. దానికి సాక్షులుగా ముఖ్యమంత్రి, శాసనసభాపతి, ఉప ముఖ్యమంత్రి, కేంద్ర మంత్రులు, రాష్ట్ర మంత్రులు, శాసనసభ్యులు నిలబడ్డారు. **ఇవీ ముచ్చట్లు!**

## దేశమంటే మట్టీ పుట్టా నీళ్ళేనా..?

*ఎక్కడి మట్టినైనా, పుట్టనైనా పురుగూ, బుసీ అని లేకుండా*
*రేయి పగలూ పట్టించుకోకుండా తవ్వి తవ్వి, తురుంచేసి*
*మట్టిని మాగాణం చేసి, ధన, మాన ప్రాణాల పంటచేసి*
*పూలూ, కూరగాయలూ*
*మీ చేతుల కందిస్తున్నదెవురు చెప్పండి?*
*మహా ప్రభువులు మీరు...*
*నోట్లమెట్లెక్కి పాలించే దొరలు మీరు!*
*దేశమంటే మట్టికాదు మనుష్యులేనని; కదిలే మనుష్యులనీ*
*ఎన్నిసార్లు, ఎవరు చెప్పాలి మీకు?*
*మాటంటే భాష అనీ, భాషంటే జాతి అనీ*
*భాషా ద్రోహం జాతికే ద్రోహం అనీ*
*ఎన్ని సామాజిక శాస్త్రాలు ఎలుగెత్తి హోరెత్తినా పట్టించుకోరు మీరు*
*ప్రజల భాగస్వామ్యం లేకుండా ప్రజల భాషా ప్రమేయం లేకుండా*
*స్వార్థ ఫలకాలై సోకులు పోవటం మీకే చెల్లు*
*ప్రజాధనంతో మాటిమాటికీ పెడబొబ్బలు పెట్టి*
*మోగిస్తున్న మీ ప్రచార, ప్రసారాల్లో నైనా*
*మీ రచ్చ, రాజసాల్లోనైనా*
*మమ్మల్ని రైతులూ, కూలీలుగా తప్ప..*
*రక్తమాంసాల మనుష్యులుగా గుర్తించారా మీరు?*
*మా బతుకుల్లో మట్టీ... మా కళ్ళల్లో నీళ్లూ తప్ప*
*మీరేం మిగిల్చారు?*
*గుడులు గోడుగోడలు చేశారు*
*బడులు రాబడులు చేశారు*
*వైద్యం వల్లకాడు చేశారు*
*ఆరుగాలం అష్టకష్టాలు పడ్డవారికి*
*ఆత్మహత్యలే శరణ్యం చేశారు*
*అమ్మ భాషా సంస్కృతులను అమ్మకానికి పెట్టి*
*ఛప్పన్నారు దేశాల చెప్పులు మోసే చికమకలకు*
*సాగిలపడమంటున్నారు..*
*అక్షరాన్ని తుంగలో తొక్కి*
*ఆర్థికమే అవసరమని ఎవరిని సేదతీర్చడానికి..?*
*ఎవరి క్షేమం సాధించడానికి..?*
*ఈ రాగధ్వని లేని రాజధాని నిర్మాణం!*
*ఎవరి వ్యాపార పారావారాన్ని ఈదడానికి ఈ ఆపసోపాలు?*
*ఇప్పటికే చెవిలో 'నారాయణో... నారాయణో'... అని*
*చావు 'గంట' విన్పిస్తూ కార్పొరేట్ కాళ్ళకింద*
*తెలుగు గిజగిజలాడుతుంటే*
*తెలుగు ధాన్యకటకాన్ని ఏ తెగులు కప్పగిస్తారు?*
*తెలుగు బతుకుల్ని ఏ తొత్తులకంటగడ్తారు?*

**–వెలుగు వెంకటసుబ్బారావు,** ఉపాధ్యాయుడు, కవి
చరవాణి : 92909 42433

సంపుటి : 1 సంచిక : 10
అమ్మనుడి
డిసెంబర్ 2015

సంపాదకీయం

# తెలుగుకోసం రాజకీయ ఉద్యమం తప్పదు

మన అమ్మనుడి తెలుగుకు ఇంటాబయటా ముప్పు ముంచుకొస్తున్నది. మన కళ్లను మనమే పొడిచి వేసుకొంటున్నట్లు, మన గొంతును మనమే నులిమివేసుకొంటున్నట్లు తెలుగు ప్రజల గుండెల్లో ఒక భయంకరమైన అనుభూతి మెల్లమెల్లగా పేరుకొంటున్నది.

తెలుగు రాష్ట్రాలుగా ఏర్పడిన ఆంధ్ర, తెలంగాణల్లోనే పాలకవర్గాలు తెలుగును పట్టించుకోవడంలేదు. నేతలు మాట్లాడుతున్నది తెలుగే, ప్రజల భాషే. సాంస్కృతిక కార్యక్రమాలుగా మనం ప్రదర్శించే శాస్త్రీయ, జానపద కళారూపాలు గానీ, సినిమా–టీవీల్లోగాని, పత్రికల్లోగాని అంతటా తెలుగే. తెలుగు సాహిత్యం– కథలుగా, కవితలుగా పలురూపాల్లో వెల్లువెత్తుతూనే ఉంది. మరి– తెలుగుకు వచ్చిన ముప్పేమిటి?!

మనమూ, మన నాయకులూ తెలుగు గొప్పదనం గురించి– అది తెలంగాణ తెలుగన్నా, ఉత్తరాంధ్ర తెలుగన్నా, తీరాంధ్ర తెలుగన్నా, రాయలసీమ తెలుగన్నా తెలుగు అంతా మనదే అని చెప్పుకొంటున్నాం. పోటీ పరీక్షల్లోనో, పెద్దచదువుల పోటీల్లోనో, ఆటపాటల్లోనో, సాంకేతిక రంగంలోనో అంతటా మన తెలుగు వాళ్లే ముందంజలో ఉన్నారని చెప్పుకొంటాం. వాళ్లలో ఎందరికి తెలుగు వ్రాయడం, చదవడం వచ్చినా రాకున్నా వాళ్లంతా తెలుగువాళ్లే. తెలుగు నేలమీద నుంచి వచ్చారా లేదా అన్నదే ముఖ్యం! తెలుగునేల అంటే ఆంధ్ర తెలంగాణలే. ఇంతవరకే మన అవగాహన. ఈ రెండు రాష్ట్రాలకు పాలకులు తెలుగువాళ్లేగదా, పరాయివాళ్లెవరూ పరిపాలించడం లేదు గదా– మరెందుకీ గగుర్పాటు?! పాలకులు మనవాళ్లే. మనకు వాగ్దానాలు చేస్తున్నదీ, ఓట్లు అడుగుతున్నదీ అంతా తెలుగులోనే కదా....మరెందుకీ ఆందోళన!

"ఇప్పుడు మనమూ మన పిల్లలూ జాతీయంగా, అంతర్జాతీయంగా ఎంతో ఎత్తుకు ఎదగవలసి ఉంది. ఇందుకోసం మనం ఇంగ్లీషును ఔపోసనపట్టాలి. అక్కర వచ్చినపుడు హిందీగాని, చైనీస్‌గాని, జపనీస్‌గాని, మరొక భాషగానీ ఏదైనా నేర్చుకొందాం. తెలుగువల్ల ఉపయోగం ఏముంది?! ఒక భాషగా తెలుగును కొద్దిగా నేర్చుకొంటే చాలదూ? కంప్యూటర్లు, అందులో ఇంటర్‌నెట్లూ మన బల్లల మీద నుంచి మన చేతుల్లోకి వచ్చేసి, వాటిలో అన్ని అవసరాలను ఇంగ్లీష్‌తోనే తీర్చుకొనగల రోజుల్లో –మళ్లీ మనం శ్రమపడి మన భాషను ఆ స్థాయికి ఎదిగించుకోవాలా? ఎంత తెలివితక్కువ ఆలోచన! ఎంత సమయం వృధా! అసలెందుకీ గోలంతా? 60 ఏళ్లకు పైగా పరిపాలనలో, చదువుల్లో మెల్లమెల్లగా ఇంగ్లీష్ ఆధిపత్యం స్థిరపడుతున్న దశలో మళ్లీ తెలుగుపాలన, తెలుగు చదువులు– ఏమిటి ఈ రొద?" ఇదీ మన పాలకవర్గాల, అధికారవర్గాల ఆలోచన. పైకి అన్నా అనకపోయినా వారి పట్టనితనానికి కారణం ఈఆలోచనే. రాజకీయ రంగమూ, మేధోరంగమూ పరాధీనమైపోయింది. కచ్చితంగా చెప్పాలంటే వాళ్లంతా దోపిడీదార్లుగా మారిపోయారు. ఏమాత్రం స్వాభిమానంలేని, కాలంతోపాటు కొట్టుకుపోయే, లొంగిపోయే వాళ్లుగా తయారైనారు.

తెలుగు నేలమీద తెలుగు గురించి మాట్లాడే రాజకీయ పార్టీలే కరువైనాయి. కాంగ్రెస్ పార్టీని మాత్రమే అనడానికి వీల్లేదు, తెలుగు పేరుతో పుట్టి పాలకవర్గంగా ఎదిగిన తెలుగుదేశం పార్టీకి కూడా తెలుగు సంగతి పట్టదు. వాళ్ల మాటలకు చేతలకు పొంతన ఉండదు. రాజధాని నిర్మాణానికి వేసిన శిలాఫలకంపై ఇంగ్లీషును మాత్రమే ఉంచి, తెలుగు అక్షరం లేకుండా చేసిన ఘనత వీరిది. ఆరోజునే తిరుపతిలో మొబైల్ ఫోన్ పరికరాల 'హబ్బు'కు వేసిన పేరు పలకపైనా ఇదే గబ్బు! ఈ నెలలో గుంటూరులో వేసిన వ్యవసాయ విశ్వవిద్యాలయ శిలాఫలకంపైనా ఇదే తీరు! ఈ పరిపాలకులకు సిగ్గు వేయడం లేదా అని జనం అనుకుంటున్నారు. కాని వాళ్లు ఆ ఇంగితాన్ని వదిలివేసినట్లే కనిపిస్తోంది. ఇది చిన్న విషయం కాదు. అధికార వర్గాల్లో తెలుగు పట్ల ఉన్న చిన్నచూపుకు, తిరస్కారభావనకు అద్దం పట్టే మచ్చులు మాత్రమే ఇవి. ఆ సందర్భాల్లో అక్కడ ఉన్న కేంద్ర రాష్ట్ర తెలుగు నాయకులు ఎవరూ ఏమీ మాట్లాడరు! ఇతర పార్టీల వారూ మాట్లాడరు. కమ్యూనిస్టుల్లో ఒకటీరెండు

చీలికవర్గాల సాహితీరంగాల వారు తప్ప అసలు పార్టీ నేతలెవరూ పెదవి విప్పరు. భారతీయ జనతాపార్టీ సంగతీ, వారి సోదర సంస్థల సంగతీ ఎంత తక్కువ చెప్పుకుంటే అంతమంచిది. భాషపై వారి ప్రేమకు కూడా భారత జాతీయతే గీటురాయి తప్ప స్థానిక జాతీయత ఉండదు! స్థానిక భాషలన్నీ కనుమరుగై దేశం మొత్తానికీ ఒకే భాష.. అది సంస్కృతం గాని, లేదా సంస్కృతీకరించిన హిందీ గాని ఉంటే హిందుత్వ జాతీయత బలపడుతుందన్న దురాశ వారిది! ప్రజల భాషలు ఎలా పుట్టి పెరుగుతాయన్నదానిపై శాస్త్రీయ అవగాహనగాని, వాటిపై ప్రేమగాని లేదు. ఆత్మవిస్మృతికి లోనైన ఆలోచనా ధోరణులన్నీ ఇలాగే ప్రజావ్యతిరేకంగానే ఉంటాయి.

తెలుగునేలమీద ఈ పరిస్థితులుండగా, పొరుగు రాష్ట్రాల్లోని తెలుగువారి కష్టాలను గురించి మాట్లాడడానికి మన నాయకులకు నోరెలా వస్తుంది?! అందుకనే తమిళనాట తెలుగును తొక్కివేస్తున్నా మన నాయకులు ఏమీ మాట్లాడరు. ఉన్నట్లుండి కొందరు నేతలు తెరపైకివచ్చి ఏవో ప్రసంగాలు చేస్తారు– ప్రచారం కోసం! ఇతర రాష్ట్రాల్లోకి కూడా ఎగబాకి, జాతీయపార్టీగా ఎదుగుతాం అని ప్రకటించిన తెలుగుదేశం పార్టీ నాయకులు నిద్ర మేల్కొంటారో లేదో తెలియదు. పొరుగురాష్ట్రాల్లో ఎలాగైనా తిప్పలుపడి రెండు మూడు సీట్లు తెచ్చుకోవాలనే తొందరపాటు తప్ప, వారికి అక్కడి తెలుగువారిపైగాని, వారిభాషపై గాని మక్కువ ఏమీ లేదని తెలియడం లేదూ?!

కొందరు సూచిస్తున్నట్లు ఒక సిద్ధాంత ప్రాతిపదికన తెలుగు గురించి, తెలుగుజాతి సంపూర్ణ విజయం గురించి పనిచేసే ఒక బలమైన రాజకీయ ఉద్యమం రావాలి. ఇందుకు కావలసిన కొంత భావజాలాన్ని, ఆలోచనను ఇప్పటిదాకా జరిగిన, జరుగుతున్న భాషోద్యమాలు కలిగిస్తున్నాయి. వాటిని నేటి రాజకీయ నాయకులు గుర్తించడానికి, తమను తాము సంస్కరించుకొని ముందడుగు వేయడానికీ తిరస్కరిస్తున్నారు. కనుక ఇక ప్రత్యామ్నాయంగా సామాజిక రాజకీయ ఉద్యమాన్ని నిర్మించడమే తప్ప వేరే దారి లేదు. భాషా విధ్వంసాన్నీ, దాని వల్ల ఏర్పడే జాతి విధ్వంసాన్ని ఆపడం కోసం ఈ ఉద్యమం తప్పనిసరి. దాని పరిణామాలు ఇప్పుడున్న రాజకీయ పార్టీల ఆలోచనలను మార్చగలిగినా, లేక కొత్తరాజకీయ పార్టీల నిర్మాణానికి దారితీసినా అది తెలుగు ప్రజలకు మేలునే చేకూర్చుతుంది.

మన అమ్మభాష తెలుగు. శాస్త్రీయంగా మానవీయంగా ఆలోచిస్తే అర్థమయ్యే అంశమే ఇది. తన అమ్మభాషలో తాను నేర్చుకోవాలి... అనంతమైన విజ్ఞానాన్నంతా నేర్చుకోవడానికి తన భాషే తన తొలి అడుగూ, మలి అడుగూ, ముందడుగూ కావాలి. దాని పునాది మీద ప్రపంచ మానవాళితో కలిసిపోవాలి. ఈ దారిలో సాగేందుకే మనదేశంలో భాషారాష్ట్రాలు ఏర్పడ్డాయి. అయితే ఒక భాష మాట్లాడే వారంతా ఒకే రాష్ట్రంలో ఉండాలనే వాదం చెల్లదు. ప్రజలు ఒకే భాషవారైనా అనేక ప్రాంతాల్లో విస్తరించి ఉన్నప్పుడు– వారి రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక, పాలనావసరాలలో వైవిధ్యం ఉంటుంది గనుక ఒకే భాష మాట్లాడుతున్నా వారికి ఒకటి కంటె ఎక్కువ రాష్ట్రాలు ఏర్పడవచ్చు. అలా ఏర్పడక తప్పదు కూడా.

భాషలు చిన్నవైనా, పెద్దవైనా, ఎవరి భాషవారికి ఊపిరి. కొన్ని వేల ఏండ్ల చరిత్ర కలిగి, ఒక పెద్దభాషగా అన్నిరంగాల్లో ఎదగే శక్తి ఉన్న తెలుగుభాష మన ఊపిరి. మన ఊపిరిని మనం కాపాడుకోవద్దా? మన భాషతోనే మన జ్ఞానాన్ని ఎదిగించుకోవద్దా? తెలియని భాష ద్వారా జ్ఞానాన్ని సంపాదించాలనడం కంటె ఆధిపత్య భావజాలం, మోసం మరొకటుంటుందా? సొంతభాషపై పట్టుంటేనే కదా, ఇతర భాషల్ని మనం నేర్చుకోగలిగేది!

మన రాష్ట్రాల్లోనూ ఇతర రాష్ట్రాల్లోనూ మనభాషను రక్షించుకోవడానికి ఎలాంటి సామాజిక, రాజకీయ ఎత్తుగడలను చేపట్టాలో ఇప్పుడు తెలుగు ప్రజలు ఆలోచించుకోవాలి. 'తెలుగుతోనే వెలుగు' అనేది నినాదం మాత్రమే కాకూడదు. అన్ని వైపులా చీకట్లు కమ్ముకొస్తున్నప్పుడు ముడుచుకొని కూర్చోవడం తగదు. ఆధునికావసరాలకు తగ్గ భాషగా తెలుగును ఎదిగించుకునేందుకు ఇప్పటికే యువత ముందుకొస్తున్నారు. వారిలో మరింత భాషాచైతన్యం, జాతి చైతన్యం పొంగుకు వస్తున్న సూచనలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. తెలుగు యువత తన పనిని తాను చేస్తుంది. నివురుకప్పిన నిప్పులా ప్రజల్లో ఉన్న భాషాభిమానాన్ని కదిలించి, ఉద్యమరూపంలోకి తీర్చిదిద్దగల కొత్తనాయకత్వం ఎక్కడికక్కడే పుట్టుకురావాలి. ఇందుకు అదను ఇదే.

**30-11-2015**

సామల రమేష్‌బాబు

- ఆచార్య పులికొండ సుబ్బాచారి

# సమకాలీన అవసరాలు-తెలుగు భాషావ్యూహాలు

నిత్యం ప్రవహించే నది వాడుక భాష. వాడుక భాషే కాదు వివిధ అవసరాల కోసం వినియోగించుకునే భాష కూడా స్థిరంగా ఉండాలనుకోకుండా అను నిత్యం అవసరాలకు అనుగుణంగా మారే స్వభావం కలది. అంటే భాషకు దానికై దానికి మారే స్వభావం స్వతహాగా ఉండదు. దానిలో మార్పు తెచ్చేది దాని వినియోగదారులే. ఇక్కడ వినియోగదారులు అంటే సృజనకారులు కూడా. తెలుగు చాలా పెద్ద భాష అంటే చాలా పెద్దసంఖ్యలో మాట్లాడే వారున్న భాష. అంతే కాదు లేఖన వ్యవస్థలో కూడా చాలా పెద్ద సంఖ్యలో వాడుకరులు ఉన్న భాష. విస్తృతమైన అవసరాలకు లిఖితంగా వినియోగించుకోవలసిన భాష. ఇలా భాషని వినియోగించుకునేది ఒకరు కాదు. అతి విస్తృతమైన భౌగోళిక ప్రాంతంలో, వివిధ ప్రాంతాలలో ఉండే వ్యక్తులు ఒకేసారి వివిధ అవసరాలకు వినియోగించుకోవచ్చు. అంతే కాదు సంస్థలు కూడా వాటి అవసరాల కోసం భాషను వాటికి అనుగుణమైన పద్ధతిలో రూపకల్పన, పద కల్పన చేసుకోవచ్చు. అంటే భాషలో మార్పులు చేర్పులు చేసుకోవచ్చు. ఈ రకంగా తెలుగుభాష చాలా చలనశీలమైన గతిశీలమైన భాష. ప్రవాహినీ దేశ్యా అనే మాట తెలుగుకు అటు నోటి మాటకు ఇటు లేఖన వ్యవస్థలో ఉన్న తెలుగుకు వర్తిస్తుంది. ఇక్కడ తెలుగుకు ప్రత్యేకమైన అవసరాలు నేటి కాలంలో ఏమి ఉన్నాయి. వాటికి అనుగుణంగా తెలుగును ఎలా మార్చుకొని మలచుకోవలసి ఉంటుంది అనే విషయాలు ఇక్కడ చర్చ చేస్తాను. నాముందు ప్రసంగించిన విద్వాంసులు ప్రస్తావించిన విషయాలను నేను కూడా ప్రస్తావించవలసి వస్తుంది. కాని భిన్నమైన కోణంలో చర్చ చేస్తాను.

**ప్రాథమిక హక్కుగా పాలన భాష:**

ప్రజాస్వామ్యవ్యవస్థలో ప్రజలే ప్రభుత్వాలను ఎన్నుకుంటున్నారు. వారే ప్రభువులు కూడా పాలకును ఎన్నుకునేది వారే పాలకులు వారే. అలాగే పాలితులు కూడా వారే. పరిపాలించే ప్రక్రియ నడవడానికి అంటే పాలన కోసం ఒక భాష కావాలి. అది ఏది కావాలి ఎలా ఉండాలి అన్నది చాలా ప్రముఖ చర్చనీయాంశం.

భారతదేశాన్ని దాదాపు మూడు శతాబ్దాలపాటు ఇంగ్లీషు వారు పరిపాలించారు. ఇతరేతర సమస్యలు అంతా పోయి బ్రిటిషు వారు భారత దేశాన్ని మొత్తం వారి అధీనంలోనికి తెచ్చుకున్న తర్వాత పూర్తి దేశాన్ని వారే పరిపాలించడం ప్రారంభించిన తర్వాత దేశం మొత్తానికి వారి భాష ఇంగ్లీషును పాలన భాషగా అధికారభాషగా చేసి పరిపాలించారు. ప్రభుత్వ పాలనలో పనిచేయవలసిన భారత దేశం వారు అందరూ విధిగా ఇంగ్లీషు నేర్చుకొనవలసి వచ్చింది. కొన్ని కులాల వారు విద్యాధికులైన వారు ఇంగ్లీషు నేర్చుకొని పాలనలో ఏలిన వారి కోరిక మేరకు భాగస్వామ్యం పొందారు. వారు పరిపాలించిన ప్రధాన కాలం అంతా ఒక దేశంలో కాని ఒక ప్రాంతంలో కాని మొత్తం ఆంగ్లాన్ని పాలనభాషగా చేశారు. ప్రజలు వారికి అర్థం అయినా కాకున్నా మొత్తం వారి పనులు అన్నింటిని ఇంగ్లీషులోనే విధిగా చేసుకొనవలసి వచ్చింది.

ఇదే రకంగా తెలుగునేలలో ఒక విడదీయరాని భాగమైన తెలంగాణ ప్రాంతాన్ని కుతుబ్షాహీలు, అసఫ్జాహీలు కలిసి దాదాపు నాలుగు శతాబ్దాలు పాలించారు. ఆ కాలంలో ఉర్దూ మాట్లాడే వారు తెలంగాణనేలలో మూడు నుండి నాలుగు శాతం మాత్రమే ఉన్నారు. కాని మిగతా 97 శాతం ప్రజలపైన ఉర్దూనే అధికార భాషగా రుద్దారు. పూర్తి స్థాయిలో పాలన భాషగా ఉన్నత విద్యను నేర్పే బోధనభాషగా కూడా అమలు చేశారు. దాని ప్రభావం ఈనాటికీ తెలుగుపైన చాలా గట్టిగా ఉంది. ఇక్కడ రెండు సందర్భాలలోను పాలకులు పాలితుల పైన వారి భాషని బలవంతంగా రుద్దారు. ప్రజలు విధిగా లొంగి పోవలసి వచ్చింది.

తెలుగు రాష్ట్రాలలో నివసించే ఒక తెలుగువాడు తన ఊర్లో తన ఇంటికి దగ్గరలో తనకోసం ఉన్న ప్రభుత్వ కార్యాలయానికి పోయి తనకు కావలసిన తన పనులు అన్నింటిని తన భాషలో తనకు వచ్చిన తనకు తెలిసిన భాషలో చేసుకోగలగాలి. ఇలా చేసుకోగలగడం అనేది స్వతంత్ర భారత దేశం తనకు ఇచ్చిన వరం. తన ప్రభుత్వం తన భాషలోనే పనిచేయడం అనేది తాను ఎన్నుకున్న ప్రభుత్వానికి ఉన్న మొదటి బాధ్యత. తాను ఎన్నుకున్న ప్రభుత్వం తన భాషలో పనిచేయడం అనేది అతను అధికారికంగా చెప్పగలిగే మాట. తన ప్రభుత్వం తన భాషలో పనిచేయడం అనేది అతని ప్రాథమిక హక్కు. ప్రజాస్వామ్యదేశంలో ప్రజలకు తమ భాషలో ప్రభుత్వాన్ని పనిచేయించడం అనేది ఒక ప్రాథమిక హక్కుగా ఉండాలి. పరిపాలన భాష అనేది ప్రజల భాషగా మాత్రమే ఉండడం అనేది ప్రజలకున్న ప్రాథమిక హక్కుగా గుర్తిస్తూ ఈ మేరకు రాజ్యాంగ సవరణ చేయాలి. తెలుగు రాష్ట్రంలో ప్రభుత్వం తెలుగులోనే పని చేయడం అనేది తెలుగు ప్రజల ప్రాథమిక హక్కుగా రావాలి. అందుకు తెలుగు ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలు కర్తవ్యోన్ముఖంగా పనిచేయాలి. అలా చేయించే బాధ్యత ప్రజల మీద కూడా ఉంది. ఇందుకు ఉద్యమించి ప్రభుత్వాలు అంగీకరించేలా ఒత్తిడి చేయవలసిన అవసరం కూడా తెలుగు ప్రజలకుంది. ఇది కేవలం ఒకటి రెండు చిన్న చిన్న ప్రభుత్వ ప్రభుత్వేతర సంస్థలకు మాత్రమే ఉన్న బాధ్యత అన్న భావనకే పరిమితం అయితే మనం దీన్ని సాధించలేము. ప్రజల భాషే పాలన భాష ఇది ప్రజల ప్రాథమిక హక్కు అనే వాక్యాన్ని నినాదంగా ప్రచారం చేద్దాం.

**తెలుగు ప్రాధికార సంస్థ:**

ఎందరో పెద్దలు భాషా ప్రేమికులు తెలుగుకు ఒక ప్రత్యేక మంత్రిత్వ శాఖ ఏర్పడాలని అవిరళ కృషి చేశారు. పూర్తిగా అనుకున్న రూపంలో కాకున్నా దీనికి ఒక ప్రత్యేక శాఖ ఏర్పడింది. కాని తెలుగు

పరిస్థితి ఎక్కడున్న గొంగడి అక్కడే ఉంది అని కూడా చెప్పలేని స్థితి ఏమంటే గొంగడి ఎక్కడ ఉన్నది అక్కడ ఉన్నట్టే ఉన్నా కొంత నయం అని అనుకోవచ్చు. కాని గొంగడి చీకి చింపిరి అయింది అని చెప్పే పరిస్థితి ఏర్పడింది. నాలుగో ప్రపంచ మహాసభలని అట్టహాసంగా జరుపుకున్నాం. ఆతర్వాత అనివార్యమైన చారిత్రక కారణాల ఫలితంగా తెలుగు వారు ఒక రాష్ట్రం నుండి రెండు రాష్ట్రాలుగా అభివృద్ధి చెందారు. తెలుగు జాతి మనది నిండుగ వెలుగు జాతి మనది అన్న కవిగారు, చివరికి తెలుగు జాతి మనది రెండుగ వెలుగుజాతి మనది అని మాట మార్చుకోవలసిన పరిస్థితి ఏర్పడింది. ఆయన తన కత్తికి రెండు వైపులా పదును ఉందని చెప్పుకున్నారు. రెండుగానైనా తెలుగు భాష వెలిగితే మనకు సంతోషమే. కాని తెలుగు పరిస్థితి పెనంలో నుండి పొయ్యి లోనికి పడింది అని చెప్పవలసిన అగత్యం వచ్చింది. కొత్త రాష్ట్రాలు ఏర్పడిన నేపథ్యంలో పాలకులకు ఎదురైన చాలా పెద్ద పెద్ద సమస్యలు సవాళ్ళ మధ్య భాష విషయం చాలా చిన్నదై పోయింది. కాని ఎదురౌతున్న సమస్యలతో పాటు భాషా సమస్య కూడా చాలా పెద్దదే అనే సత్యాన్ని ఏలినవారు గమనిస్తే తెలుగు భాష అమలు పట్ల దాని వికాసం పట్ల విడివిడిగాను ఉమ్మడి గాను భాషా వికాస ప్రణాళికలను వ్యూహాలను ఏర్పాటు చేసుకోవ డానికి వీలయ్యేది. కాని అలా ఇంకా ఆలోచించక పోవడం బాధా కరంగానే మిగిలింది. ఆలోచించే అవసరం ఉందని కూడా ఇంకా గుర్తించలేదు.

అధికార భాషా సంఘం అనేది ఒకటి ఉండి, అది అంతో ఇంతో కొంత పనిచేస్తూ ఉండేది. కాని అలాంటి దాన్ని తిరిగి ఏర్పాటు చేయాలని ఇంకా ప్రభుత్వం దృష్టి పెట్టవలసే ఉంది. అధికార భాష అమలుకు సంబంధించి తెలుగు అధికార భాషా సంఘాన్ని అది పునరుద్ధరించుకోవలసి ఉంది. అయితే అయిదేండ్ల కొకసారి లేదా మూడేండ్లకొకసారి ఏర్పాటు చేసేది అందునా ప్రభుత్వం ప్రతిసారీ నియమించే కొత్త సభ్యుల పద్ధతి అంత ఫలవంతంగా లేదని ఇంతకు ముందు చాలాసార్లు ఋజువు అయింది. సభ్యులను అధ్యక్షుడిని నియమించిన ప్రతిసారి అది రాజకీయ నియామకం అని విమర్శలు తీవ్రస్థాయిలో వచ్చాయి. సాహిత్యవేత్తలకు భాషా ప్రణాళిక రచనలకు చాలా అంతరం ఉందని సాహిత్య వేత్తలు అందరూ భాషావేత్తలు కాని ప్రణాళికాకారులుగా కాని కారని ప్రభుత్వాలు గ్రహించలేక పోయాయి. ఈ విషయాన్ని అలా ఉంచితే. అప్పటి అధికార భాషా సంఘాలు పాలన భాషకోసం చేసిన ప్రయత్నాలు రూపొందించిన విధానాలు చాలా వరకు ఉపయుక్తమైన వాటిని తిరిగి గ్రహించవచ్చు. ఆంధ్రప్రదేశ్ ఉమ్మడి రాష్ట్రానికి అమలు చేసిన భాష ప్రమాణ భాష పేరుతో గోదావరి మాండలికాన్ని వినియోగించారు అనేది అప్పటి విమర్శ. కాని ఈ భాష నవ్యాంధ్ర ప్రదేశ్ రాష్ట్రానికి ఉపయుక్తంగానే ఉంటుంది. దీనివల్ల కొంత రాష్ట్ర ప్రభుత్వానికి పని తగ్గే వీలుంది. కాని ఈ భాషను అమలుపరిచే శాశ్వత యంత్రాంగం ఒకటి ఆ రాష్ట్రానికి అవసరం ఉంది. ఇది ఇంతకు ముందున్న అధికార భాషాసంఘం లాంటిది కాక ఒక సంపూర్ణమైన కార్యాలయం శాశ్వత ప్రాతిపదికన ఉండి. అందులో విశ్వవిద్యాలయ ఆచార్యుల స్థాయితో సమంగా ఉండే భాషావేత్తల పదవులు ఉండి వారి నియామకం పూర్తిగా విషయోపయోగ దృష్టితో జరగాలి. ఇక ఈ శాశ్వత కార్యాలయాన్ని నడపడానికి ఒక అధ్యక్ష పదవిని ఉపాధ్యక్ష పదవిని పాలక మండలిని పూర్తిగా పారదర్శకంగా విషయైక దృష్టితో ఏర్పాటు చేయాలి. అధ్యక్షుని పదవిని తెలుగు అకాడమీ అధ్యక్షుడు లాగా మూడు సంవత్సరాలకు ఒకసారి మార్చినా పూర్తిగా భాష అమలు చేయగలిగే భాషావేత్తలతో నియమించినా, శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేసే వ్యవస్థ పూర్తిగా కొనసాగుతూ ఉంటుంది గనుక అధ్యక్షుడు, పాలక మండలి విధాన నిర్ణయాలు తీసుకున్నా దాని పాలన ఒడిదుడుకులు లేకుండా నడిచే వీలుంది. అంతే కాదు అధికార భాషా సంఘాన్ని నియమించడంలో విపరీతమైన జాప్యం జరిగినా కూడా శాశ్వత ప్రాతిపదికన చేసే వ్యవస్థ వల్ల కార్యకలాపాలు కుంటుపడకుండా ఉంటాయి. నవ్యాంధ్రప్రదేశ్ ఈదిశగా ఒక శాశ్వత ప్రాదిపదికన పనిచేసే ఒక వ్యవస్థని పరిపాలన భాష అమలుకోసం ఏర్పాటు చేసుకోవాలి. పాలన ఎలా ఉండాలి, అమలు విధానం ఎలా ఉండాలి అనే విషయాన్ని పైన చెప్పిన వ్యవస్థ నిర్ణయిస్తుంది. అలాగే నియంత్రిస్తుంది. గ్రామ పంచాయితీ కార్యాలయం దగ్గరనుండి పైనున్న సచివాలయం దాకా అన్ని ప్రభుత్వ కార్యాలయాలు అధికార భాషని అమలు చేసే అధికారం భాషాస్వరూపాన్ని నిర్ధారించి కార్యాలయాలకు నిర్దేశించే అధికారం పూర్తిగా ఈ సంస్థకు దఖలు పరచాలి. అమలు చేయని కార్యాలయాల పైన అధికారులపైన చర్య తీసుకునే పూర్తి అధికారం ఈ సంఘానికి ఇవ్వాలి. గత ప్రభుత్వాలు అధికార భాషా సంఘానికి ఈ అధికారాలను ఏ మాత్రం ఇవ్వలేదు. ఈ కారణంగానే అధికార భాషా సంఘం కాగితాలు పంపే తపాలా కార్యాలయం అయిందే తప్ప భాష అమలు విషయంలో కార్యాలయా లను ఏ మాత్రం కట్టడి చేయలేక పోయింది. ఇందుకే అధికార భాషగా తెలుగు అమలు ఉమ్మడి రాష్ట్రంలో జిల్లాల వారీగా ఆయా జిల్లాలలో 12 శాతం నుండి 52 శాతానికి పరిమితం అయింది. సాక్షాత్తు మూల అధికార పీఠం అయిన సచివాలయంలో అధికార భాష అమలు 3 శాతంగా ఉండింది. ఆంగ్లమానస పుత్రులు అక్కడ అధికంగా ఉండడమే దీనికి కారణం. పైన చెప్పిన కొత్త తరహా ఒక విశ్వవిద్యాలయ స్థాయి లేదా అకాడమీ లాంటి శాశ్వత సంస్థ, ఒక ప్రాధికార సంస్థ రూపొందాలి.

ప్రజల వ్యూహం ప్రజాసంఘాల వ్యూహం పాలన భాషగా తెలుగు అనేది ప్రాథమిక హక్కు అని వాదించాలి. ఇక ప్రభుత్వ వ్యూహం ఎలా ఉండా లంటే తనపై ఒత్తిడి లేకుండానే అన్ని స్థాయిల్లో తెలుగును పాలనభాషగా అమలు చేయడానికి తనకై తాను పకడ్బందీ వ్యూహాలు రచించుకోవాలి. తెలుగు పాలన భాషా ప్రాధికారసంస్థ అని ఇంగ్లీషులో Authority of Telugu Official Language అనే విధంగా సంపూర్ణమైన అధికారాలు దత్తం చేసిన ఒక సాధికార సంస్థ కావాలి. ఏ కార్యాలయమైనా తెలుగును అమలులో పెట్టకపోతే ఆ సంబంధిత అధికారులపైన పూర్తి చర్యలు తీసుకొని గట్టిగా చెబితే మెడలు వంచి భాషను అమలు చేసే అధికారం ఈ సంస్థకు పూర్తిగా కట్టబెట్టాలి. ఇది ప్రభుత్వ వ్యూహం కావాలి.

**బోధన భాషగా తెలుగు అవసరం దాని అమలు వ్యూహం:**

విద్యాబోధన మన పిల్లలకు మనం ఎలా చేసుకోవాలో తెలుగువారు ఇంకా స్థిరంగా నిర్ధరించుకోలేకపోయారు. బోధన భాషగా తెలుగు ఉండడం అన్నది ఏస్థాయిలో ఎలా ఉండాలి అని




స్వాతంత్ర్యం వచ్చిన 70 సంవత్సరాల తర్వాత కూడా ఇంకా మనం చర్చించుకోవడమే దీని దౌర్భాగ్య స్థితిని తెలియజేస్తూ ఉంది. ఈ విషయంలో మాత్రం తెలుగు పరిస్థితి నానాటికి తీసికట్టు నాగంబొట్లు అన్నట్లే ఉంది. ఒకసారి చరిత్రలోకి తొంగి చూస్తే మనం ఏ దీనావస్థలో ఉన్నామో తెలుస్తుంది.

అసలు భాషకు సంబంధించి ప్రభుత్వానికి ఒక నిబద్ధత అనేది చాలా ముఖ్యం. నిబద్ధత ఉంటే పరిస్థితి ఎలా ఉంటుందో ఒకసారి చూద్దాం. ఉస్మానియా విశ్వవిద్యాలయం పూర్తిస్థాయిలో 1918 వ్యవస్థాపితం అయింది. అయితే దీని ఆలోచన 1912 లో జరిగింది. దేశంలో మొట్టమొదటి సారి ఒక ప్రాంతీయ భాష మాధ్యమంగా ఏర్పడిన విశ్వవిద్యాలయం ఉస్మానియా విశ్వవిద్యాలయం. ఒక భారతీయ భాష బోధన మాధ్యంగా ఒక విశ్వవిద్యాలయం ఏర్పడడం నిజంగా గర్వకారణం అని ఆనాడే విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్ దీన్ని మెచ్చుకున్నారు. ఇక్కడ గమనించవలసింది ఇంకొక అతి ముఖ్యమైన అంశం ఒకటి ఉంది. విశ్వవిద్యాలయం పనిచేయడం ఆరంభించడానికి 12 సంవత్సరాల ముందే ఒక ట్రాన్స్‌లేషన్ ప్రాజెక్టుని స్థాపించారు. ఉన్నత విద్యకు అవసరమైన పాఠ్యపుస్తకాలు అన్నింటినీ ఇంగ్లీషునుండి ఉర్దూలోనికి అనువాదం చేయించారు. విశ్వవిద్యాలయం పూర్తి స్థాయిలో పనిచేయడం ఆరంభించే నాటికే పుస్తకాలు సిద్ధం అయ్యాయి, బోధన మాధ్యమం అయిన ఉర్దూలో ఉన్నత విద్య బోధించారు. ఇంజనీరింగ్, మెడిసిన్ వంటి వృత్తి విద్యలు, అన్ని శాస్త్రాలకు చెందిన పాఠ్యపుస్తకాలు ఉర్దూలో తయారై తరగతులలో బోధనకు అందుబాటులోనికి వచ్చాయి. మాతృభాషలో విద్యాబోధన చేస్తే ఏ శాస్త్రాన్నైనా సులువుగా బోధించవచ్చు. సులువుగా నేర్చుకోవచ్చు అనే సూత్రాన్ని ఆనాడే ఉర్దూ భాషలోని పాలకులు గుర్తించారు. కాని మనం ఇంతవరకు గుర్తించలేక పోయాము. మనకంటే ముందు తరంలో ఉన్న పెద్దలు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నతవిద్యను ఉర్దూమాధ్యమంలోనే చదువు కున్నారు.

నిజానికి ఉర్దూ మైనర్ లాంగ్వేజ్, అంటే చాలా తక్కువ సంఖ్యలో ఉన్న ప్రజలు మాట్లాడే చిన్న భాష. ఆనాటికి హైదరాబాదు రాష్ట్రంలో ఉర్దూ మాట్లాడే వారి శాతం మూడు శాతానికి లోపే. కాని హిందువులు తెలుగు మాట్లాడే వారు 95 శాతం ఉన్నారు. మిగతా రెండు శాతం వివిధ భాషా మైనారిటీ వర్గాలు మాట్లాడే భాషలున్నాయి. కాగా ఉర్దూ మాట్లాడే మూడు శాతం కాగా ఉర్దూ మాధ్యమాన్ని బోధనభాషగా చేసి మిగతా 97 శాతం ప్రజలమీద బలవంతంగా రుద్దాడు. ఇలాంటి పని 97 శాతం మాట్లాడే తెలుగు భాష విషయంలో మన ప్రభుత్వం ఎందుకు చేయడం లేదు అని ఆలోచిస్తే మంచిది. మాజీ ముఖ్యమంత్రి చెన్నారెడ్డి ఎం.బి.బి.ఎస్ డాక్టర్ అని కొద్దిమందికే తెలుసు. కాని ఆయన ఉర్దూబోధన మాధ్యమంగా చదువుకున్నాడని ఇంకా తక్కువ మందికే తెలుసు. ఆనాటి రాజకీయ ప్రముఖులు వివిధ శాస్త్రాల ప్రముఖులు అందరూ ఒకే మాధ్యమం ఉర్దూ మాధ్యమంలో చదువుకున్నారు. ప్రభుత్వానికి నిబద్ధత ఉంటే పనులు ఇలా జరుగుతాయి. 3 శాతం మంది మాట్లాడే

భాష రాష్ట్రం మొత్తానికి అధికార భాష అయినప్పుడు అలాగే పూర్తి స్థాయి ఉన్నత విద్యని అదే భాషలో అందించినప్పుడు, 97 శాతం మాట్లాడే భాషని అధికారభాషగా ఎందుకు అమలు చేయలేక పోతున్నాము. అలాగే పూర్తి స్థాయి బోధన భాషగా ఎందుకు అమలు చేయలేకపోతున్నాము అనేవి చిరంతనమైన ప్రశ్నలు.

ఇలా నేటి అవసరాల దృష్ట్యా తెలుగు భాషని పూర్తిస్థాయిలో అమలు చేసే నిబద్ధతని ప్రభుత్వం ప్రోదిచేసుకోవాలి. ప్రభుత్వం దగ్గర మరొక వాదన ఉన్నది. ప్రజలు ఇంగ్లీషు మీడియం విద్యను కోరుకుంటున్నారు. ఇంగ్లీషు మీడియంలో చదువుకుంటేనే ఉద్యోగాలు వస్తాయని అనుకుంటున్నారు కాబట్టి ప్రజలు కోరుకున్నది మేము అందిస్తాము. ప్రైవేటు రంగం ఎలాగూ ఇంగ్లీషు మాధ్యమాన్నే మంచి వ్యాపార వస్తువుగా మలచుకున్నది. మేము కూడా ఇంగ్లీషు మీడియం పాఠశాలలు తెరుస్తాము. ఇదీ వాదన. కాని ఇక్కడ గమనించవలసిం దేమంటే చైనా వారు మనకన్నా పెద్ద సంఖ్యలో జనాభా ఉన్నవారు. మనకన్నా చాలా తక్కువ సంఖ్యలో జనాభా ఉన్న చిన్న దేశం జపాన్ వారూ వారి మాతృభాషలలో వారి పిల్లలకు విద్యను నేర్పిస్తుంటే ఆ పని మనం ఎందుకు చేయలేకపోతున్నాము. ఉద్యోగాలు రావడానికి రాకపోవడానికి అక్కడ సమస్యలు లేవా. అసలు ఉద్యోగాలు రాకపోవ డానికి మాతృభాష కారణమా. తెలుగు మీడియంలో చదువుకుంటే ఉద్యోగాలు రావు అని ఎలా చెబుతారు. ఈ విషయం పైన పూర్తి చర్చ అవసరం.

తెలుగు మాధ్యమంలో చదువుకుంటే ఉద్యోగాలు రావు అని ప్రచారం చేసేది ఎవరు. తెలుగులో చదువు అంతా చదువుకున్నా కాని ఉద్యోగాలు వస్తాయని ఉద్యోగానికి ఇంగ్లీషు మీడియంకి సంబంధం లేదని ప్రభుత్వం చెప్పలేదా. నిన్నమొన్నటి దాకా ఉన్న ఉమ్మడి రాష్ట్రంలో పదమూడు లక్షల ఉద్యోగస్తులున్నారు. ఈ ఉద్యోగస్తులు అందరూ కూడా వృత్తిపరంగా అంటే ఉద్యోగబాధ్యతగా సేవచేయవలసింది, ఇంగ్లీషు వారికో ఫ్రెంచ్ వారికో కాదు. కేవలం తెలుగు వారికే. రాష్ట్రంలో ఉర్దూమాట్లాడే వారున్నారు. వారు రెండు నుండి మూడు శాతం మందే. వీరిలో కూడా తొంబై శాతం మందికి తెలుగు కూడా బాగా వస్తుంది. ఏతావాతా రాష్ట్రంలో ఉన్న ప్రజ లందరికీ తెలుగులో పరిపాలన జరిగితే అర్థం కాని వారి సంఖ్య ఒక శాతానికి మించదు. ఒక ఉద్యోగి తొంబై తొమ్మిది శాతంగా ఉన్న తెలుగు ప్రజలకోసం పనిచేసేటప్పుడు అతను తెలుగులో కాక ఇంగ్లీషులో పనిచేయవలసిన అవసరం ఏముంది. కాబట్టి అతను తెలుగులోనే తన ఉద్యోగబాధ్యతలని నిర్వహించుకోవచ్చు. ఇలా తెలుగు మాధ్యమంలో ఉన్న పదమూడు లక్షల మంది ఉద్యోగులు పని చేయవలసిన అవసరం ఉన్నప్పుడు. తెలుగు మీడియంలో చదువుకుంటే ఉద్యోగాలు రావనే సమస్య ఎక్కడనుండి వస్తుంది. ఇక ఎవరైనా నేను తెలుగు నేలలో కాకుండా వేరే రాష్ట్రంలో కాని వేరే దేశంలో కాని ఉద్యోగం చేస్తాను అని అనుకునే విద్యార్థికి కూడా ఒక సబ్జక్టుగా ఇంగ్లీషు ఇంటర్ వరకు ఉంటుంది. ఈ మామూలు కార్యాలయ ఉద్యోగాలు చేయడానికి ఆ ఆంగ్ల భాషా పరిజ్ఞానం సరిపోతుంది. అదీ కాదు ఇంగ్లీషు మీడియంలోనే మొత్తం చదువు కుంటాను అనే వారికోసం ఒక పది శాతం పాఠశాలలు కళాశాలలు ఉంటే సరిపోదా. కాబట్టి తెలుగు మీడియంలో చదువుకుంటే ఉద్యోగాలు రావు అనే సమస్యే లేదు.

ఈ చర్చని బట్టి తెలిసేదేమంటే ప్రభుత్వ కార్యకలాపాలు తెలుగులో సాగడానికి తెలుగు మీడియంలో పాఠాలు చెప్పడానికి అంటే బోధన భాషగా తెలుగును పూర్తి స్థాయిలో అమలు చేయడానికి పూర్తిగా సంబంధం ఉంది. ఇది ఒకదానిపైన ఒకటి ఆధారపడిన అంశం. పరిపాలన భాష పూర్తిగా అన్ని స్థాయిల్లో తెలుగు మాధ్య మంలో ఉంటే ప్రభుత్వ ఉద్యోగాలలో అందరూ తెలుగు మాధ్యమంలో ఉంటే సరిపోతుంది. అలా కాక ఇంగ్లీషు మీడియంలో చదువుకున్న వారు తెలుగు పాలన భాషకు అలవాటు పడడం కష్టంగా పరిణ మించవచ్చు. కాబట్టి తెలుగు పూర్తిగా పాలనభాషగా అమలు చేస్తే దానివల్ల పాఠశాలల్లో కళాశాలల్లోను తెలుగు బోధనభాషగా తప్పక ఉండే పరిస్థితి ఉంటుంది. అలాగే బోధన భాష పూర్తిగా తెలుగులో ఉంటే ఉన్నత విద్యని తెలుగులో అభ్యసించిన వారు అందరూ అన్ని ప్రభుత్వ కార్యాలయాలలో తెలుగులో పనిచేయడానికి పూర్తిగా ఉపయుక్తం అవుతారు. ప్రభుత్వంలో పూర్తి అధికార భాష ఇంగ్లీషు ఉన్నంత కాలం బోధన భాష విషయంలో ప్రభుత్వం గట్టి పట్టు బిగించి మాట్లాడే వీలుండదు. అటు ప్రభుత్వము, ఇటు తెలుగు భాష ఉద్యమకారులు ఈ పరస్పరాధారిత విషయాన్ని గుర్తుపెట్టుకొని ప్రణాళిక రచన చేసుకోవాలి.

**వృత్తి విద్యలని తెలుగులో చెప్పకూడదా:**

పైన చెప్పిన వాదనే ఇక్కడ కూడా వర్తిస్తుంది. ఇక్కడ తయారు అయ్యే ఇంజనీర్లు, డాక్టర్లు వగైరా వగైరాలు చాలా మంది ప్రైవేటుగానే పనిచేసుకుంటారు. లాయర్లు వంటి వారు కూడా ఎక్కువ మంది ఇక్కడే తెలుగు నేలపైనే పనిచేయవలసి ఉంటుంది. అలా వారి సేవలను చాలా ఎక్కువమందికి అందించవలసిన స్థితిలో వారి చదువు తెలుగులో ఉంటే వచ్చిన నష్టం ఏముంది. అలా ఉంటేనే వారి వృత్తి కూడా చాలా ఎక్కువమందికి చేరుతుంది. ఈ వృత్తులలోనైనా లేదా సైన్సులో నైనా తెలుగులో చెప్పలేని విషయం ఉండదు. విస్తృతమైన పదజాలాన్ని సృష్టించే జనరేటివ్ కెపాసిటీ లేదా పదనిష్పాదక శక్తి తెలుగుభాషకు ఉంది. కారణం దీనిలో సంస్కృతం కూడా అంత ర్నిహితంగా ఉంది. సంస్కృతానికున్నంత నిష్పాదన శక్తి మరే భాషకూ లేదు. అందులో తెలుగు కూడా అద్వితీయ శక్తినే కలిగి ఉంది.

**తెలుగు అకాడమీ ప్రయోగం బాగానే విజయవంతం అయింది:**

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఒకటి రెండు దశాబ్దాల తర్వాత ఉన్నత విద్యను భారతీయ భాషలలో చెప్పాలనే ప్రయత్నం గట్టిగా ప్రారంభం అయింది. దీనిలో భాగంగానే వివిధ భాషలలో సంస్థలు ఏర్పడ్డాయి. ఆంధ్రప్రదేశ్ లోని తెలుగు అకాడమీ ఆ ప్రయత్నాలలో భాగంగానే వచ్చింది. అంతకుముందున్న హెచ్.ఎస్.సి., పి.యు.సి విధానాన్ని తీసివేసి ఇంటర్ విధానాన్ని ప్రవేశ పెట్టిన కొత్తలో పాఠ్య పుస్తకాలు అన్నింటిని అన్ని సబ్జక్టులలో తెలుగు మాధ్యమంలో తయారు చేశారు. అంతే కాదు డిగ్రీ పుస్తకాలు కూడా తెలుగులో తయారు చేశారు. పి.జికోర్సులకు కూడా కొన్ని హ్యూమానిటీస్ సబ్జక్టులు కూడా తెలు గులో తయారు చేశారు. విద్యార్థులు కొత్తలో తెలుగు మాధ్యమానికి

బాగానే అలవాటు పడ్డారు. అయితే తెలుగు అకాడమీ తెలుగుపైన చాలా విమర్శలున్నాయి. ముఖ్యంగా పారిభాషిక పదకల్పనల పైన విమర్శలున్నాయి. అయినా తెలుగు అకాడమీ కృషిని తక్కువగా అంచనా వేయలేము. తెలుగు మాధ్యమాన్ని పాఠశాల స్థాయిలో ఇంటర్, డిగ్రీ స్థాయిలలో అమలు చేయడంలో తెలుగు అకడామీ చారిత్రకమైన కృషి చేసింది. ఆ తర్వాత ఇంటర్ విద్య క్రమంగా ప్రైవేటైజై పోవడం వ్యాపారీకరణ ప్రబలడం ప్రైవేటు విద్యాసంస్థలు ఇంగ్లీషు మీడియం లేకపోతే మీకు ఉద్యోగాలు రావని, అలాగే ఇంగ్లీషు మీడియమే ఇకపైన ఉంటుందని లేదా తెలుగు మీడియం చదువు చదువే కాదని చెప్పేంత ధోరణిలో వాటి ప్రచారాలు సాగాయి. అంతే కాదు. తెలుగు మీడియం అన్నది చివరికి ప్రభుత్వ పాఠశాలలకు కాలేజిలకే పరిమితమయ్యే స్థితి క్రమంగా వచ్చింది. వచ్చిన ప్రభుత్వాలకు విద్యారంగంపైన అవగాహన లేకపోవడం, అంతేకాదు ఏ మాత్రం శ్రద్ధ లేకపోవడం. విచ్చలవిడిగా ఏ సౌకర్యాలు లేక పోయినా డిగ్రీ కాలేజిలకు, పి.జి కాలేజిలకు స్కూళ్ళకు అనుమతులు ఇవ్వడం. మెయిన్ రోడ్డులో రెండు మూడు గదులున్న ఎపార్ట్మెంట్ లో కూడా డిగ్రీకాలేజికి అనుమతి ఇవ్వడం వంటి ఘోర కృత్యాలకు గట్టిగా చెబితే పాతక కృత్యాలకు పాల్పడింది. దీనితో ప్రభుత్వం చేతిలోనే విస్తారంగా ఉన్న విద్యారంగం పూర్తిగా ప్రైవేటు యాజ మాన్యాల చేతికి కార్పొరేట్ సంస్థల చేతికి వెళ్ళిపోయింది. ఇంగ్లీషు మాధ్యమం బాగా ప్రబలి పోవడానికి, తెలుగు మాధ్యమం అంతరించ డానికి ఇది ప్రధాన కారణం. ఇక ఇప్పుడు ప్రభుత్వమే స్వయంగా పాఠశాల విద్యను కూడా పూర్తిగా ఇంగ్లీషు మాధ్యమంలోనికి మార్చడానికి పూనుకుంది. తెలుగుకున్న ఈ కాస్త ఆసరా క్రమంగా పూర్తిగా కనుమరుగయ్యే ప్రమాదం దగ్గరలోనే ఉంది.

విశ్వవిద్యాలయ విద్య ఇంకా ఎనభై తొంభై శాతం ప్రభుత్వ అధీనంలోనే ఉంది. ఇక్కడ తెలుగు మాధ్యమ ప్రసక్తి లేనే లేకుండా పోయింది. ప్రైవేటు విశ్వవిద్యాలయాలు వస్తే మాధ్యమం సంగతి అటుంచి వ్యాపార పరమైన కోర్సులు ఉద్యోగం తెచ్చే కోర్సులు మాత్రమే వర్ధిల్లి మౌలికమైన కోర్సులు, సాహిత్యాది సామాజిక శాస్త్రాల కోర్సులు మరుగున పడే ప్రమాదం కూడా ఉంది. ఇంజనీరింగు విద్య ఎలా కుప్ప కూలిందో ప్రైవేటు విశ్వవిద్యాలయాల ప్రయోగం కూడా కుప్ప కూలే ప్రమాదం ఉంది.

**కంప్యూటర్ విద్య, ఆధునిక శాస్త్ర విజ్ఞానాలు తెలుగు భాష వ్యూహాలు:**

కంప్యూటర్ శాస్త్రం ప్రభావం పడని విద్యా రంగం కాని లేదా జీవన రంగం కాని లేదు అని చెబితే అది ఏ మాత్రం అతి శయోక్తి కాక నిజమే అవుతుంది. ఇది నేటి అవసరం. అంతే కాదు దేశం అంత రిక్ష రంగంలో ఉపగ్రహాల నిర్మాణ విద్యలో రాకెట్ లాగా దూసుకు పోతుంది. ఈ శాస్త్రాలను భారతీయ భాషలలో చెప్పడం సాధ్యం కాదా అంటే సాధ్యం అవుతుంది. అధునిక శాస్త్రాలు, వివిధ రకాల సాంకేతిక విద్యలు భారతీయ భాషలలో బోధించినప్పుడే ఆయా భాషలలో పదజాలం పెరుగుతుంది. నూతన పదకల్పన అవసరం అవుతుంది. భాషలు విస్తృతం అవుతాయి. భారతీయ భాషలు బలోపేతం అవుతాయి. తెలుగు మాధ్యమంలో చదువుకుంటే ఉద్యో గాలు రావు ఉపాధి దొరకదు అనే వాదాన్ని రూపమాపవలసిన బాధ్యత ప్రభుత్వాల పైన ఉంది. ఇది చేస్తూనే వివిధ శాస్త్రాలను తెలుగులో బోధించేలాగా భాషాభివృద్ధికి వ్యూహరచనలు చేసుకోవాలి. పారిభాషిక పదకల్పనల కోసం ప్రత్యేకమైన సంస్థనే ఏర్పాటు చేసుకోవాలి. దీనికి అనుబంధంగా పాఠ్యపుస్తకాలు ఆచూకీ గ్రంథాలు విస్తృత గ్రంథాలు అన్నింటిని తెలుగులోనికి తర్జుమా చేయించడం దానితోపాటు కొత్త పాఠ్యపుస్తకాల రచనలు చేపట్టడం చేయవలసి ఉంది. దీని ద్వారా అన్ని స్థాయిలలో విద్యను మాతృభాషలో జాతికి అందించే వీలు కలుగుతుంది. దీని ద్వారానే పటిష్ఠమైన జాతి నిర్మాణం జరుగుతుంది.

మాతృభాషలో చదువుకోవడం దేశ ప్రజలు తమ భాషలోనే ప్రభుత్వ కార్యకలాపాలు చేసుకోవడం అనేవి ఆ దేశ ప్రజల ప్రాథమిక హక్కుగా గుర్తించాలి. ఈ మేరకు రాజ్యాంగ సవరణ జరగాలి. తెలుగులో చదువుకున్న వారికే ప్రభుత్వ ఉద్యోగాలు ఇస్తాము అని ప్రభుత్వం శాసనం చేసే శక్తిని తెచ్చుకోవాలి. తెలుగును పూర్తి స్థాయిలో అధికారభాషగా అమలు చేసినప్పుడే ఇలా శాసనం చేయ గలిగే శక్తి ప్రభుత్వానికి వస్తుంది. తిరిగి ఈ రెండు పనులు పరస్పరం ఆధార పడి ఉన్న విషయాలు.

నాలుగో ప్రపంచ మహాసభలు జరిగే సందర్భంలోను తర్వాత కూడా తెలుగు భాషాభిమానులలో కొంత ఆశ కలిగిన మాట నిజం. ప్రభుత్వాలు తెలుగు బోధన భాషగా పాలన భాషగా అమలు చేయడంలో శ్రద్ధ చూపుతుందని తెలుగు స్థితిని బాగా ఉన్నత స్థితికి తీసుకువస్తుందని చాలా మంది ఆశపడ్డారు. సభలు జరిగి మూడు సంవత్సరాలు దాటాయి. తర్వాత జరిగిన రాజకీయ పరిణామాలలో రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పడ్డాయి. తెలుగు గురించి ఏ మాత్రం పట్టించుకునే తీరిక రెండు ప్రభుత్వాలకు లేకుండా పోయింది. క్లాసికల్ తెలుగు సంస్థ గురించి పూర్తిగా మరిచి పోవడం జరిగింది. తెలుగును కనీసం పాఠశాల స్థాయిలోనైనా పూర్తిగా బోధన భాషగా చేయండి అని చేసే నినాదం స్థానంలో ఇప్పుడు కనీసం తెలుగును ఒక సబ్జక్టుగా పదవతరగతి వరకు పూర్తిగా అమలు చేయండి అనే స్థితికి సంస్థలు కూడా వచ్చాయి. తెలుగును గురించి ఆలోచించే స్వచ్ఛంద సంస్థలు ఈ రాజీ ధోరణిని విడనాడి తెలుగు మాధ్యమ బోధన కనీసం ఇంటర్ వరకు ఎనభై శాతం, తర్వాత డిగ్రీలో 50 శాతం వరకైనా జరిపేలాగా తిరిగి ఉద్యమాలు చేపట్టాలి. తెలుగులో పాలన చేయడం తెలుగు ప్రజల ప్రజా స్వామిక హక్కుగా ప్రభుత్వం గుర్తించేలా చేయాల్సిన బాధ్యత తెలుగు ప్రజలకుంది తెలుగు సంస్థలకుంది. ఈ విషయంలో ఏమరుపాటు తగదు. వ్యూహరచనలో ఆలస్యం కూడా తగదు. భాష విషయంలో తెలుగు వారికున్న ఈ నిరాసక్తత, ఈ నిరీహ స్థితి ఇలా కొనసాగితే తెలుగు చదవడం, రాయడం రాని తరం ఒకటి రావడం అన్నది ఎంతో దూరంలో లేదు. ఇదే పరిస్థితి కొనసాగితే నాలుగైదు సంవత్సరాలలోనే నాకు తెలుగు రాయడం రాదు అని గర్వంగా చెప్పుకునే యువతరం వస్తుంది. అమృత ప్రాయమైన తెలుగు అలస్యం కారణంగా విషంగా మారే ప్రమాదం ఉంది. తస్మాత్ జాగ్రత్త...

**రచయిత ఫోను : 9440493604**

- ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు
డా॥అద్దంకి శ్రీనివాస్

# తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం-4

## 5.4 న్యాయపాలన రంగంలో భాషా విధానం

ప్రజల కోసం ప్రజలచేత ప్రజాప్రతినిధులు సాగించే పాలనలో న్యాయాన్ని త్వరితంగా పారదర్శకంగా అందరికీ అందుబాటులో ఉండేవిధంగా అందించగలగడం సుపరిపాలనకు గీటురాయి. ఇది వాస్తవంగా జరగాలంటే ప్రజలభాషలోనే జరగాలి. ఫిర్యాదు స్వీకరణ నుండి ఋజుసేకరణ, వాదాలూ తీర్పులూ అన్నీ ప్రజలభాషలో జరగాలి. జిల్లా న్యాయస్థానం వరకూ పై విధానం అమలులో ఉన్నా ఆచరణలో తక్కువ. హైకోర్టు పరిధిలో ప్రత్యేక అనుమతులతో ప్రజలభాషలో న్యాయ పాలన సాధ్యమే. అయితే కొన్ని ఇబ్బందులను అధిగమించాలి.

**నియమాలు :**

1. న్యాయస్థానాలలో అన్ని విభాగాలలో కింది స్థాయి నుంచి ఉన్నత స్థాయి వరకు అన్నింటిలో తెలుగు ఉండాలి.
2. ఫిర్యాదుల స్వీకరణా ఋజుసేకరణా, వాదాలూ, తీర్పులూ ప్రజలభాషలోనే జరగాలి.

**ప్రాతిపదిక :**

ప్రజాప్రభుత్వంలో దిగువస్థాయి న్యాయస్థానాలలో న్యాయం దొరకని పౌరుడు ఉన్నతన్యాయస్థానాన్ని ఆశ్రయిస్తాడు. అలాంటప్పుడు దేశభాషలో ఫిర్యాదు చేయడం తనకు తెలిసిన భాషలోనే వాదోపవాదాలు జరుపుకొని తీర్పు పొందడం, పొందాలని కోరుకోవడం అతడి ప్రాథమిక హక్కు.

### 5.4.1 దేశంలో...

రాజ్యాంగంలోని 17వ విభాగం, 2వ అధ్యాయం, 348వ ప్రకరణం ప్రకారం (చూ.అనుబంధం1) భారతదేశంలోని న్యాయస్థానాలలో సుప్రీంకోర్టు, హైకోర్టులలో ఆంగ్లం వాడాలని రాజ్యాంగం స్పష్టం చేసింది. ఫిర్యాది తరపు న్యాయవాదులు ఫిర్యాదులను, ఆంగ్లంలోనే సమర్పించాలి. అయితే దిగువ న్యాయస్థానాలలో ఆయా ప్రాంతాల అధికార భాషలకు అవకాశం ఉంది.

కానీ రాజస్థాన్, బీహార్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలలోని హైకోర్టులలో హిందీకి అనుమతి ఉంది. అయితే గవర్నరు అనుమతితో రాష్ట్ర అధికార భాషను హైకోర్టులో వాడే వీలు ఉంది. దీనిని ఆసరాగా తీసుకొని ప్రజల వద్దకు న్యాయవ్యవస్థను మరింత చేరువు చేయాలంటే ప్రాంతీయ భాషలు ఉన్నత న్యాయస్థానాలలో వాడాలని తమిళనాడు వాదించింది.

### 5.4.2 రాష్ట్రంలో...

ఆంధ్రప్రదేశ్ అధికార భాషాచట్టం 1966 ప్రకారం రాష్ట్రానికి తెలుగు అధికార భాష. దీనితో తెలుగును విధాన నిర్మాణ భాషగా న్యాయ పాలన భాషగా ఉపయోగించడానికి మార్గం ఏర్పడింది. అయితే న్యాయపాలనా భాషగా తెలుగును వినియోగించటంలో కొన్ని సమస్యలు ఉన్నాయి. చట్టాలు అన్నీ ఆంగ్లంలో ఉన్నాయి. వాటిని తెలుగు చేయాలి, తరువాత చట్టాలను తెలుగులో రూపొందించాలి. ఆంగ్లంలో ఉన్న చట్టాలను తెలుగులో వర్తింపచేసి వ్యాఖ్యానించటంలో ఆచరణపూర్వకమైన ఇబ్బందులు ఉన్నాయి. అందువల్ల 1964లో రాష్ట్ర ప్రభుత్వం అనువాద సంఘాన్నీ న్యాయశాఖలో ఒక అనువాద విభాగాన్నీ ఏర్పాటు చేసింది. అయితే ఈ అనువాదాలు 1966 అధికార భాషా చట్టం ప్రకారం గవర్నరు అధ్వర్యంలో ప్రచురితం అయినప్పుడు అధికార పాఠాలు అవుతాయి. అదీకాక చట్టాల, ఆధికారిక ప్రకటనల విషయంలో మరొక సమస్య ఉంది. శాసనసభలో ఏ భాషలో చట్టం చేస్తే ఆ భాషలోనే అది అధికార ప్రకటన అవుతుంది. అయితే ఆ భాష- బిల్లులలోనూ, చట్టాలలోనూ వాడవలసిన భాషగా శాసనసభ ద్వారా నిర్ణయించబడి ఉండాలి. అదే అధికార భాష అవుతుంది. శాసనసభలో ఆంగ్లంలో ప్రవేశపెట్టిన బిల్లు గానీ, ఆమోదించిన చట్టం గానీ ఇతర భాషలలోనికి అనువదించినప్పుడు ఆ అనువాదం ఆధికారిక పాఠం అవ్వదు. అది ఆ భాష రానివారికి చట్టాన్ని తెలిపేందుకు మాత్రమే ఉపయోగపడుతుంది. అంతేకానీ న్యాయశాస్త్రరీత్యా లేదా రాజ్యాంగపరంగా ఆ అనువాదానికి ఎలాంటి ప్రామాణికత ఉండదు. అందువల్ల ఆ చట్టాల అనువాదాలను కోర్టులు ప్రామాణికంగా స్వీకరించవు. అలాగే తెలుగులో చేసిన చట్టాలు ఉంటాయి. వాటి ఆంగ్ల పాఠాలు గవర్నరు అధికారం కింద రాష్ట్ర గెజిట్‌లో ప్రచురించబడతాయి. అలా ప్రచురించబడిన ఆంగ్ల అనువాదాన్ని ఆ చట్టానికి సంబంధించిన ఆంగ్ల అధికార పాఠంగా భావించాలని 348(3) అధికరణం నిర్దేశిస్తోంది. ఇలాంటివాటినే హైకోర్టులు, సుప్రీంకోర్టు అధికార పాఠాలుగా స్వీకరించవలసి ఉంటుంది. ఈ విధంగా ఈ సమస్యను అధిగమించవచ్చు. అలాగే కేంద్ర అధికార భాష అయిన హిందీలోకి అనువాదం జరగవలసే ఉంది. ఈ విధంగా పాలన, న్యాయశాఖలలో అధికార భాషగా తెలుగు వాడకానికి అవకాశాలు ఉన్నాయి. త్వరలో తెలుగులో చట్టాలు చేసేందుకు తెలుగు చట్ట సభల్లో నిర్ణయం చేయాలి.

2012లో అప్పటి ఆంధ్రప్రదేశ్ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ.ఎన్.వి. రమణ గారు తీసుకున్న విధాన నిర్ణయం న్యాయ పాలనలో తెలుగు వ్యాప్తికి మార్గదర్శనం.

**సూచనలు :**

1. ఆలోచన మాతృభాషలోనే పుడుతుంది. వ్యక్తీకరణ అదే భాషలో ఉండటం సుఖం. అందుకే న్యాయస్థానంలో వాద ప్రతివాదాలూ తీర్పులూ అధికార భాషలో ఉండేలా. చర్యలు తీసుకోవాలి.
2. న్యాయ, పాలన రంగాలకు పారిభాషిక పదకోశాలు విరివిగా

రావాలి.

3. ప్రజలభాషలో న్యాయపాలన పరిభాషకై కృషి చేసిన తెలుగు పత్రికలకు వ్యక్తులకు, విద్యాలయాలకు, సంస్థలకు, విద్యార్థులకు, న్యాయస్థానాలకూ ప్రభుత్వం ప్రోత్సాహకాలు ప్రకటించాలి.
4. జన వ్యవహారాన్ని దృష్టిలో పెట్టుకొని తెలుగులో న్యాయపాలనా పదకోశ నిర్మాణాలు జరగాలి.
5. హైకోర్టులో వచ్చిన అనేక తీర్పులకు తెలుగు అనువాదాలు రావలసిన అవసరం ఉంది.
6. రాష్ట్ర శాసనసభలలో చేసిన అన్నిరకాల చట్టాలకు, బిల్లులకు సంబంధించిన తెలుగు పాఠాలు అందరికీ అందుబాటులోనికి రావాలి.
7. దేశంలోనూ, రాష్ట్రాలలోనూ ఉన్న చట్టసభలలో దేశభాషలు వాడేందుకు వీలుకల్పించిన రాజ్యాంగమే ఉన్నత న్యాయ స్థానాలలో దేశభాషలు వాడేందుకు ఎన్నో అడ్డంకులు ఏర్ప రచింది రాష్ట్ర, దేశ ఉన్నత న్యాయస్థానాలలో దేశభాషలు వాడా లంటే గవర్నరు, రాష్ట్రపతుల ఆమోదం కావాలి. ఈ పరిస్థితి మారాలి ప్రతిచట్టం తెలుగులో చేయాలి. దానికి ప్రతిగా ఆంగ్ల అనువాదం తయారవ్వాలి. న్యాయస్థానాలలో ఫిర్యాదులు, వాదోపవాదాలూ, తీర్పులూ అన్నీ తెలుగులో ఉండేవిధంగా చర్యలు తీసుకోవాలి.

## 5.5 వృత్తి, వ్యవసాయ, వాణిజ్యాది రంగాలలో భాషా విధానం

ఈ రంగాలలో తరతరాలుగా ప్రజలు మాతృభాషనే వాడడం ముఖ్యంగా గమనించదగ్గ విషయం. అయితే ఆధునికీకరణ, ప్రపంచీకరణ నేపథ్యంలో ఆధునిక వృత్తి, వ్యవసాయ వాణిజ్యాది రంగాలు మౌలికమైన మార్పులకు లోనవుతున్నాయి. వివిధ వృత్తులు వ్యవస్థీకృతం కావడంవల్లా వ్యవసాయ వాణిజ్యాలు ప్రపంచీకరణ ముంగిట్లో చేరడం వల్లా భాషల ప్రాధాన్యం పెరిగింది. ఈ ప్రాంతీయ అంతర్జాల అవసరాలకు అనుగుణంగా ఈ రంగాలలో భాషావిధానం ఉండటం అవసరం.

**నియమాలు :**

1. వృత్తి, వ్యవసాయ, వాణిజ్య రంగాలలో సేవలందించేవారికి స్థానీయ/ప్రాంతీయ భాషలే ప్రాథమిక భాషలు. ఈ రంగాలలో సేవలందుకోనే వారు ప్రజలే. అందువల్ల ఈ రంగాలలో భాషావిధానం ప్రజల భాషకే పట్టం కట్టాలి.
2. ప్రపంచీకరణ, స్థానికీకరణ నేపథ్యంలో ప్రజల/ స్థానిక భాషలోనే వర్తక వాణిజ్య వ్యవహారాలు జరిపేలా నియంత్రించాలి.
3. వాణిజ్యంలో సంబంధం ఉన్న వ్యవ సాయ, ఆర్థిక, సామాజిక, వ్యాపార శాస్త్రా ధ్యయనం తెలుగు మాధ్యమంలో చదివే అవకాశం అన్ని స్థాయిలలోనూ కల్పించాలి.
4. వృత్తులకు సంబంధించిన అన్ని వ్యవహారాల్లోనూ, తెలుగుభాషను సాంకేతికంగా ఉపయోగించేలా పరిశోధనలు జరగాలి. వాటిని ప్రోత్సహించాలి. అందుబాటులోనికి తేవాలి.
5. వృత్తివ్యవసాయ విశ్వవిద్యాలయాలలో వాడే ప్రత్యేక పారిభాషిక తెలుగును తప్పనిసరిగా బోధించే విధానం ఉండాలి.

**ప్రాతిపదిక :**

మానవజీవితంలో అనేక రంగాలు ముడివడి ఉన్నాయి. ఆ రంగాలలో వ్యక్తులు నైపుణ్యం సాధించాలంటే సహజంగా భాషా దక్షత ఉండాలి అందుకు దేశీయ భాషలు ఎంతగానే సహకరిస్తాయి. ఏదో ఒక రంగ ప్రమేయం, ప్రభావం లేకుండా మానవ జీవితం సాగదు. ఎంచుకొన్న రంగాలలో నిరంతరం శ్రమించడం మానవ జీవన పరమ కర్తవ్యాలలో ఒకటి ఈ ప్రక్రియ కొన్ని సార్లు ఉద్దేశ పూర్వకంగా మరికొన్ని సార్లు అనుద్దేశ పూర్వకంగా జరుగుతుంది. ఈ రంగాలు వృత్తిని బట్టి ప్రవృత్తిని బట్టి ఏర్పడేవి కూడా ఉంటాయి. కేవలం వృత్తి ఆధారిత రంగాలలోనే కృషి ఉపాధి కేంద్రకంగా జరుగుతుంది. ప్రవృత్తి ఆధారిత రంగాలలో కృషి బహుముఖీనంగా ఉంటుంది దీనికి కారణం ఆ రంగంపై ఉండే ఆసక్తి. వీటిలో రెండో కోవకి చెందిన ప్రవృత్త్యాధారిత రంగమే విద్యారంగం. మిగిలిన అన్నిరంగాలూ విద్యారంగంపైనే ఆధారపడి ఉన్నాయి. అన్ని రంగాలకూ వెళ్ళే వ్యక్తులను విద్యారంగమే తయారుచేస్తుంది. విద్యాపరమైన రంగాలలోనేకాక సామాన్యంగా వృత్తి, వ్యవసాయ వాణిజ్య రంగాలతో సంబంధం ఉన్న ప్రతివ్యక్తికీ భాష ఉపయోగ పడడం ప్రస్తుతం సాంకేతికత సాధించిన విజయం.

**5.5.1 దేశంలో...**

ఆధునికీకరణ తెచ్చిన మార్పులకు లోనుకాని రంగం అంటూ భారతదేశంలో ఏమీ లేదు. వృత్తి, వ్యవసాయ, వాణిజ్య రంగాలలో కూడా విపరీతమైన మార్పులు సంభవించాయి. కేంద్రంలో పంచవర్ష ప్రణాళిక సంఘం ఉంది. సహకార పరపతి సంఘమూ ఉంది. పాడి పంటలకు సంబంధించిన సేవలూ, వ్యవసాయ ఆధారిత సేవలూ, ఉద్యానవన సేవలూ, ఇంకా మత్స్య పరిశ్రమసేవలూ ఇలా



ప్రతి వృత్తికీ వ్యవసాయ వాణిజ్య రంగాలవారికీ అనేక సేవాకార్యక్రమ ప్రణాళికలు ఉన్నాయి. ఈ సేవలను అందుకోవలసినవారిలో చిన్న కారు, సన్నకారు రైతులున్నారు. వీరితోపాటుగా అవకాశబాహ్యులూ అసంఘటిత రంగాల వారూ ఉన్నారు. వారికి అందించవలసిన సేవలు వారికి సరిగ్గా అందాలన్నా ఆ అవకాశాలను వారు నూటికి నూరుశాతం అందిపుచ్చుకొని ముందుకు సాగాలన్నా భాష వారికి కొంచెం కూడా అడ్డుకట్ట వేయకూడదు. అలా వేస్తే అది వారి అభివృద్ధికే గొడ్డలిపెట్టు అవుతుంది. అందుకే వారికి భాషాపరమైన సహకారం సంపూర్ణంగా అందాలి. అది వారి వారి మాతృ భాషలలోనే ఉండాలి. వృత్తి, వ్యవసాయ, వ్యాపార విషయాలలో భాషాపరమైన కష్టాలను అధిగమించడానికి వారికంటూ ఎటువంటి ఏర్పాట్లూ లేవు. ఆయా రంగాలు చాలా వరకూ నేరుగా రాష్ట్రాల పరిధిలోనే ఉండడం దీనికి ఒక కారణం కావచ్చు.

**5.5.2 రాష్ట్రంలో...**

కేంద్రంలో లాగా రాష్ట్రంలో కూడా ఎటువంటి ప్రత్యేక భాషా విధానం లేదు. కూరగాయల పెంపకం, పూల పెంపకం లాంటివి అన్ని రాష్ట్రాలలోనూ పరిశ్రమలుగా రూపాంతరం చెందుతున్నాయి. అవి వ్యాపారాలుగానూ మారుతున్నాయి. ఎందరో రైతులు చేపలను పెంచటం, కూరగాయలు పండించటం. పూలు పూయించడం వాటిని ఇతర దేశాలకు, రాష్ట్రాలకు ఎగుమతి చేయడం ద్వారా జీవనోపాధిని పొందుతున్నారు. ఇవి ఇంకా బాగా ఎదిగి పరిశ్రమల స్థాయిని పొందాలంటే వారికి కావలసిన విషయపరిజ్ఞానాన్ని వారి వారి భాషలలోనే అందించాలి. తెలంగాణా, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో తెలుగులో అందించాలి. ఈ పరిశ్రమలతో సంబంధం ఉన్న పాలనాశాఖలు అన్నీ తెలుగులోనే వారికి అందించాలి. ప్రస్తుతానికి పరిస్థితులకు అనుగుణంగా ఈ రంగాలలో పనిచేసే వారికి శిక్షణ నివ్వడం అవసరం. అంతర్జాతీయంగా ఆయా రంగాలలో వస్తున్న ఆధునిక పోకడలూ, ఆధునిక సదుపాయాలూ పనిముట్లూ, ఆధునిక పరిశోధనల ఫలాలూ ఇవన్నీ వారికి అందించగలిగితే పరిశ్రమలు అభివృద్ధి చెందుతాయి. ఈ ప్రక్రియ మొత్తం ప్రాంతీయభాషలో జరిగితేనే వినియోగించుకొనే వారికి సౌకర్యవంతంగా ఉంటుంది. వారికి సులభంగా, అర్థమయ్యే రీతిలో దేశభాషలలో అందించినప్పుడే ఇది సాధ్యమవుతుంది. వారి అవసరాలను గుర్తించి వారి వారి ప్రత్యేక అవసరాలను తీర్చడానికి పటిష్టమైన ఒక భాషావిధానం ఏర్పడటం అవసరం. ఈ రంగంలో పని చేసే వారందరికీ వారికి కావలసిన సమాచారాన్ని తెలుగులో పొందే హక్కు వారికి ఉంది. దానిని అందించే బాధ్యత ప్రభుత్వానిదే.

**సూచనలు :**

1. మాతృభాషాభివృద్ధి ఎంత కాదనుకున్నా భాషాభిమానం ద్వారానే సాధ్యం.
2. రాజకీయ, ఆర్థిక, సామాజిక కారణాల వల్ల కలిగే భాష పట్ల నిర్లక్ష్యవైఖరిని ఆరికట్టాలి.
3. వివిధ రంగాలలో మాతృభాషా ప్రాముఖ్యం పెరిగితే భాషాభిమానమూ, అభివృద్ధి వాటంతట అవే పెరుగుతాయి.
4. మాతృభాషామాధ్యమానికి ఉద్యోగాలకూ సహజ సంబంధం ఏర్పరచాలి.
5. ఆంగ్ల భాషానైపుణ్యంతో మంచి కొలువులు దొరుకుతున్నాయి. ఈ పరిస్థితి తెలుగులో రావాలి. అన్ని రంగాలలోనూ మాతృభాషా నైపుణ్యాల రంగప్రవేశమే ఈ సమస్యకు పరిష్కారం. మాతృభాషా మాధ్యమ విద్య నేరుగా సేవారంగానికి సంబంధించినది. ప్రభుత్వ రంగాలలో పనిచేసేవారు(పాలనా, వైద్య, ఆర్థికాది సేవలు) తెలుగు మాధ్యమంలో చదివి గానీ తెలుగు భాషను మూడు సంవత్సరాలు ప్రత్యేక భాషగా నేర్చి గానీ ఉండాలి.
6. పాలన, సేవా వాణిజ్య రంగాలలోనూ తెలుగు వాడకంలో ఉత్తమ ప్రతిభ కనబరిచిన వారికి ప్రోత్సాహకాలను అందించాలి.

## 6.0 సమస్యలు - పరిష్కారాలు

తెలుగు భాషను ప్రధాన భాషగా వాడే రాష్ట్రాలుగా ఆంధ్రప్రదేశ్, తెలంగాణ ఆవిర్భవించాయి. రాష్ట్రాలు వేరైనా వ్యవహార భాష ఒక్కటే కాబట్టి రాబోయే కాలంలో ఏర్పడబోయే ప్రభుత్వాలు కలిసికట్టుగా భాషాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టవచ్చు.

ఉమ్మడి కార్యాచరణ ప్రణాళిక అవసరం. అందులో సంకుచితమైన ఆలోచనలకు తావు లేకుండా భాషా సమస్యల పట్ల దృష్టి సారించాలి. తెలుగుభాషా సమస్యను పరిష్కరించాలంటే రాజకీయాలకూ, ప్రాంతాలకూ, స్వార్థ ప్రయోజనాలకూ అతీతంగా ముందుకు సాగాలి. భాషాప్రగతికి రూపకల్పన చేసే విధంగా, తెలుగుభాష నిత్యవ్యవహారంలో పరిఢవిల్లే విధంగా దీర్ఘకాలిక ప్రయోజనాల సాధన దిశగా భాషా విధానం ఉండాలి.

ఈ రాష్ట్రాలలో ప్రజల భాష తెలుగు. పరిపాలన, సేవ, వృత్తి, వ్యవసాయ, వాణిజ్య, విద్య, వైద్య తదితర రంగాలలో తెలుగు తెలియని వారు ఆయా సేవలను అందించలేరు. కాబట్టి విద్యార్థులలో తెలుగులో నైపుణ్యం ఆవశ్యకంగా గుర్తించాలి.

సచివాలయం, న్యాయస్థానాలు సమాచార ప్రసార సాధనాల సంస్థలు తెలుగులో తమ కార్యకలాపాలను నిర్వహించడం ఎంతో అవసరం. తెలుగు భాష అమలు కోసం అధికార భాషా సంఘం గ్రంథాలనూ, నిఘంటువులనూ సాంఖ్యీకరించాలి.

తెలుగు మాధ్యమంలో విద్యాబోధన తెలుగుజాతి వికాసానికి దోహదకారి. అన్యభాషా మాధ్యమం ద్వారా అభివృద్ధి కష్ట సాధ్యం.

సహజమైన భావ ప్రేరణ, ప్రగతి, మాతృభాష వల్లనే వస్తుంది. మాతృభాషలో విద్యాబోధన వల్ల గ్రహణ సామర్థ్యం, సృజనాత్మకత పెరుగుతాయి.

భాషా సంక్లిష్ట భారతదేశంలో విద్యార్థుల భాషానైపుణ్యాలు, జీవన వికాసం వేగవంతమూ ప్రగతికారకమూ కావాలంటే, భారతదేశంలోని ప్రాంతీయ భాషల అస్తిత్వం ప్రశ్నార్థకంగా మారకుండా ఉండాలంటే త్రిభాషా సూత్ర విధానం అమలు చేయడం ఎంతో ప్రయోజనకరం. దీన్ని గమనించి దాని అమలు దిశగా ఇరు ప్రభుత్వాలూ చిత్తశుద్ధితో కృషి చేయాలి.

పాలనా భాషగా తెలుగు అమలుపై రాష్ట్రస్థాయి అవగాహనా సదస్సులు జరగాలి.

పోటీ పరీక్షలన్నింటిలోనూ తెలుగు భాషానైపుణ్యాలను సాధించటం, తెలుగువారితో పాటు ఇతర మాతృభాషల వారికీ

తప్పనిసరి చేయాలి.

ప్రజల వద్దకు పాలన అనేది తెలుగుభాషను పరిపాలనా భాషగా పూర్తిగా అమలు పరిచినప్పుడే సాధ్యం. అందుకు విధివిధానాలను రూపొందించుకొని ముందుకు సాగాలి.

ప్రజల భాషలో పాలన సాగటానికి సమాజంలో మార్పు మన నుండే ప్రారంభం కావాలి. శాఖల వారీగా ప్రత్యేక పదకోశాలను రూపొందించుకుని కంప్యూటర్ ద్వారా తెలుగు వాడకాన్ని అమలు చేయాలి.

తెలుగును అధికారభాషగా ప్రవేశపెట్టిన బిల్లు చట్టం అయింది. ప్రభుత్వ శాఖలు తెలుగులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు చేయాలని ప్రభుత్వ ఉత్తర్వులూ ఉన్నాయి. పరిపాలనా భాషగా తెలుగు స్వరూపం ఎలా ఉండాలో పింగళి లక్ష్మీకాంతం, జి.ఎల్.పి.గ్విన్, భద్రిరాజు కృష్ణ మూర్తి గార్ల అధ్యక్షతన ఏర్పడ్డ సంఘాలు నిర్ణయించాయి. తగిన సూచనలు చేశాయి. ఆ సూచనలు అనుసరిస్తూ ప్రజాస్వామ్య యుగంలో ప్రజల భాషలో పరిపాలన సాగించాలి. పాలకుల భాష ఒకటి, పాలితుల భాష మరొకటి కాకూడదు. అలా అయితే అవ గాహనా పరిధి కుంచించుకుపోతోంది.

ప్రజలు తమ సమస్యలను తమ భాషలో వ్యక్తీకరించుకొనే హక్కును రాజ్యాంగం కల్పించింది. అర్థమయ్యేలా ప్రజలకు తెలుగులో వివరించే బాధ్యత అధికారులపై ఉంది. అయితే దీనికి కీలకం భాషను ఆధునికీకరించడం. ఆధునిక అవసరాలకు అనుగుణంగా భాషాభివృద్ధి జరగాలి.

తెలుగులో పాఠ్యగ్రంథాలను ప్రచురిస్తూ, వాటిని మధ్యమధ్యన పరిష్కరిస్తూ ఉండాలి. సమగ్రమైన పారిభాషిక పదకోశాన్ని తయారు చేయించాలి. ప్రభుత్వం, తెలుగు అకాడమీ, విశ్వవిద్యాలయాల వంటి ద్వారా అన్ని స్థాయిలలో తెలుగు బోధనా భాషగా అమలు చేసేందుకు వీలుగా గ్రంథాలు రాయించాలి.

పత్రికలు నూతన పద నిర్మాణాలను చేయాలి. పత్రికా భాషా నిఘంటువులు రూపుదాల్చాలి.

వైజ్ఞానిక, సామాజిక విషయాలపై గ్రంథాలను విరివిగా అనువాదం చేయించాలి.

ప్రజల్లో చైతన్యం వచ్చి దీక్షతో, పట్టుదలతో తెలుగును బోధనా భాషగా అమలు చేయడంలో సహకరించాలి.

తెలుగును బోధనా భాషగా చదివిన వారికి ప్రోత్సాహకాలు కల్పించాలి.

ప్రభుత్వ ఉత్తర్వులు, న్యాయస్థానాల తీర్పులు పూర్తిగా తెలుగు లోనే ఉండాలి.

ఇలాంటివి రెండు రాష్ట్రాలలోనూ జరగాలి. తెలుగు భాషా పరిరక్షణ ప్రస్తుత ప్రభుత్వాల ధ్యేయం కావాలి.

పాఠ్య పుస్తకాలలో, ప్రసార మాధ్యమాలలో వాడే భాష విష యంలో తెలుగు రాష్ట్రాలు కావాలనుకొంటే వ్యవహారిక ప్రామాణి కతను అంగీకరించవచ్చు. మాండలిక వ్యవహార పరివర్తనాలను రూపొందించుకోవాలి. తర్వాత సంభవించే సమస్యలను ముందుగానే ఊహించి అన్ని ఉపమాండలికాలకూ ఆ ప్రామాణిక భాషలో ప్రాతినిధ్యం ఉండేలా చూడాలి.

నచ్చిన భాషను అభ్యసించే స్వేచ్ఛ ప్రతి పౌరుడికీ భారత రాజ్యాంగం కల్పించింది. ఇది ప్రాథమిక హక్కు. దీనిని ఆసరాగా తీసుకొని మాతృభాషను పాఠ్యాంశంగా స్వీకరించకుండానే విద్యాభ్యాసం పూర్తి చేసే అవకాశమూ ఉంది. మాతృభాషా ప్రస్తావన లేకుండానే మొత్తం చదువు పూర్తి చేసే అవకాశమూ ఉంది. దీనికి ప్రధాన కారణం ఉద్యోగ భద్రత లేకపోవడం. ఉద్యోగ భద్రత భారత రాజ్యాంగం కల్పించిన హక్కు. ఐతే నచ్చిన మాతృభాషలో చదువు పూర్తి చేసిన పౌరులకు ఉద్యోగ భద్రత కల్పించని రాష్ట్ర ప్రభుత్వాలు రాజ్యాంగం కల్పించిన హక్కులను విస్మరిస్తున్నాయన్నమాట. దీనికి విరుగుడుగా, మాతృభాషలో విద్యాభ్యాసం పూర్తి చేసిన వారికి దామాషా పద్ధతిలో ఉద్యోగ భద్రత కల్పించాలి. అలా కాని పక్షంలో అంటే, ఉద్యోగ భద్రతను కలిగించని భాషలు అతి త్వరగా తమ ఉనికిని కోల్పోతాయి.

## 7.0 ఉపసంహారం

భాషలు అస్తిత్వాన్ని కోల్పోతే ఆ భాషా వ్యవహర్తల సామాజిక, చారిత్రక, సాంస్కృతిక వారసత్వ సంపదను కోల్పోయినట్లే. అంటే తమ ఉనికినీ, సంస్కృతినీ, భాషనూ నిలుపుకునేందుకు దశాబ్దాల తరబడి నిర్వహించిన వందలాది ఉద్యమాలకూ చేసిన వేలాది త్యాగాలకూ విలువ లేనట్టే. పూర్తిగా రాజ్యాంగ స్ఫూర్తితో ప్రజలు ఎన్నుకున్న ప్రభుత్వాలు భాషా విధ్వంసాన్నీ దాని పర్యవసానంగా ఏర్పడే జాతి విధ్వంసాన్నీ ఆపాలి.

ఇటు తెలంగాణా, అటు ఆంధ్రప్రదేశ్ రెండు రాష్ట్రాలలోనూ సత్వరం చేపట్టవలసిన చర్యలు కొన్ని ఎదురు చూస్తున్నాయి. సాంకేతికంగానూ, శాస్త్రీయంగానూ భాషాభివృద్ధిని వేగవంతం చేయాలి. అంతర్జాలంలోనూ, సంగణక ఉపకరణాల రూపకల్పన లోనూ, అనువాదాలలోనూ తెలుగును విస్తరించాలి. సమానార్థక పదాల తయారీ, అన్ని అవసరాలు తీర్చే మహానిఘంటు నిర్మాణం, వివిధ శాస్త్ర విషయాలకు సంబంధించిన పాఠ్యగ్రంథాల తయారీ, ప్రభుత్వ, ప్రభుత్వేతర వెబ్ సైట్ల నిర్వహణ, ఆన్‌లైన్ సేవల సౌకర్యాల కల్పన, పారిభాషిక పదకోశాల నిర్మాణం, విశ్వవిద్యాలయాల మధ్య పరిశోధన సమన్వయం, తెలుగు సాంకేతిక పరికరాల సృష్టి, వాటి వినియోగం అలాగే ఉపాధి సృష్టి మొదలైన ఎన్నో అంశాలు ఉన్నాయి. వీటిని నిర్లక్ష్యం చేయటం మానుకోవాలి. ప్రతిభా శూన్యత, అనవగాహన, సత్వర లాభాపేక్ష, దీర్ఘకాలిక దృష్టిలోపం వంటివి ఎన్నో కారణాల వల్ల వికసించవలసిన సహజ వనరులు అరకొరగానే నేలరాలిపోతున్నాయి. ఇది మరింత జటిలమైన తీవ్ర సమస్యల లోనికి దారి తీయకముందే రెండు రాష్ట్రాల ప్రభుత్వాలూ ముందుకు రావాలి. తెలుగు ప్రజలందరికీ కలిసి సమష్టి కార్యాచరణను ఏర్పరచుకోవాలి. ఈ ప్రక్రియ ఒక బాధ్యతగా భావించి అటు ప్రభుత్వమూ, ఇటు ప్రజలూ కృషి చేసినప్పుడే శాశ్వత ఫలితాలు లోకానికి అందుతాయి.

**(పూర్తి అయింది)**

రచయితలు
హైదరాబాదులోని కేంద్రీయవిశ్వవిద్యాలయంలో ఆచార్యులు
డా॥గారపాటి ఉమామహేశ్వరరావు ఫోను :9866128846
డా॥అద్దంకి శ్రీనివాస్ ఫోను : 8500305374

-డి.పి.అనూరాధ

# తెలుగు... సంగీత ప్రధానమైన భాష

**శం**కరాభరణం... పరిచయం అక్కర్లేని చిత్రరాజం. తెలుగు సినిమా ఖ్యాతిని ప్రపంచానికి తెలియజేసిన సినిమా. 1980లో దక్షిణాదిలో ఈ సినిమా ఓ ప్రభంజనం.

తమిళంలోనే కాదు... కన్నడంలోనే కాదు... మలయాళంలో కూడా హిట్టయింది. కేరళలోని ఎర్నాకుళంలోని ఓ థియేటర్‌లో ఏడాదిన్నర ఆడింది. సినిమానంతా మలయాళంలోకి డబ్ చేశారు. కానీ పాటలు మాత్రం అలాగే తెలుగులోనే ఉంచారు. ఈ సినిమా అఖండ విజయం సాధించడానికి మూలకారణం పాటలే... ఈ సినిమాలోని కర్నాటక శాస్త్రీయ సంగీతానికి ఆబాలగోపాలం ఓలలాడింది. కర్నాటక సంగీతానికి సంబంధించి ఓ విషయం ప్రముఖ్యంగా పేర్కొంటారు. ఈ సంగీతానికి పేరు కర్నాటక... బాగా ప్రసిద్ధి చెందింది తమిళనాడులో... కానీ స్వరకీర్తనలన్నీ తెలుగులో ఉంటాయి... కర్నాటక సంగీతంలోనించి తెలుగు కీర్తనలను తీసివేస్తే దాదాపు 75 శాతం ఖాళీ ఏర్పడుతుంది. కర్నాటక సంగీతానికి తెలుగుకీ అంతటి అనుబంధం మరి. బ్రోచేవారెవరురా.. కీర్తనని వినని వారు కానీ పాడని సంగీత విద్వాంసుడు కానీ ఉండరు. ఎంతో ప్రసిద్ధిచెందిన ఈ పాటను రచించింది మైసూర్ వాసుదేవా చారి. ఈయన మాతృభాష కన్నడం. కానీ తెలుగులో వందల కృతులను రచించాడు. కర్నాటక సంగీతానికి తెలుగు వారి గొప్ప కానుక తెలుగు భాషే. మిగతా దక్షిణాది భాషలకంటే ముందుగానే తెలుగు అచ్చుల ప్రాధాన్యాన్ని సంపాదించుకుంది.

సంగీత నాదాన్ని వెలువరించే శక్తి అచ్చులకే ఉంది. అనునాసికాలకే ఉంది కానీ హల్లులకి లేదు. ఇతర భాషల వాళ్లు సంగీత రచన చేసేప్పుడు హల్లుల ప్రాధాన్యాన్ని సాధ్యమయినంతవరకు తగ్గించుకుంటారు. జయదేవుడు గీతగోవిందాన్ని రచించేప్పుడు హల్లు ప్రాధాన్యమైన సంస్కృతాన్ని సంస్కరించి అష్టపదులను రచించాడు.

కానీ తెలుగు వారికీ బాధ లేదు. అజంత భాష. మొదటి నుండే లాలిత్యాన్ని సొంతం చేసుకుంది..

తెలుగు... ది ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్

తెలుగు... ది కల్చరల్ లాంగ్వేజ్ ఆఫ్ ది సౌత్

తెలుగు...ది లాంగ్వేజ్ ఆఫ్ అభినయ

అని భారతీయ సంస్కృతిని పరిశోధించిన చరిత్రకారులు పేర్కొంటారు. ఇటాలియన్ భాష అతి మృదువై... సంగీతానికి అనువుగా ఉంటుంది. తెలుగు కూడా అతి మృదువుగా ఉండి సంగీతానికి అనుకూలంగా ఉంటుంది. అందుకే తెలుగును ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్ అంటారు.

భారతదేశ సంగీత కళ ఉత్తర దక్షిణ సంప్రదాయాలుగా విడిపోయినప్పుడు.. ఉత్తరాన వ్రజ భాష, దక్షిణాన తెలుగు సంగీత భాషలుగా ప్రాముఖ్యం సంపాదించాయి.

అమరావతిలో అజరామరమైన శిల్పాల్ని... అజంతాలో అలౌకికమైనటువంటి చిత్రాల్ని అందించిన ఆనాటి తెలుగు వారికి సంగీతం గురించి కూడా తెలుసు. దీనికి సాక్ష్యం భరతుడి నాట్యశాస్త్రం... ఇందులో ఆంధ్రి అనే రాగ జాతి గురించి ప్రస్తావించారు.

అమరావతి. నాగార్జునకొండ, గొలిలోని స్థూప... విగ్రహ శిల్పాలలో వివిధ వీణలు... వేణువు... మృదంగం తదితర వాయిద్యాలు ఉన్నాయి. అంతేకాక శాతవాహన రాజు హాలుడు రచించిన గాథా సప్తశతిలో వాయిద్యాల ప్రస్తావన ఉంది. గాథాసప్తశతి క్రీస్తు శకం ఒకటో శతాబ్దికి చెందిన గ్రంథం. కాబట్టి తెలుగు వాళ్లు సంగీతజ్ఞులు అని కచ్చితంగా పేర్కొనవచ్చు.

కాకతీయుల కాలంలో జాయప సేనాని నృత్యరత్నావళితో పాటు వాద్యరత్నావళి అనే గ్రంథాన్ని కూడా రచించాడట. వీటిలో నృత్య రత్నావళి మాత్రమే ప్రస్తుతం అందుబాటులో ఉంది.

రామప్ప ఆలయ శిల్పాల్లో ఎన్నో వాయిద్యాలు కనువిందు చేస్తాయి... ఇక విజయనగర రాజుల కాలంలో సంగీతనృత్యాలు ఎంతో వైభవాన్ని చూశాయి. ఎందరో తెలుగు వాగ్గేయకారులు రాజుల ఆదరాభిమానాల్ని చూరగొన్నారు. ఇటువంటి కోవకు చెందిన వాడే అన్నమయ్య...

క్రీస్తు శకం 12వ శతాబ్దిలో భక్త జయదేవుడు రచించిన గీతగోవింద ప్రబంధ ప్రభావానికి తెలుగు వాగ్గేయకారులే కాదు... తెలుగు నర్తకులు కూడా ప్రభావితులయ్యారు. జయదేవుడికంటే ముందు కూడా వాగ్గేయకారులు ఉన్నారు. కానీ ఎవ్వరికీ ఇంతటి పేరు ప్రఖ్యాతులు రాలేదు. జయదేవుని తరువాత తెలుగు నేల మీద 50 మంది వాగ్గేయకారులు జన్మించారు. వీరు కీర్తనలు, పదాలు, జావళీలు, వర్ణాలు, పదవర్ణాలు, జతి స్వరాలు ఇలా ఎన్నో రచనలు చేశారు.

తెలుగు వాగ్గేయకారులలో భీష్ముని వంటివాడు అన్నమయ్య. పరిమాణంలోనే కాదు వైవిధ్యంలోనూ అన్నమయ్య రచనలు సాటిలేనివి. 32 వేల సంకీర్తనలని రచించాడు.. శృంగార, భక్తి, వైరాగ్యాలను సమదక్షతతో రచించాడు.

అన్నమయ్యది కడప జిల్లాలోని తాళ్లపాక. కర్నాటక సంగీతానికి పితామహుడిగా పేరుపొందిన పురందరదాసుకు అన్నమయ్య సమకాలికుడు. క్రీస్తు శకం 1424లో జన్మించిన అన్నమయ్య క్రీస్తు శకం 1503లో పరమపదించాడు.

అన్నమయ్య తరువాత వాగ్గేయకారులుగా పేరుపొందినవారు నారాయణ తీర్థులు. గుంటూరు జిల్లా మంగళగిరికి చెందిన నారాయణ తీర్థులు తరువాత తమిళనాడులో స్థిరపడ్డాడు. ఈయన

సంస్కృతంలో రచించిన కృష్ణలీలా తరంగిణి మహాద్భుత యక్షగాన ప్రబంధం... నిండు చంద్రుడిని చూసి సాగర కెరటాలు ఉవ్వెత్తున ఉప్పొంగినట్టుగా ఈయన రచించిన ప్రతి తరంగం లయవిన్యాసాలతో పొంగి పొరలు తుంది. జయదేవుని గీతగోవిందానికి దీట యింది- నారాయణతీర్థుల కృష్ణ లీలా తరంగిణి. అయితే గీతగోవిందంలో శృంగార రసం ప్రధానంగా ఉంటే శ్రీకృష్ణలీలా తరం గిణిలో భక్తి భావం ప్రధానమైంది. యక్ష గానాన్ని పలురీతుల్లో ప్రభావితం చేసిన వ్యక్తి నారాయణ తీర్థులు.

ఇక భద్రాచల రామదాసు కీర్తనలన్నీ కూడా భజన సంప్రదాయానికి చెందినవే... సంగీత సాహిత్యాలు ఈయన కీర్తనలలో సమ పాళ్లలో ఉంటాయి. భావానుగుణంగా రాగాన్ని వాడటంలో సిద్ధ హస్తుడు క్షేత్రయ్య. అలౌకిక శృంగారానికి అచ్చ తెలుగు నుడికారానికి దేశిగౌరవం అద్ది జగతికి అందించిన మహనీయుడు క్షేత్రయ్య. అభినయానికి క్షేత్రయ్య పదాలను మించినవి లేవు. కృష్ణా జిల్లా మొవ్వ ఇతడి జన్మస్థానం. పదరచనలో క్షేత్రయ్యకు క్షేత్రయ్యే సాటి. క్షేత్రయ్య నాలుగు వేల పదాలు రచించినట్టు తెలుస్తోంది. కానీ నాలుగు వందలు మాత్రమే లభిస్తున్నాయి. క్షేత్రయ్య మీద అన్నమయ్య ప్రభావం కన్పిస్తుంది. అప్పట్లో క్షేత్రయ్య పదం అభినయించకుండా ఏ నాట్య కచేరీ ముగిసేది కాదంటే అతిశయోక్తి కాదు.



క్షేత్రయ్య తరువాత మనం తెలుసుకోవలసిన సంగీత జ్ఞాని జగన్నాథ పండితరాయలు. ఈయన తూర్పుగోదావరి జిల్లా కోనసీమ లోని ముంగండ అనే గ్రామంలో జన్మించాడు. అయితే ఉత్తర భారత దేశంలో పండిట్ రాజ్ జగన్నాథ్‌గా ఈయన ప్రసిద్ధిచెందారు. మొఘల్ చక్రవర్తి షాజహాన్, తాన్‌సేన్‌ల ఆదరాభిమానాలు పొందాడు జగన్నాథ రాయలు. ఈయన గాయకుడు మాత్రమే కాదు, రచయిత కూడా. తాన్‌సేన్ తరువాత జగన్నాథుని కీర్తనలే గొప్పవని అందరూ ఆనాడు కీర్తించేవారు. జగన్నాథ పండితుడు రచించిన గంగాలహరి చాలా ప్రసిద్ధిచెందింది.

కర్నాటక సంగీతం అనగానే ముందుగా గుర్తుకువచ్చే పేరు త్యాగయ్య. కర్నాటక సంగీతానికి త్యాగయ్య రచనలు పర్యాయపద మయ్యాయి. 'ఎందరో మహానుభావులు' అంటూ తన పంచరత్న కీర్తనలతో నమస్సులు సమర్పించాడు త్యాగయ్య. ఆయన తన కీర్తన లతో కర్నాటక సంగీతానికి జీవంపోశాడు. ఈ నాదబ్రహ్మ జన్మించక పోతే కర్నాటక సంగీతానికి ఇంతటి మహోన్నత స్థితి వచ్చేదికాదు. శ్రీరాముడిని కీర్తిస్తూ త్యాగయ్య 24 వేల కృతులను రచించాడు. వాల్మీకి కూడా 24 వేల పద్యాలలో రామాయణాన్ని రచించడం విశేషం. అందుకే త్యాగయ్యను అభినవ వాల్మీకిగా కీర్తిస్తారు. త్యాగయ్య తెలుగువాడు. నేటి తమిళనాడులోని తిరువారూర్లో త్యాగయ్య జన్మిం చారు. తిరువారూర్‌కు సంబంధించి ఓ విశేషం ఉంది. కర్ణాటక త్రయంగా పేరుతెచ్చుకున్న త్యాగయ్య, ముత్తుస్వామి, శ్యామశాస్త్రి తెలుగువాళ్ళు మాత్రమే కాదు... ఒకే ఊరి వాళ్లు... వీరి ఇండ్లు కూడా పక్కపక్క వీధుల్లోనే ఉంటాయి.

సంగీత త్రయంలో అందరికన్నా పెద్ద వాడు శ్యామశాస్త్రి. శ్యామశాస్త్రి పూర్వీకులు కర్నూలు నుంచి తరలివెళ్లిన వారని చెబు తారు. మిగతా ఇద్దరితో పోలిస్తే శ్యామశాస్త్రి కృతులు 3 వందలకు మించి ఉండవు. కృతు లన్నిటినీ కూడా కామాక్షి అమ్మవారి పేరు మీదే రచించాడు శ్యామశాస్త్రి.

సంగీత ప్రధానమైన మూడు స్వర జతులు.... రత్నత్రయాలను ప్రవేశపెట్టినది ముత్తుస్వామి దీక్షితులు. కర్నాటక సంగీత త్రయంలో చిన్నవాడు. ప్రస్తుతం 500 కృతులు అందుబాటులో ఉన్నాయి. కచేరీ లకు అనువుగా కర్నాటక సంగీతాన్ని తీర్చి దిద్దిన ఘనత ఈయనది.

స్వరబ్రహ్మ త్యాగయ్యను తమిళులు తమ మనసుల్లో పెట్టుకుని ఆరాధిస్తున్నారు. త్యాగయ్య ఆరాధనోత్సవాలను ఎంతో ఘనంగా నిర్వహిస్తుంటారు. నాయకరాజుల కాలంలో తెలుగుదేశం నుంచి తంజావూరు... మధురై... తిరువయ్యూరు... శ్రీరంగాలకు వెళ్లి అక్కడి పరిసరాలలో స్థిరనివాసమేర్పరచుకున్న సంగీతకారులు ఎందరో ఉన్నారు.

క్రీస్తుశకం 19-20 శతాబ్దాలలో కర్ణాటక సంగీతానికి సంబం ధించి లక్షణ గ్రంథాలు మిగతా భాషలతో పోలిస్తే తెలుగులో ఎన్నో వచ్చాయి. ఇలా మొదటి నుండి సంగీత కళలో తెలుగువారెక్కువగా కృషి చేశారు. కళలకు కేంద్రాలైన విజయనగరం. తంజావూరు, మధుర, పుదుక్కోటు తదితర రాజాస్థానాలలో తెలుగు వాగ్గేయకారులు చొరవగా ప్రవేశించి తమ రచనలను బాగా వ్యాప్తిలోకి తెచ్చుకున్నారు. దాంతో సంగీత కళలో తెలుగు భాషకు ఒక సంప్రదాయం ఏర్పడింది. అందువల్లే తమిళ, కన్నడ, మలయాళ భాషలవారు కూడా తెలుగును ప్రయత్నపూర్వకంగా నేర్చుకున్నారు. తమ రచనలను తెలుగులో చేశారు అని తీర్మానించారు ప్రముఖ పండితులు రాళ్లపల్లి అనంత కృష్ణశర్మ.

ఇలా సంగీతమే జీవధారగా... జీవనాధారంగా ఎంచుకుని ఎందరో మహానుభావులు తెలుగు భాషకు విశిష్టతనే తీసుకువచ్చారు.

కానీ నేడు రాజధానిలో తెలుగును వెతుక్కోవలసిన అగత్యం ఏర్పడింది!

*-రచయిత్రి ఫోను : 90100 16555*

## బడి అమ్మనుడి

బడిలో
అమ్మనుడిలో
అక్షరాలు నేర్చుకొని
జ్ఞానాన్ని పెంచుకొని
రెక్కలొచ్చిన పక్షిలా
ఎగిరి పోతుంటే...
బడి-అమ్మనుడి
కనుమరుగేనా

ఏ దేశమేగినా
ఏ పీఠమెక్కినా
ఎన్ని భాషలొచ్చినా
బడి-అమ్మనుడి
నీ రెండు కళ్లు అని
మరవకు
నీ కళ్ళను నీ వేలుతో
పొడుచుకోకు.

-అమ్మిన
వెంకట అమ్మిరాజు
94407 08656

మనసులో మాట

-డా॥వావిలాల సుబ్బారావు

# పుక్కిటి పురాణాలు-కాకమ్మ కథలు

***తారీకుల వివరాలు లేనివాళ్ళ గురించి ఎక్కువగా పుక్కిటి పురాణాలు అల్లుకున్నాయి. బుద్ధుడు పుట్టగనే ఏడు అడుగులు వేశాడట. పాదాల క్రింద పద్మాలు పుట్టాయట. వ్యాసుడు భారతం చెప్పమంటే వ్రాయటానికి స్వయంగా వినాయకుడే వచ్చాడట.***

**పు**రాణాలు పుస్తకాల్లో ఉంటాయి. పుక్కిటి పురాణాలు ప్రజల పుక్కిట ఉంటాయి. కథలు పుస్తకాల్లోనూ ఆనోట ఈనోట ఉంటాయి. కాకమ్మ కథలు, పేరు చెప్పకుండా కొమ్మల మాటు నుండి 'కావు కావు' మంటుంటాయి. పురాణాల కన్నా పుక్కిటి పురాణాలు, కథల కన్నా కాకమ్మ కథలు ఆసక్తిగా ఉంటాయి. కానీ చరిత్రలు రాసే పెద్దలు వీటిని ఈసడించుకుంటారు. మనవాళ్లంత వాస్తవ చరిత్రలు వ్రాయరు. అన్నీ 'అబద్ధ కథలు' అంటారు.

అసలు ఇవి ఎందుకు పుట్టినట్లు? ఎవరిని మోసం చేద్దామను కొని కల్పించారు? వినేవాళ్ళు మాత్రం చెవుల్లో అంతపెద్ద పువ్వు పెట్టుకొని వింటారా? ప్రతి అర్థం వెనుక ఒక పరమార్థం ఉండి తీరదా? 'తారీఖులు, దస్తావేజులు... ఇవి కావోయ్ చరిత్రకర్థం.... ఇతిహాసపు చీకటికోణం అట్టడుగునపడి కన్పించని కథలన్నీ కావా లిప్పుడు...' అన్న శ్రీశ్రీ, 'తాత తాతలనాటి గాథలన్నీ తవ్వెపోస్తానోయ్' అన్న విశ్వనాథ- వారి ఉద్దేశ్యాలు ఏమైనా ఒకటే వెతకాలనిపిస్తుంది. ఇద్దరికీ కావలసింది కథలు - గాథలు- అక్కరలేంది సారహీనమైన అంకెలు-వివరాలు.

మన చరిత్ర పుస్తకాలు ఈ సారహీన వివరాల వల్లనే విద్యార్థు లకు దూరమైనాయి. వాళ్ళకు మొహం మొత్తింది. ఫలానా మహాను భావుడు ఎప్పుడు పుడితేనేం? చరిత్రలో ఎందుకు నిలిచాడో కావాలి. ఫలానా పుస్తకం రాసినవాడి అమ్మానాన్న ఎవరయితేనేం? ఆ పుస్తకం మనకు ఏ కొత్తదారిని చూపించి ఏ కొత్త లక్ష్యాన్ని నిర్దేశించిందో కావాలి.

వ్యాసుడి DOB (డేటాఫ్ బర్త్ -అంటే పుట్టినతేదీ అనవచ్చు కదా! ఇట్లా అంటేనే ఆధునికత)- వాల్మీకి ఎప్పుడు పుట్టింది/ఎక్కడ/ వివరాలు లేవు. ఫ్చ్..ఫ్చ్...! బుద్ధుడు పుట్టిన సంవత్సరం ఇంకా చర్చిస్తూనే ఉన్నారు. ఆచార్య నాగార్జునుడి గురించి అన్నీ సందేహాలే.

తారీకుల వివరాలు లేనివాళ్ళ గురించి ఎక్కువగా పుక్కిటి పురాణాలు అల్లుకున్నాయి. బుద్ధుడు పుట్టగనే ఏడు అడుగులు వేశాడట. పాదాల క్రింద పద్మాలు పుట్టాయట. వ్యాసుడు భారతం చెప్పమంటే వ్రాయటానికి స్వయంగా వినాయకుడే వచ్చాడట. వాల్మీకిని రామాయణం వ్రాయమని చెప్పి-నువు వ్రాసినట్లే జరుగు తుంది అన్నాడట దేవుడు. స్వయంగా వచ్చి జరిగినట్లు వ్రాయలేరు- వ్రాసినట్లుగా జరిగింది. నాగార్జునుణ్ని నాగలోకానికి తీసుకొనివెళ్ళి నాగరాజు 'ప్రజ్ఞా పారమిత గ్రంథం' ఇచ్చాడట. అందువల్లనే నాగా ర్జునుడు అయినాడట.

భవభూతి, దండి, కాళిదాసు- తలా ఒక శ్లోకం వ్రాసి కాళికా దేవి ముందు ఉంచి మాలో తరతమ భేదాలు నిర్ణయించమంటే- ఆమె 'కవిర్దండి...కవిర్దండి-భవభూతిశ్చ పండితః' అందిట. కాళి దాసుకు కోపం వచ్చి 'కోహోరండే..కోహోంరండే' అని దబాయించాడు (రండే= ముండా అని) ఆమె 'త్వమేవాహం త్వమేవాహం నసంశయ' అందిట.

పోతన్న అనాథల గురించి ఎన్ని కథలో! పోతన్న భాగవతాన్ని రాజులకు అంకితమిస్తాడేమోనని దిగులుతో సరస్వతీదేవి కన్నీరు పెట్టుకుంటే 'కాటుక కంట నీరు చనుకట్టు పయింబడ ఏల యేడ్చెనో' అంటూ ప్రత్యక్షంగా చూస్తూ ఓదార్చాడుట. ఇవన్నీ ఎవరయినా ఇపుడు నమ్ముతారా? నేను నమ్ముతాను! ఏమని నమ్ముతానంటే...

ఆ కథలన్నీ నారీ మహిమను మనకు తెలియచెప్పే కల్పనలే. కాళిదాసు కవితా వైభవాన్ని ఎంత విశ్లేషణాత్మకంగా చెప్పినా సాధారణులకు వంటపడుతుందా? మల్లినాథ వ్యాఖ్యానం చెప్పినా సాహిత్యార్థం తెలుస్తుంది కానీ సాహిత్య మహనీయత కళ్ళకు కడు తుందా? 'కోహోం రండే' అనటంలోని ధిషణాహంకారం 'త్వమే వాహం' అనటంలోని సాహిత్యదేవీ సమత్వం- ఈ కథవల్ల కాక మరెట్లా అర్థం అవుతాయి! పోతనలోని అతీత భక్తితత్పరత-సరస్వతీ తర్పణం-దేవీప్రీతి-ప్రాపంచిక సంపదలకు ఈ భాగవత గ్రంథం బహుదూరమనీ, ఆ ప్రాపంచిక వాసనలు సోకరాదన్నంత మహదర్థం -ఈ కథ లేకుండా మరొక విధంగా చెప్పి చూడండి. ఆకట్టుకుం టుందేమో! ఈ కథలన్నీ ఆ గ్రంథాల గురించిన విలువలను తెలిపే విమర్శన గాథలు.

అమరావతి శిల్పాలలో ఒక ఫలకం ఉంది. బుద్ధుడు కపిలవస్తు వచ్చాడని తెలిసి శుద్ధోధనుడు రాహులుడు-యశోధర, రాజు పరి వారం-అందరూ ఆయన ఆయన ఉన్నచోటకు వస్తారు. యశోధర ముఖం ప్రక్కకు తిప్పి నిలుచుంది. రాహులుని చేత నమస్కారం చేయిస్తున్నాడు శుద్ధోధనుడు. ఆయన వద్దకు వెళ్ళారు. అక్కడ బుద్ధుడు లేడు. ధర్మచక్రం ఉంది. 3×3 అడుగుల ఫలకం మీద ఈ గొప్ప దృశ్యం చిత్రించాడు ఆ మహాశిల్పి. ఎంత అద్భుతమో!

సారనాథ్‌లో 'మూలగంధకుడి విహారం'లో శ్రీలంక చిత్ర కారులు ఇదే దృశ్యాన్ని గోడమీద చిత్రించారు. అంతా ఇదే సన్నివేశం. అక్కడ బుద్ధుడు 8 అడుగులు ఎత్తున కనిపిస్తాడు. అందరూ సాధా రణంగా కనిపిస్తారు. అంతటి సర్వమానవ సమున్నతుడు అని రేఖల్లో చిత్రించాడు శ్రీలంక చిత్రకారుడు. మనుష్యుల కొలతలు తెలియక కాదు. అది చిత్రణా శిల్పం.

అమరావతి శిల్పికే బుద్ధుడు భౌతిక శరీరం లాగ కనిపించక ధర్మరూపంగా కనిపించాడు. అదొక శిల్పభాష.

అట్లాగే కాకమ్మ కథలలో కవితా విమర్శకు కథన రూపం

(23వ పుట చూడండి)

మాటా మంతీ

-సన్నిధానం నరసింహశర్మ

# భాషాభావజాల దారిద్ర్యంలో మన పాలకులు

*డా॥ఎబికె ప్రసాద్ తన గ్రంథాల ద్వారా అంతకంటే ముఖ్యంగా పత్రికా రచనల ద్వారా తెలుగునేల నాలుగు చెరగులా సుప్రసిద్ధులు. పత్రికల సర్క్యులేషన్‌పై ప్రభావాలు చూపే దక్షత గల పత్రికా సంపాదకులు. వారి సంపాదకీయాలు, విశ్లేషణల రచనలు గ్రంథాలుగా వచ్చాయి. ఆర్థిక రాజకీయ శాస్త్రాలను మథించిన వారు. అలవోకగా రాయ ప్రోలు, విశ్వనాథ, శ్రీశ్రీ వంటి మహాకవుల రచనల ఉటంకింపులను చేసే కవిత్వాభిమాని, సాహితీవేత్త. మథించిన బహురంగ జ్ఞాన పునాదులపై స్వీయ ఆలోచనల ఆవిష్కర్త. బాటపైనే కాదు, జీవనమార్గంలోనూ ఎడమవైపు వ్యక్తి. నమ్మినది కుండపగలగొట్టినట్లు చెప్పగల ధైర్యవంతుడు. ఆయన రచించిన వ్యాసాల్ని గమనిస్తే 'ఏబికె రచనా సూచి' అని ఓ పెద్ద గ్రంథమే తయారయ్యేటంత విస్తృత వ్యాసకర్త. ఇతర రాష్ట్రాలలోని, ఇతర దేశాలలోని పరిణామాలను అధ్యయనం చేసి మరీ వర్తమాన కాలీన స్పృహతో లోతైన అంశాలను వివరించడం ఆయన నైజం.*

*అధికార భాషాసంఘం అధ్యక్షులలో ఆయనదైన ఓ కాలం వుంది. అట్టి విశిష్టవ్యక్తితో శ్రీ సన్నిధానం నరసింహశర్మ చేసిన ముఖాముఖి- యథాతథంగా.... -సంపాదకుడు*



**డా॥ఎ.బి.కె.ప్రసాద్‌తో మాటామంతీ**

***ప్రశ్న : ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి అమరావతిని రాజధానిగా ప్రకటించారు. రాజధాని శంకుస్థాపన ఫలకాన్ని ఆంగ్లంలో తయారు చేశారు. కనీసం తెలుగు అక్షరాల క్రింద ఆంగ్లం వున్నా బాగానే వుండేది. రాజధాని శంకుస్థాపన ఫలకమే తెలుగులో లేకపోవడంపై మీ వ్యాఖ్య..?***

**ఎబికె :** ఒకనాటి అమరావతి బౌద్ధానికి కేంద్రంగా విరాజిల్లిన ప్రాంతం. క్రీ.శ. ఒకటవ శతాబ్దికి ముందు బౌద్ధం యజ్ఞయాగాదుల్నీ, విగ్రహారాధననూ వ్యతిరేకించింది. కులమతాలకన్నా వృత్తులకు ప్రాధాన్యమిచ్చింది బౌద్ధం. క్రీ.శ. ఒకటి రెండు శతాబ్దాల కాలం నుండే బౌద్ధంలో పతనావస్థలు ప్రారంభమయ్యాయి. వజ్రయానం వచ్చింది, తాంత్రిక విద్యలకు ప్రాధాన్యం పెరిగింది.

నాటి అమరావతి కేంద్రంలో బౌద్ధం వేటిని తిరస్కరించిందో వాటిని అనుసరించి నేటి అమరావతి శంకుస్థాపన కార్యక్రమాన్ని ప్రభుత్వం నిర్వహించింది. అటువంటి భాషా భావజాల దారిద్ర్యాల నుండి బయటపడని ప్రభుత్వ ప్రధాన పాలకుల కాలంలో అమరావతి శంకుస్థాపన ఫలకం తెలుగులో వుంటుందని భావించడమే భ్రమ. ఉండాలనుకోవడం సదాశయమే. కానీ ఈ పాలనాధిపతుల కాలంలో ఉండాలనుకోవడం తప్పే అవుతుంది. నేటి ప్రభుత్వాధినేతలకు తెలుగుపట్ల నిజమైన అభిమానం వుంటే దానిని పాలనా భాషగా తెలుగు అమలులోనూ తదితర రంగాలలోనూ చూపేవారు కదా!

***ప్రశ్న : అధికార భాషా సంఘం ఏర్పాటు నేపథ్యభూమిక...***

**ఎబికె :** ఉంది. వావిలాల గోపాలకృష్ణయ్య గారు శాసనసభ్యులుగా ఉన్నకాలంలో ప్రయివేటుగా భాషాబిల్లు పెట్టడానికి ఉద్యుక్తులయ్యారు. అప్పటి ముఖ్యమంత్రి పి.వి.నరసింహారావు గారు అలా ఎందుకూ-ప్రభుత్వపరంగానే అధికార భాషాబిల్లు పెట్టి చట్టమయ్యాక అధికార భాషగా తెలుగు అమలుకు అధికార భాషాసంఘం పెడదామన్నారు. నాటి వారి ఆలోచనల ఫలితమే అధికార భాషాసంఘం ఏర్పాటుకు దారి తీసింది. ఇలా అవడానికి మూడు నాల్గు ఏళ్ళు పట్టింది.

***ప్రశ్న : మీరు అధికార భాషాసంఘానికి అధ్యక్షులుగా అయిన నాటి పరిస్థితి ఏమిటి? అధ్యక్షులుగా నియమించడానికి ఏమైనా నిర్దిష్ట ప్రమాణాలంటూ వున్నాయాండీ?***

**ఎబికె :** నేను అధ్యక్షులయినప్పటికి కార్యాలయ పరిస్థితి దయనీయంగా వుంది. సంబంధితమైన దస్త్రాలు లేవు. పూర్వ పరిస్థితి తెలుసుకొని వ్యవహరించడానికి ప్రభుత్వ ఉత్తర్వుల ఫైళ్ళు లేవు. కాలక్షేప బఠానీలుగా కొందరు ఉద్యోగులున్నారు. వారిలో ఒకరిద్దరు శక్తియుక్తులు కలవాళ్ళూ, పనిమంతులూ వున్నారు. సద్వినియోగ కర్తలు లేరు. అసలు జుట్టు వుంటే కదా కొప్పు అమర్చుకోవడానికి అన్నట్లుండేది. ఎక్కడ నేను పని ప్రారంభించాలో కూడా తెలియని అయోమయ స్థితి వుండేది. చిన్ని కాపురం. అలమరల్లాంటివి ఒకటి రెండు, ఒకటి రెండు ఫైళ్ళు, మూడు నాలుగు నిఘంటువులు వుండేవి. సి.నారాయణరెడ్డి గారు తీసుకొచ్చిన కొన్ని ప్రభుత్వ ఉత్తర్వులు దొరికాయి. కాని వాటి కార్యాచరణకు సంబంధించిన లిఖిత ముద్రిత రూపాలు లేవు.

***ప్రశ్న : అయ్యా! మీరధ్యక్షులయ్యేనాటికి వున్న ఆర్థిక పరిస్థితులు ఎలా వున్నాయి? మీరు వచ్చాక ఆర్థిక పరిస్థితి ఎలా వుంది?***

**ఎబికె :** అధికార భాషా సంఘానికి అప్పట్లో బడ్జెట్టు అంటూ లేదు. సంఘ కార్యక్రమాలు చేయడానికిగాని, ప్రజల్లో అధికారగణంలో ఉత్తేజాన్ని కలిగించడానికి గాని కార్యాచరణ ప్రణాళిక లేదు.

పాలనారంగంలో తెలుగు పరివ్యాప్తికి ఆర్థికాంశాలను గమనించేవారూ లేరు. కేవలం సాధారణ పరిపాలన విభాగం దయాదాక్షిణ్యాలపై మాత్రమే మనుగడ సాగించే పరిస్థితి వుండేది.

వై.యస్.రాజశేఖరరెడ్డి ప్రభుత్వం ఏర్పడ్డాక నన్ను అధికార భాషా సంఘ అధ్యక్షులుగా నియమించారు. నేను చేసిన తొలి పని ఏమిటంటే– భాషాసంఘానికి ఏటా స్పష్టమైన నిధి కేటాయించనిదే ఏ కార్యక్రమాన్ని పరిపూర్ణస్థాయిలో అమలు చేయలేం. అదే ముఖ్యమంత్రికి స్పష్టం చేశాను. అంతకముందు సాధారణ పరిపాలనా శాఖను లక్షో రెండు లక్షలో అడుక్కునే పరిస్థితికి సంఘాన్ని దిగజార్చారు.

నేను అడగగా వై.యస్.ఆర్ ఎటువంటి చర్చలు జరపకుండానే నాటి ఆర్థికమంత్రి రోశయ్య గారితో మాట్లాడి మీరు నిర్ణయించండన్నారు. ప్రతిపాదనలతో రోశయ్యగారి వద్దకు వెళ్ళాను. ఆయన ముఖ్యమంత్రితో మాట్లాడి బడ్జెట్టులో కేటాయింపు చేస్తానన్నారు. కోటి ఎనభై లక్షలుగా ప్రతిపాదన పెట్టాను. బడ్జెట్టు కేటాయింపు జరిగింది. ప్రగతిపథం పట్టాను.

***ప్రశ్న : అధికార భాషా సంఘ అధ్యక్షులుగా మీ కాలంలో మీరు ఎటువంటి పనులు, కార్యక్రమాలు నిర్వర్తించారు?***

**ఎబికె :** కార్యక్రమాలు ఉధృతం చేశాను. ప్రభుత్వం ఇచ్చిన సొమ్ము నుండి ఎంత వ్యయపరచినా ఆయా సందర్భాలలో 10,15 లక్షలు మిగిలిపోతే, మరుసటి సంవత్సరానికి కలిపి సొమ్ము కేటాయింపులు చేసేవారు.

తెలుగు అమలులో ఉద్యోగులకు అవగాహన సదస్సులు ఏర్పాటు చేశాను. 4, 5 సమీప జిల్లాలకు దగ్గర వున్న కేంద్రంలోనే వీటిని నిర్వహించాను. 23 జిల్లాల్లోనూ 12 సార్లు పర్యటించిన ఘనత నా కాలంలోని అధికార సంఘానిదే. అధికార భాషగా తెలుగును అమలు చేయడంలో సదస్సులు బాగా తోడ్పడ్డాయి. పై నుండి క్రింది స్థాయి వరకూ పరీక్షలు పెట్టి నెగ్గిన వారికి నగదు ప్రోత్సాహకాలు, ప్రశంసాపత్రాలు ఇచ్చాం.

సాంస్కృతిక కార్యక్రమాలతో భాషా చైతన్యానికి పాటుపడ్డాం. నివేదికలు, పుస్తకాలు అచ్చువేశాం. ఏమి చేసినా ఎనభై లక్షల బడ్జెట్‌లోనే.

మాతృభాషను అధికారికంగా అమలు చేయడంలో క్షేత్రస్థాయి సభలు, మండలస్థాయి సమావేశాలు తోడ్పడ్డాయి.

***ప్రశ్న : మీ అధ్యక్ష కాలంలో మీ సంఘం వేసిన పుస్తక ప్రచురణలు రాష్ట్రవ్యాప్తంగా సంఘకీర్తిని పెంచినమాట వాస్తవం. వానిని గురించి వివరిస్తారా?***

**ఎబికె :** అధికార భాషా సంఘం తరపున భాషా ప్రయోజనాత్మక గ్రంథాలు వెలువరించాం. ఎస్.సి, ఎస్.టి చట్టాలు, మహిళా హక్కుల చట్టం, పౌరహక్కుల చట్టం, తెలుగు భాషా ప్రాచీనతకు తిరుగులేని ఆనవాళ్ళు, నాణాల మీద ఓ సాధికార గ్రంథం, శాఖా పదకోశాలు....ఇలా వేసిన పుస్తకాలు బహుళార్థ సాధకాలయ్యాయి. ఏ పుస్తకానికీ ధరపెట్టకపోవడం విశేషం. మౌలిక పరిశోధకుల చేత గ్రంథ రచనలు చేయించడం మరో విశేషం.

***ప్రశ్న : మొత్తంమీద మీ కార్యాలయం తెలుగుభాషకు శుభకార్యాలయం అయిందన్నమాట. చాలామంది హేమాహేమీలు అధికార భాషాసంఘ అధ్యక్షులయ్యారు కదా వారి కార్యక్రమ సరళి మీ దృష్టికి ఎలా అనిపించింది?***

**ఎబికె :** భాష విషయంలో ప్రజల్ని సమాయత్తం చేయడంలోనో, లేక మాతృభాషను విద్యాసాంస్కృతిక రంగాల్లో అధికారికంగా అమలు చేయడంలోనో కృషి చేయవలసిన అధికార భాషాసంఘాధ్యక్షులు కొందరు సాహిత్య ప్రదర్శనలకు, స్వీయకవితా పఠనలకు వినియోగించుకున్నారు, తమ పదవుల్ని. పాలకుల లక్ష్యశుద్ధి లేకపోవడం వల్ల కొన్ని పనులు జరగలేదు. ముఖ్యమంత్రి ఎన్టీఆర్ కాలంలో తెలుగుకు ప్రాధాన్యమిచ్చారు. కొన్ని పనులూ చేశారు. తరువాత రాజకీయ సంక్షోభం– తెలుగుదేశం పరిపాలనలో వున్న ఎన్టీఆర్‌కి వున్న భాషాభిమాన లక్ష్యశుద్ధి లేకపోవడం వల్ల కొనసాగింపు ప్రగతి లేకపోయింది. తరువాత కాలంలో కేవలం ఓ విద్యామంత్రికే శ్రద్ధ వుండేది.

***ప్రశ్న : ఆధునిక భాషగా తెలుగు– విద్యారంగంలో అభివృద్ధి కావడంలో మీ సూచనలు ఏమిటి? లోగడ జరిగిందేమిటి?***

**ఎబికె :** భారతదేశంలోనే రెండవ అధికార భాషగా ఉండదగిన స్థాయి తెలుగుది అని జె.బి.ఎస్ హాల్డేన్ చెప్పారు. తూర్పుభాషల్లో తెలుగు ఇటాలియన్ వంటి విశిష్టమైనదని నికోలేయ్ కొంటె చెప్పారు. విదేశీయులు ఎంతో గొప్పగా విశ్లేషించిన తెలుగుభాష పట్ల భాషా సాహిత్య సంస్కృతుల సంబంధంగా అంకితభావంలేని పాలకుల వల్ల జరగవలసినంతగా కార్యాచరణలు లేవు.

తెలుగువారికి అంతర్జాలంలో



ప్రత్యేక స్థానం వుండడానికి–సాఫ్ట్‌వేర్ తయారీకి కేంద్ర విశ్వవిద్యాలయానికి చెందిన ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు శ్రమైక సాధ్యమైన విశేష కృషి చేశారు. అప్పటికే అంతర్జాలంలో హిందీ, తమిళం మొదలైన భాషలు ప్రగతి మార్గంలో వున్నాయి. ఆ వేగాన్ని తెలుగువారు అందిపుచ్చుకోవాలని ఇతర భాషలతో సమానంగా స్థానకల్పన జరగాలనీ గారపాటి వారి తాపత్రయం.

తరతరాలకూ ఉపయోగపడే అంశాలున్నాయి అని నిపుణులు చెప్పి ప్రభుత్వాధినేత దగ్గరకు తీసుకువెడితే, ఇప్పుడెవ్వరికి కావాలయ్యా తెలుగు? ఆంగ్లాన్నే దత్తం చేసుకుంటే సరిపోదూ అన్నారు– అని అంటూ ఆ ఫైళ్ళనే విసిరేశారనే కథనాలున్నాయి. (ఇలా అన్న పెద్దమనిషి ఎవ్వరో సులభంగా పసిగట్టవచ్చని కూడా ఎబికె గారు నర్మగర్భంగా అన్నారు)

***ప్రశ్న : డా॥సామల రమేష్‌బాబు అధ్యక్షతన చలనాత్మక పాత్ర వహిస్తున్న తెలుగు భాషోద్యమ సమాఖ్య వుంది కదా. ఆ సమాఖ్య చాలా నాళ్ళ నుండి తెలుగుభాషకు ప్రత్యేక మంత్రిత్వశాఖ వుండాలని డిమాండ్ చేస్తూ వుంది.***

***తిరుపతిలో ప్రపంచ తెలుగు మహాసభలను బహిష్కరించింది. తెలుగుభాషకు మంత్రిత్వశాఖకై ఉద్యమించింది. ఆ మంత్రిత్వశాఖను ఏర్పాటు చేసి, అధికార భాషా సంఘం స్థానే భాషాభివృద్ధి మండళ్ళను పెట్టమంది. అసలు ఈ మంత్రిత్వశాఖ కావాలనే డిమాండుపై మీ అభిప్రాయాలు ఏమిటో చెబుతారా?***

**ఎబికె :** అలా కోరడంలో ఉద్దేశం మంచిది కాదని నేననడం లేదు. కానీ తెలుగుభాషకు ప్రత్యేక మంత్రిత్వశాఖ అనవసరమని నా నిశ్చితాభిప్రాయం. ప్రజాబంధువులు, భాషాబంధువులు అయిన మంత్రులుంటే ఇది ప్రయోజనకరం గానీ, భాషాంకిత భావంలేని మంత్రులే లభ్యమవుతూన్న సందర్భంలో ఈ డిమాండ్ ప్రయోజన దాయకం కాదు. పెనం వెళ్ళి పొయ్యిలో పడినట్లవకూడదు కదా. ముఖ్యమంత్రిని, కేబినెట్టుని ప్రభావితం చేయగలిగే సమర్థుడైన భాషా మంత్రి వుంటే అది వేరు విషయం. అంతవరకు అధికారభాషా సంఘం ఉనికిని కాపాడుకోవాలి. రాజకీయదృష్టితో కాక భాషా సాహిత్య సంస్కృతుల పట్ల అంకితభావం వున్న శక్తిమంతుడైన వ్యక్తిని అధ్యక్షునిగా నియమించుకుంటే, తగిన బడ్జెట్టు పొందగలిగితే చాలు.

అనుభవజ్ఞులు డా॥ ఎబికె ప్రసాద్ ఈ ముఖాముఖిలో అన్నట్లుగా పాలకవర్గ అధినేతలకు భాషా సాహిత్యాల పట్ల అత్యంత ప్రేమ ఉంటేనే ఏదైనా సాధ్యం. సంపాదకులకి ఈ ముఖాముఖి చేరేటప్పటికి మరో ముఖ్యవార్త. అమరావతీ శిలాఫలకం తెలుగులో లేదనుకొంటుండగానే– మరో అదనపు బాధను ప్రభుత్వ నేతలు బహూకరించారు. వ్యవసాయ, విద్యాలయ విద్యాఫలకాన్ని కూడా పూర్తిగా ఆంగ్లంలోనే వేశారు. తెలుగు లేనే లేదు. తెలుగుతల్లి మనోఫలకంపై ఇది ఒక విచార రేఖ.



–సన్నిధానం నరసింహశర్మ
హైదరాబాదు
చరవాణి : 92920 5553



## కవి సబ్బని లక్ష్మీనారాయణకు సన్మానం

*ప్రముఖ కవి, రచయిత సబ్బని లక్ష్మీనారాయణ (కరీంనగర్) ఉద్యోగ విరమణ సందర్భంగా ఏర్పాటైన సాంస్కృతిక కార్యక్రమాల్లో పలు గ్రంథాలను ఆవిష్కరించారు. సబ్బని లక్ష్మీనారాయణకు సన్మానాన్ని పై చిత్రంలో చూడవచ్చు. వినోద్‌కుమార్ (ఎం.పి), రచయితలు మసన చెన్నప్ప, ద్వానాశాస్త్రి, గుంటూరు సాత్యకిశర్మ, నలిమెల భాస్కర్, ఉమ్మడిశెట్టి రాధేయ ఇంకా అనేకమంది ప్రముఖ కవులు, రచయితలు రాజకీయ నాయకులు, అభిమానులు పాల్గొన్న ఈ కార్యక్రమం శ్రీ సంకేపల్లి నాగేంద్రశర్మ సారథ్యంలో జరిగింది.*

## పుక్కిటి పురాణాలు–కాకమ్మ కథలు

(20వ పుట తరువాయి)

ఇవ్వటం ఉంటుంది. వ్యాసునికి విఘ్నేశ్వరుడు వ్రాయసగాడు అయినాడంటే, అది భారతం గొప్పతనాన్ని–రచనలోని ధారాళతను, ధర్మ విస్తృతిని, వేద తుల్యతను తెలియజెప్పటం.

బుద్ధుడు పుట్టగానే నడిచాడంటే – పాదాల క్రింద పద్మాలు మొలిచాయంటే, ఎవరైనా నమ్ముతారా? దుఃఖరహిత మార్గంలో ప్రయాణాన్ని ఆజన్మతః సాగించాడు అనటాన్ని ఇంతకన్నా అందంగా చెప్పటం ఎట్లా?

అందుకని ఈ కథలు వాస్తవాలు కాదని– ఆ కల్పించిన వారికి తెలుసు. ఈ విన్నవారికి తెలుసు. కానీ వీటివల్లనే ఆ ఘట్టాల గొప్పతనం మనసులో ముద్రపడుతుంది. సారవంతమైన చారిత్రక వాస్తవాలకు, రసవంతమైన హృదయాన్ని అద్దుతాయి ఈ పుక్కిటి పురాణాలు. కొన్నింటి వెనకాల చారిత్రక సత్యాలు కూడా దాగి ఉంటాయి. తారకాసుర సంహారం, పంచారామాల కథా అట్లాంటిదేనని నాకు తోస్తుంది. అది ఆంధ్రదేశ ప్రారంభ దశలో జాతుల సమ్మేళనానికి సంబంధించిన ఇతివృత్తమని కాదనిపిస్తుంది. ఇవన్నీ వెలికి తీయ దగినవి. రసవచ్చరిత్రకు కథా రూపాలు. కాకమ్మ కథలని నిరసించ దగదు. ఇట్లాంటి కథలను సంగ్రహంగానైనా సరే 'అమ్మనుడి'లో 'కాకమ్మ కథల ఒడి'గా ప్రవేశిస్తే రంజకంగా ఉంటుంది.

రచయిత విశ్రాంత అధ్యాపకులు,
విమర్శకులు–ఫోన్ : 98664 02973

పిట్ట చూపు

–చలసాని నరేంద్ర

# తెలుగు రాష్ట్రాలలో దిక్కుతోచని రైతాంగం... వ్యవసాయం కుదేలు!

అధికారం లోకి వచ్చిన 18 నెలల తరువాత చివరకు రాష్ట్రంలో గల 443 మండలాల్లో 231 గ్రామీణ మండలాలను కరువు మండలాలుగా తెలంగాణ ప్రభుత్వం ప్రకటించింది. అయితే ఈ అంశాన్ని రాష్ట్ర ప్రభుత్వం అకస్మాత్తుగా గుర్తించలేదు. కరువు వంటి పరిస్థితులు మహబూబ్‌నగర్, మెదక్, నిజామాబాద్, కరీంనగర్, రంగారెడ్డి జిల్లాల్లో నెలకొన్నాయని–నల్గొండ, వరంగల్, ఆదిలాబాద్ జిల్లాల్లో పాక్షికంగా అటువంటి పరిస్థితులు ఉన్నాయని వ్యవసాయ అధికారులకు తెలుసు. వర్షాధారిత ప్రాంతాలలో సగం మేరకు పంటలు తీవ్రంగా నష్టపోయాయి. రైతులకు సాగుపై పెట్టిన పెట్టుబడులు సైతం గిట్టుబాటు అయ్యే పరిస్థితులు లేవు.

అయినా ఈ విషయంపై ఒక నిర్ణయం తీసుకోవడానికి ముఖ్యమంత్రి కె.చంద్రశేఖరరావుకి రెండు నెలల సమయం పట్టింది. సుమారు నెలరోజులపాటు అధికారులు ఆయనకు ఎప్పుడు తీరిక చిక్కుతుందా అని ఎదురు చూస్తూ ఉన్నారు. ఆయనకు తీరిక చిక్కకనే గత సంవత్సరం అసలు కరువు మండలాల ప్రకటన జరగనే లేదు. కొత్త రాష్ట్రం ఏర్పడిన తరువాత తెలంగాణలో 1500 మందికి పైగా రైతులు ఆత్మహత్యలు చేసుకున్నట్లు పలు అధ్యయనాలు తెలుపుతున్నాయి. అయితే ప్రభుత్వం 350 మందికి మించి చేసుకోలేదని అంటున్నది. అందుకు కారణం లేకపోలేదు. ఆత్మహత్యలకు పాల్పడుతున్న రైతుల్లో మూడొంతుల మందికి పైగా కౌలు రైతులు. వారికి ఎటువంటి సాధికారికత ఉండకపోవడంతో ప్రభుత్వపు సహాయానికి వారి కుటుంబాలు అర్హత పొందలేక పోతున్నాయి.

జాతీయ క్రైమ్ రికార్డు బ్యూరో నివేదిక ప్రకారం 2014లో తెలంగాణలో 898మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. దేశంలోనే అత్యధికంగా 2,568 మంది మహారాష్ట్రలో ఆత్మహత్యలకు పాల్పడితే, ఆ తరువాతి స్థానం తెలంగాణకు దక్కింది. ఆత్మహత్యలకు పాల్పడిన రైతు కుటుంబాలకు రెండు తెలుగు ప్రభుత్వాలు పోటీపడి పరిహారం ప్రకటించాయి. ముందుగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి రు.5 లక్షల పరిహారం ప్రకటిస్తే, తెలంగాణ ముఖ్యమంత్రి రు.6 లక్షలు ప్రకటించారు.

అయితే పంట నష్టపోవడంతో దిక్కుతోచని స్థితిలో ఉన్న రైతులను ఆత్మహత్యలకు పాల్పడకుండా ఆదుకోవడానికి మాత్రం ప్రభుత్వాలు ఉదారంగా ముందుకు రావడం లేదు. వర్షాధారిత ప్రాంతాల్లో కేంద్రం ఆమోదించిన గరిష్ట పరిహారం ఎకరాకు రు.2,700 మాత్రమే. ఈ మొత్తం ఎందుకూ సరిపోదని అందరికీ తెలుసు.

చంద్రబాబు నాయుడు 2004లో అధికారం కోల్పోవడానికి ప్రధాన కారణం రైతాంగం. ఆయన పాలనపట్ల తీవ్ర అసంతృప్తితో ఉండటమే అని అందరికీ తెలుసు. అందుచేత ఈ పర్యాయం ఎన్నికల సమయంలో తాను తిరిగి అధికారంలోకి వస్తే వ్యవసాయం గిట్టుబాటు అయ్యేవిధంగా, లాభదాయకంగా మారే విధంగా చేస్తానని హామీ ఇచ్చారు. అయితే ఆయన ప్రభుత్వం ఆ దిశలో నిర్దుష్టమైన చర్యలు ఏవీ తీసుకోవడం లేదని స్పష్టం అవుతున్నది.

వందేళ్ళకు పైగా ధాన్యాగారంగా పేరొందిన కృష్ణా డెల్టాలో తొలిసారిగా ఈ సంవత్సరం ఖరీఫ్ కాలంలో అక్కడక్కడ మినహా వ్యవసాయం పనులు జరగడం లేదు. పొలాలు బీడువారిపోతూ ఉండటం చూస్తున్నాం. ఒక వర్షం పడితే గాని వేసిన పంటలు సైతం బతికే వీలు కనిపించడం లేదు. మొదటగా నాగార్జున సాగర్ నుండి కేవలం త్రాగునీటి అవసరాలకు మాత్రమే నీటిని వదిలారు. సాగునీరు లేదని చేతులెత్తేశారు.

మెట్ట ప్రాంతాల్లో బోర్లు వేసుకొని పొలాలు తడి చేసుకోవడం ఆనవాయితీ.అట్లాగే కాలువల్లో, బావుల్లో అడుగంటిన నీటిని మోటార్ పంపులు వేసుకొని పొలాల్లోకి నీటిని తోడుకుంటూ ఉంటారు. కానీ మొదటిసారిగా ఈ సంవత్సరం కృష్ణాడెల్టాలో నీటికోసం మోటార్లు వేసుకొని నీరు తోడుకోవడం చూస్తున్నాం.

ఈ పరిస్థితులు రెండు తెలుగు రాష్ట్రాల్లో తీవ్ర సంక్షోభానికి చేరుకున్న వ్యవసాయ రంగ పరిస్థితులకు అద్దం పడుతున్నాయి. ఒకవంక సాగునీటి సమస్య, మరోవంక వ్యవసాయ పనులకు కూలీలు దొరకటం లేదని రైతులు ఆందోళన చెందుతున్నారు. అందుకు ప్రధానంగా రెండు కారణాలు ఉన్నాయి. మొదటగా గ్రామీణ ఉపాధి హామీపథకం కారణంగా కూలీల కొరత ఏర్పడుతుండగా, నేటి యువత పొలం పనుల పట్ల ఆసక్తి చూపడం లేదు. కూలీల పిల్లలు కూలి పనులకు రావడానికి విముఖంగా ఉంటున్నారు. సమీపంలోని పట్టణ ప్రాంతాలకు వెళ్ళి ఆటోలు నడుపుకుంటూనో, పండ్లు– కూరగాయలు అమ్ముకుంటూనో, అపార్ట్‌మెంట్‌ల వద్ద వాచ్‌మెన్‌గా పని చేయడానికో ఇష్టపడుతున్నారు.

దానితో కూలీలకు వేతనం పలు రెట్లు పెంచవలసి వస్తున్నది. ముఖ్యంగా గ్రామీణ రంగంలో వ్యవసాయేతర ఆదాయాలు గత రెండు దశాబ్దాలుగా పెరగక పోవడంతో వ్యవసాయం గిట్టుబాటు కావడం లేదు. అందుకనే రైతుల ఆత్మహత్యలు పెరిగిపోతున్నాయి. సంపన్నుల పంట అని చెప్పుకొనే పొగాకు రైతులు ముగ్గురు ప్రకాశం జిల్లాలో ఆత్మహత్యకు పాల్పడటం నేడు నెలకొన్న సంక్షోభాన్ని వెల్లడి చేస్తున్నది.

ప్రకృతి వైపరీత్యాల సమయంలో ప్రభుత్వ సహాయం, పంటల భీమా, ఇతర సదుపాయాలు అందటం లేదు. పైగా పొలం పనులు




తప్ప ఇతర వ్యాపకాలు చేపట్టే సామర్థ్యం వారికి ఉండటం లేదు. ఇతర వృత్తులకు అవసరమైన నైపుణ్యతను రైతులు పొందలేక పోతున్నారు.

ప్రస్తుత రీతిలోనే గ్రామీణ ఉపాధి హామీ పథకం కొనసాగిస్తే తెలుగు రాష్ట్రాలలో వ్యవసాయం యాంత్రీకరణ కావడం మినహా గత్యంతరం ఉండబోదని నిపుణులు హెచ్చరిస్తున్నారు. ఇప్పటికే పలు పంటలకు పూర్తి యాంత్రీకరణ సదుపాయాలు అందుబాటులో ఉన్నాయి. కూలీలకు గిట్టుబాటు వేతనాలు ఇవ్వడం సమంజసమే. కానీ ఈ విధానం వ్యవసాయం కుప్పకూలిపోవడానికి దారితీస్తే, ప్రభుత్వం అకస్మాత్తుగా ఉపాధి హామీ పథకాన్ని విరమించుకొంటే అనూహ్యమైన విషమ పరిస్థితులకు దారి తీసే ప్రమాదం ఉంది.

నేడు వ్యవసాయ రంగం ఎదుర్కొంటున్న సంక్షోభానికి ప్రధాన కారణం ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరిగిపోవడం. సాంప్రదాయ వ్యవసాయ పద్ధతులకు స్వస్తి పలికి, రైతులే విత్తనాలు తయారు చేసుకొనే అలవాట్లను వదిలివేసి విత్తనాల కంపెనీలపై ఆధారపడటం, అనవసరంగా ఎరువులు వాడుతూ ఉండటం, హైబ్రిడ్ విత్తనాలకు అలవాటు పడటంతో ఉత్పత్తి ఖర్చులు విపరీతంగా పెరుగుతున్నాయి. పంట నష్టపోతే రైతులు కోలుకోలేకపోతున్నారు.

ఉత్పత్తి ఖర్చులు పెరగడంతో అప్పులకోసం రైతులు నానా యాతన పడుతున్నారు. బ్యాంక్‌లు, సహకార సంఘాల నుండి కౌలు రైతులకు రుణాలు ఇవ్వడం లేదు. ఇతర రైతులకు సహితం సకాలంలో రుణాలు అవసరం మేరకు లభించడం లేదు. దానితో వారంతా అత్యధిక వడ్డీలతో ప్రైవేటు వ్యక్తులను అప్పుల కోసం ఆశ్రయించక తప్పడం లేదు. ఆత్మహత్యలకు పాల్పడుతున్న రైతులలో అత్యధికులు ప్రైవేటు వ్యక్తుల నుండి రుణాలు తీసుకున్నవారే కావడం గమనార్హం.

ఇక విత్తనాల అమ్మకంలో కార్పొరేట్ కంపెనీలు రంగ ప్రవేశం చేసి వాటి ధరలను విపరీతంగా పెంచి వేశాయి. విత్తనాల నాణ్యతపై నియంత్రణ ఏమాత్రం ఉండటం లేదు. వేసిన విత్తనాలు పనిచేయక పంటలు నష్టపోయి ఆత్మహత్యకు పాల్పడుతున్న రైతులు కూడా ఉంటున్నారు. ఈ కంపెనీలను కట్టడి చేసే ప్రయత్నం జరగటం లేదు.

వ్యవసాయ రంగంలో ఏర్పడిన సంక్షోభం కారణంగానే తెలుగు రాష్ట్రాలలో కుటుంబాల ఆదాయం జాతీయ సగటు కన్నానే కాకుండా పలు వెనుకబడిన రాష్ట్రాలకన్నా తక్కువగా ఉంటున్నది. వ్యవసాయ రంగంలో ఏర్పడిన సంక్షోభమే అందుకు కారణం. పైగా పలు గ్రామాలలో రైతుల జీవన ప్రమాణాలు కూలీల కన్నా తక్కువగా ఉంటున్నాయి.

గ్రామీణ ఉపాధి హామీ పథకం క్రింద ఒక్కొక్క కుటుంబానికి సంవత్సరంలో కనీసం 150 రోజుల పని ఇవ్వవలసి ఉండగా ఆంధ్ర ప్రదేశ్‌లో గత సంవత్సరం సగటున 62 దినాలు మాత్రమే సమకూర్చారు. ఈ సంవత్సరం ఈ సంఖ్య 45 రోజులకు తగ్గిపోతున్నది. అయినా వ్యవసాయ రంగంలో కూలీల కొరత ఎదురవడం విస్మయం కలిగిస్తున్నది. రుణ బాధలతో అత్యధికంగా ఆత్మహత్యలు రైతులలో వింటున్నాము గానీ కూలీలలో లేకపోవడం గమనార్హం.

గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ప్రైవేటు, ప్రభుత్వ పెట్టుబడులు 25 సంవత్సరాలుగా ఆగిపోవడమే నేటి ఉపద్రవానికి ప్రధాన కారణం. ఉపాధి హామీపథకం కోసం పెడుతున్న భారీ వ్యయాన్ని గ్రామీణ ఆర్థికవ్యవస్థలో పెట్టి ఉంటే మొత్తం గ్రామీణ వ్యవస్థ వికాసం చెంది ఉండేది. వ్యవసాయం, గ్రామీణరంగాలు సుసంపన్నం అయి ఉండేవి.

ఈ సమస్య పరిష్కారం కోసం ఉపాధిహామీ పథకాన్ని వ్యవసాయంతో అనుసంధానం చేయడమే పరిష్కార మార్గంగా పలువురు భావిస్తున్నారు. గ్రామ పంచాయితిని నోడల్ ఏజెన్సీగా నియమించి పని అవసరం ఉన్న కూలీలు అందరూ పంచాయితీ వద్ద పేర్లు నమోదు చేసుకోవాలి. అట్లాగే కూలీలు అవసరం ఉన్న రైతులు తమ పేర్లను నమోదు చేసుకొంటారు. ప్రభుత్వం నిర్ణయించిన ధరలకు రైతులకు కూలీలను పంచాయితీ సరఫరా చేస్తుంది. ఇంకా పని కోసం కూలీలు ఎదురు చూస్తూ ఉంటే వారితో ఇతర పనులను చేయించవచ్చు. అందుకనే గ్రామీణ ఉపాధి హామీ పథకాన్ని సమీక్షించవలసిన అవసరం ఉంది.

రాష్ట్ర విభజన తరువాత తమది వ్యవసాయ ప్రధాన రాష్ట్రం అని, వ్యవసాయ ఆదాయమే తమకు కీలకం అని చంద్రబాబు నాయుడు చెప్పారు. అయితే నేడు వ్యవసాయ ఆదాయం గణనీయంగా పడిపోతున్న రాష్ట్రాలలో ఈ రాష్ట్రం చేరుతున్నదని ఆయన గమనించాలి. అసలు **ఆత్మహత్యలు ఆగకుండా ఎందుకు జరుగుతున్నాయో, అందుకు దారితీస్తున్న కారణాలు ఏమిటో, వాటిని నిలుపుదల చేయడానికి తీసుకోవలసిన చర్యలు ఏమిటో తెలుసుకోవడం కోసం ఒక నిపుణుల కమిటీనో, కనీసం మంత్రివర్గ ఉప సంఘాన్నో నియమించే ఆలోచనే రెండు రాష్ట్ర ప్రభుత్వాలకూ లేదు.**

**రెండు తెలుగురాష్ట్రాల ప్రభుత్వాలు విదేశీ పారిశ్రామిక వేత్తలను, పెట్టుబడుదారులను ఆకట్టుకోవడం కోసం పడుతున్న పాట్లలో పదవ వంతు అయినా వ్యవసాయ రంగంలో నెలకొన్న దుర్భర పరిస్థితులను చక్కబెట్టడం కోసం పడటం లేదు. మాటలకు మినహా వ్యవసాయం వీరి ప్రాధాన్యత అంశాలలో ఒకటిగా ఉండటం లేదు. ఇది దురదృష్ట పరిస్థితి.**

–రచయిత ఫోను : 98495 69050

"పాము పడగపై పొదిగినట్టి ఆ పాదముద్రలు ఎవరివో....

పాడే కోయిల పాటలోన ఆపాత మధురిమ ఎక్కడిదో...

వెదురుముక్కలో దాగి ఉన్న ఆ వేల రాగములు ఎవరివో..

నెమలి పింఛమును అద్దుకొన్న హరివిల్లు రంగులు ఎక్కడివో..

పంచభూతములు కన్న వింతలు... ప్రకృతి తత్వము పాడవే మనసా..." అంటూ ప్రారంభోత్సవ వేదిక మీద కవి అందెశ్రీ గళంలో చిందులు వేసిన ఆ ప్రకృతి తత్వం అలలు అలలుగా సాగి, ఈ ఏడాది బాలోత్సవ్‌కు చేరిన వేలాది మంది మనస్సులను స్పృశించింది.

పరిశీలించడం. ప్రశ్నించడం సృష్టించడం ఇదేగా మానవప్రకృతి.

ప్రకృతిలో పుట్టి, ప్రకృతిలో పెరిగి, ప్రకృతిలోనే మమేకమవ్వడమేగా మానవ ధర్మం.

ఆకాశంలో వెన్నెల వెలుగులు చూస్తూ ఆటలు ఆడాం...పాటలు పాడాం. అక్కడొక ముసలమ్మను కూర్చుండ బెట్టాం. ఆమెకొక రాట్నాన్ని ఇచ్చాం. ఆమెకు ఒక పెంపుడు కుందేలు పిల్లను ఇచ్చాం. ఆమె పోసే అట్టుల రుచిమరిగాం'. ఇక, కుందేలుతో కలిసి ఆడు కోవడానికి, రాట్నం వడికే ముసలమ్మ పోసే అట్లు తిన డానికి, ఒక రాకెట్టును తయారుచేసి, దానిలో ఎక్కి ఝామ్మంటూ మేఘాలను దాటుకొని, శూన్యాల్లో సాగి, పాలపుంతలు మెరుస్తుండగా ఆ చందమామ మీద కాలూనాం.

ఇదంతా ఒక కలలా కథలా అనిపించినా ఎప్పుడు తలుచుకొన్నా ఎంత విస్మయాన్ని కలిగిస్తుందో. వళ్ళు గగుర్పొడుస్తుంది. కూడాను.

ప్రకృతిని దగ్గరగా పరిశీలిస్తూ, ప్రకృతిపై మమ కారాన్ని పెంచుకొంటూ, ప్రకృతి కోపతాపాలకు తల్లడిల్ల కుండా ఎదురొడ్డి నిలిచి పోరాడుతూ. సాగిన ఆలోచనకు తోడయిన సృజనతోనే మనిషి మనిషయ్యాడు.

ప్రకృతిలో మనం ఒక అంతర్భాగం అన్న ఒక మౌలికా సత్యాన్ని ఎప్పుడో మనకు తెలియకుండానే మరిచిపోయాం.

ఇవ్వాళ, అక్షరాలు నేర్పే నెపాన మనలోని ఆ సహజాత ప్రకృతి తత్వాన్ని తరగతి గదుల చట్రంలో బిగించేసాం. చెప్పిందే పాఠం. నేర్పిందే చదువు. వచ్చిందే ఫలితం అన్న ఉచ్చులో చిక్కుకొని మానవ సహజతత్వం ఊపిరాడక ఉక్కిరి బిక్కిరి అవుతుంది.

పోటీల ఉరి బిగిసి, ప్రతి ఏడాదీ వందల కొద్దీ పసివాడని తెలుగు విద్యార్థులు బలవన్మరణాన్ని ఆశ్రయి స్తున్నారు. ఎంత ఘోరం! ఎంత సిగ్గుచేటు! ఇది మానవ ప్రకృతికే విరుద్ధం.

# పిల్లల పండుగ..ఒక క
# కొత్తగూడెంలొ



ఈ నేపథ్యంలో, ముద్దుమాటల మూడేళ్ళ బిడ్డనుండీ పదునైన తెలివిడి గల పదిహేనేళ్ళ పిల్లలవరకు, దాదాపు ఇరవై వేల మంది తెలుగు పిల్లలు, వారి అమ్మానాన్నలు, ఉపాధ్యాయులు దేశం నలుమూలల నుండీ ఒక్కచోట చేరి, మూడురోజుల పాటు పిల్లలపండుగను నవ్వుతూ తుళ్ళుతూ జరుపుకున్నారంటే, అది ఖచ్చితంగా కొత్తగూడెం బాలోత్సవ్ మాత్రమే!

బిడ్డలు ప్రకృతి సహజంగా అందిపుచ్చుకొని, వారితో ఎదిగే ఆట, పాట మాటలకు పట్టాభిషేకం జరుగుతుందక్కడ. పిల్లలు, ప్రశ్న, సృజన, తెలుగు, సంస్కృతి, భారతీయత... ఇవీ బాలోత్సవ్ బీజాక్షరాలు.

ఆలోచన పదునెక్కాలి. స్వీయశోధన జరగాలి. ప్రకృతితత్వాన్ని గ్రహించాలి. సృజనశీలురుగా ఎదగాలి. ఆశావాద దృక్పథంతో ధైర్యవంతులుగా నిలబడాలి. తెలుగుతనాన్ని పదిలపరుచుకోవాలి భారతీయతను గౌరవించాలి. ఇవీ కార్యక్రమం ఆసాంతం అక్కడ చేరిన పిల్లలు పెద్దలందరిలోనూ కదలాడే భావాలు. ఎవరికి వారు చేసుకొనే వాగ్దానాలు.

ఇటువంటి అద్భుత వాతావరణం కల్పించిన బాలోత్సవ్, మొదలయ్యింది ఒక రిక్రియేషన్ క్లబ్‌లో. అన్ని ఊళ్ళలోని క్లబ్బుల్లాగానే కొత్తగూడెం క్లబ్ కూడా కొద్దిమంది ఉన్నతవర్గాలకు చెందిన శ్రీరామచంద్రుల కొరకు ఏర్పాటు చేయ బడింది.

డా॥కింగ్, 1871లో, సింగరేణి అనే చిన్న, అడవిపల్లె వద్ద బొగ్గు నిక్షేపాలను గుర్తించి, తవ్వకాలు ప్రారంభించే నాటికి కొత్తగూడెం గనులలో ఉద్యోగులకు, కార్మికులకు నివాసస్థలమయింది. అప్పటి వరకు దట్టమైన అడవులతో, కొండలతో కోనలతో సీతారాముల దర్శనార్థం వచ్చే భక్తులు కాలిబాటలు, పడవప్రయాణాలతో పాటు ఒక సులువైన కొత్తమార్గం కొత్తగూడెం నుంచి ఏర్పడింది. ఇలా ఆధు నికతకు, ఆధ్యాత్మికతకు కొత్తగూడెం కూడలిగా ఎదుగుతూ వచ్చింది. ప్రాణహిత, గోదావరి నదుల నడుమనున్న లోయలో దక్షిణ భారతంలోనే ఒక ప్రముఖ పారిశ్రామిక కేంద్రంగా రూపొందింది.

## కలలా...ఒక కథలా...
# ...లో బాలోత్సవ్



**–చంద్రలత**

కొత్తగూడెంలో 24 బంగ్లాలు, రైటర్ బస్తీ, కూలీ పేటలతో పాటు క్లబ్ కూడా ఉన్నది.

అజారుద్దీన్, శివలాల్ యాదవ్, అరుణ్ లాల్ వంటి క్రీడాకారులకు రంజీ ట్రోఫీలకు ఆతిథ్యం ఇచ్చిన అన్ని వసతులు గల క్రీడామైదానాలు ఇక్కడ ఉన్నాయి. సింగరేణి కాలరీస్‌తో పాటు అక్కడ స్థాపించబడిన పరస్పరాధారిత పరిశ్రమలలో ఉద్యోగులుగా దేశ వ్యాప్తంగా ఉన్న అనేక మంది వచ్చి నివసించసాగారు.

ఈ వైవిధ్యం నేపథ్యంతో, క్లబ్ అంతకంతకూ ఎదిగి, కేవలం క్రీడలకు వేడుకలకే కాక, విలాసాలకు, వ్యసనాలకు కేంద్ర బిందువు అయ్యింది. పేకాట కుటుంబాలపై చూపుతున్న దుష్ప్రభావం. దానిని నివారించలేని ఒక నిస్సహాయ సందర్భము. ఆ ఏడాది క్లబ్‌కు సెక్రటరీగా ఎంపికయిన డా.వాసిరెడ్డి రమేష్ గారిని ఆలోచనలో పడవేసింది.

సరదా కోసం, కాలక్షేపం కోసం చేస్తున్న పనుల వలన కుటుంబం అంతా బాధపడుతున్నారు. పిల్లలు తల్లులకు ప్రవేశం నిషిద్ధమైన ఈ చోటులో వారికి స్థానం ఇవ్వాలి. వారికి కూడా సంతోషం కలిగించేలా చేయాలి. అప్పుడు రమేశ్ గారు క్లబ్ సభ్యులందరితోనూ తోటి వైద్యులతోనూ తమ ఆలోచనలను పంచుకొన్నారు.

"ఏడాదంతా ఏమి చేస్తారని ఇప్పుడు అడగం. ఏడాదిలో మూడు రోజుల పాటు క్లబ్‌ను కుటుంబాలకు కేటాయించాలి. ఆ సమయంలో క్లబ్ నిత్య వ్యవహారాలన్నీ మానేయాలి. విలాసాల నిర్వహణ ద్వారా క్లబ్ సంపాదించిన మొత్తంలో కొంత ఈ కార్యక్రమం కోసం కేటాయించాలి.

అలా ఇరవైనాలుగేళ్ళ క్రితం, 1991లో, మొదలయింది కొత్తగూడెం బాలోత్సవ్. ఇంతింతయి తానింతయి ఇప్పుడు బాలోత్సవ్ దేశవ్యాప్తమయ్యింది. ఒక్కసారి పిల్లలు తల్లులు అక్కడికి వస్తున్నారు అన్న ఆలోచనతోనే, ఆ క్లబ్ వాతావరణంలో మార్పులు మొదయ్యాయి ఇప్పుడు క్లబ్ ప్రాంగణంలో వేదికలు, ఆడిటోరియం, ప్రత్యేకగదులు నిర్మించబడ్డాయి. ఏడాదిలో మూడురోజుల పిల్లలపండగ ఆ క్లబ్ స్వభావస్వరూపాలను బాగా ప్రభావితం చేసింది.

ఏడాదంతా ఏం చేస్తారని ఇప్పుడు కూడా సభ్యులను అడగక్కరలేదు. వారు వచ్చే ఏడాది ఇంకెంత మెరుగ్గా బాలోత్సవ్ జరపాలా అని ఆలోచిస్తుంటారు.

బాలోత్సవ్‌కు మూలస్థంభమయింది ఈ క్లబ్ కమిటీ. అంతే బలంగా నిలబడింది. ఈ వూరి వైద్యబృందం సింగరేణి కాలరిస్, నవభారత్ ఆగ్రోటెక్ తదితర పరిశ్రమల యాజమాన్యాలు, ఉద్యోగులు బలంగా నిలబడుతున్నారు ఆనాటి నుంచి ఈనాటి వరకు శ్రీమతి ఇందిరా దత్ గారు (కెసిపి లిమిటెడ్) శ్రీ ఏలూరి సాంబశివరావు గారు. (నోవా ఆగ్రిటెక్) అండదండలుగా నిలబడ్డారు. నన్నపనేని మోహన్, డా.వాసిరెడ్డి నవీన్ గార్ల వంటి ప్రవాసాంధ్రులు ఇస్తోన్న సహకారం గురించి ఎంతైనా చెప్పుకోవాలి.

ఇన్ని వేలమంది బాల అతిథులకు వసతి ఏర్పాట్లకు వూరు వూరంతా తలుపులు తెరుస్తుంది. చత్తిస్ ఘడ్, ఒడిశా, గుజరాత్, ఢిల్లీ, తమిళనాడు, కర్నాటక, ఆంధ్ర ప్రదేశ్, తెలంగాణా... ఏం ప్రాంతం వారు అయినా సరే, పిల్లలకు, వారితో వచ్చే పెద్దలకు వసతి ఇవ్వడానికి ఊరిలోని వారెందరో సిద్ధంగా ఉంటారు.

శాఖమూరి శ్రీనివాస్ గారు గత మూడేళ్ళుగా తమ నాన్న మామయ్యల జ్ఞాపకార్థం వచ్చిన అతిథులందరికీ భోజనాలు అందిస్తున్నారు.

ఇక, భోజనాలు వండించి వడ్డించేది సిఎండిలో విశ్రాంత సీనియర్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ పి.మాధవరావు గారు. ఈవెంట్ మేనేజర్, సింగరేణి సివిల్ డిపార్ట్‌మెంట్‌లో ఉన్నతోద్యోగి శ్రీ.ఎ.చంద్రశేఖర్‌గారు. డా.కె.ఎ.సి. శర్మగారు అతిథి సౌకర్యాలతో పాటు, కార్యక్రమాన్ని ప్రణాళికా బద్ధంగా సాగేట్టు చూస్తారు. ఆర్టిసి విశ్రాంత ఉన్నతోద్యోగి, ప్రస్తుత క్లబ్ మేనేజర్ శ్రీ మన్సూర్ గారు కార్యక్రమ నిర్వహణా వ్యవహారాలను చూస్తారు. వీరందరినీ సంధానపరిచింది, ఈ కార్యక్రమానికి ఆలోచన, ఆయువుపట్టు డా.వాసిరెడ్డి రమేష్ గారు.

ఇన్నేళ్ళపాటు ఇంతమందినీ ఒక్క చోట చేర్చించింది, ఒక్క మాట మీద నడిపించినదీ ఏమిటని, ఎవరిని అడిగినా ఒకటే సమాధానం వస్తుంది. పిల్లల ముఖాల్లో తొణికిసిసలాడే ఆనందం.

బాలోత్సవ్ గురించి దూరంగా చూసే వారెవరికైనా ఒక వైపు విద్యావ్యవస్థలో పెచ్చరిల్లుతోన్న పోటీతత్వాన్ని నిరసిస్తూ, దానికి విరుగుడుగా మరిన్ని పోటీలా" అని అనిపించవచ్చు. నిజమే మరి, పోటీకి పోటీ సమాధానం కాదు కదా. ప్రతి వూళ్ళోనూ వారి శాయశక్తులా పిల్లలకు సాంస్కృతికాంశాలలో పోటీలు పెట్టి బహుమతులు



ఇస్తూనే ఉంటారు. ఇక, మాధ్యమాల్లో పెరిగిన రియాలిటీ షోలు పెట్టే పోటీలు, పిల్లల్లో అవి కలిగించే వత్తిడి గురించి, ఈ కార్యక్రమాలను పిల్లలగురించి ఆలోచించే వాళ్ళంతా తీవ్రంగా ఖండించడం.... అందరికీ తెలుసు.

మరి, బాలోత్సవ్ ప్రత్యేకంగా ఏమి చేస్తుంది? ఇంతటి ప్రాధాన్యత, ప్రాముఖ్యత, ప్రాచుర్యము ఎందుకు వచ్చాయి?

"పూను స్పర్ధలు విద్యలందే" అన్న గురజాడ వాక్యం స్ఫూర్తితో, ఇక్కడ జరిపే కార్యక్రమాన్ని భిన్న అంశాలలో పోటీలు అని అనరు- స్పర్ధలు అంటారు. కూచిపూడి, భరత నాట్యం, పేరిణి, ఆంధ్ర నాట్యం ఒక పక్క పల్లె పాటల హోరుతో జరిగే జానపద నృత్యాలు... మరొక పక్క, శాస్త్రీయ సంగీతం, లలిత సంగీతం గాత్ర వాయిద్యాలు... ఒక వైపు ఏకపాత్రాభినయం, నాటకం, ఫ్యాన్సీడ్రెస్ వంటివి... మరోచోట. వర్ణరంజిత చిత్ర లేఖనం సర్వదా ప్రియం ఉపన్యాసాలు, చర్చలు కలిగించే ఉత్తేజం గురించి చెప్పక్కరలేదు.

తెలుగు సాహిత్యానికి బాలోత్సవ్ పెద్ద పీట వేస్తుంది. కథ, కవిత, నాటక విశ్లేషణలు.. కథ, లేఖ, కవితా రచనలు ఒక పక్క జరుగుతుంటే, తెలుగు పద్యం, ఆధునిక కవిత్వ పఠనం, తెలుగులో మాట్లాడడం వంటివి మరో పక్క జరుగుతుంటాయి. "అనగా అనగా కథ చెపుతా వింటారా! అంటూ పిల్లలు తెలుగులో చెప్పే కథలు వినాల్సిందే.

ఆధునిక విద్యార్థికి ఎంతో ఉపకరించే, "క్విజ్" ప్రతిష్ఠాత్మకంగా సాగుతుంది. ఈ ఏడాది ప్రవేశ పెట్టేన "స్పెల్ బీ" కూడా అంతటి ఆదరణ పొందింది.

ఇక, అన్ని కళలనూ మూటకట్టుకొన్న చిన్న సినిమా ప్రదర్శన, ఆపై చిన్న సినిమా విశ్లేషణా జరుగుతాయి.

శిల్పకళకే మూలమనదగ్గ మట్టి బొమ్మలు చేయడం అన్నది పిల్లలకు ఎంతో నచ్చిన అంశం. వ్యర్థంతో అర్థం... అన్న శీర్షికన పాల్గొనే పిల్లలు తెస్తోన్న కొత్త కొత్త ఆలోచనలను చూస్తుంటే, పల్లె మూలాల్లోంచి పట్టణజీవనం లోంచి స్ఫూర్తి పొందిన బాల శాస్త్రజ్ఞులు అంటే వీరే కదా అనిపిస్తుంది. పారంపరికంగా పాటిస్తోన్న కిటుకులను అడవిబిడ్డలు, పల్లెపిల్లలు తీసుకువస్తే, శాస్త్రం నేర్పిన మెలకువలను పట్నం పిల్లలు తీసుకు వస్తారు.

పైన ప్రస్తావించిన అనేక అంశాలలో ఒక్కో దానిలో వందలాది మంది పిల్లలు పాల్గొంటారు. వారితో పాటు వాళ్ళ ఉపాధ్యాయులు అమ్మానాన్నలు వస్తారు. వీరందరితోనూ, ఆయా రంగాలలో ప్రముఖులు, అనుభవజ్ఞులు అయిన వ్యక్తుల్లో అధ్యయన తరగతులు నిర్వహించ బడతాయి. తమ తమ అనుభవాలను పంచుకొంటూ, ఆ రంగంలో పెంపొందించుకోవాల్సిన మెలకువలను ఆ విశిష్ట అతిథులు వివరంగా చెపుతారు. పిల్లల అభిప్రాయాలను తెలుసుకొంటారు. సందేహాలు తీరుస్తారు. కొత్త విషయాలను పరిచయం చేస్తారు.

ఈ అధ్యయన తరగతుల చేతనే, అటు పిల్లలు ఇటు పెద్దలు, బాలోత్సవ్ లో పోటీలను పోటీలుగా భావించరు. కొత్త విష



యాలను నేర్చుకొనే వేదికగా భావిస్తారు.

మట్టితో బొమ్మలు చేస్తుండగా, కుమ్మరి సారె గిరగిర తిరుగుతూ పిల్లలు సాంప్రదాయ కుమ్మరిచక్రం మీద కుండలు, ప్రమిదలు గిన్నెలు, హుండీలు చేయడం నేర్చుకొంటారు. మన్ను అంటకుండా పిల్లలను పెంచే ఆధునిక సంస్కృతిలో, మట్టిలో మట్టై అద్భుతాలు సృష్టించే కుమ్మరి వృత్తి పట్ల పిల్లలకు ఇష్టాన్ని, గౌరవాన్ని కలిగించడం చూస్తుంటే సంతోషం కలుగుతుంది. అంతరిస్తోన్న కులవృత్తుల నేపథ్యంలో, కుమ్మరి వారిని ప్రత్యక్షంగా కలవడం చేత పిల్లలకు, వారి స్థితిగతుల పట్ల ఒక అవగాహన కలుగుతుంది.

మునుపెన్నడూ చూడని సినిమా, వినని పాట, తెలియని మాట, వేయని అడుగు... ఇలా ఎంత నేర్చుకొన్నా తనివి తీరని





సందర్భం, సాంప్రదాయం అక్కడ ఏర్పడింది.

బాలోత్సవ్ గడపలో నుంచి పిల్లలు నడిచే ప్రతిచోటా, శాస్త్రీయ దృక్పథాన్ని పెంపొందించే ఆలోచనలను ప్రదర్శిస్తారు. అక్కడి ప్రాంతాల్లో ప్రబలిన మూఢ నమ్మకాలను, చేతబడి, బాణామతి వంటి అవాంఛనీయమైన సాంప్రదాయాలను ఎండ కడుతూనే, లింగవివక్ష, పర్యావరణం, అక్షరాస్యత వంటి అనేక అంశాలను, ర్యాగింగ్, వ్యసనాలు, నిర్భయ వంటి అనేక ఆధునిక జాడ్యాలకు మూలలను చూపిస్తూ నమూనా ప్రదర్శనలు ఏర్పాటు చేస్తారు. ఏ ఏడు కాఏడు ఆయా సందర్భాలను బట్టి, సమకాలీన సమస్యలపై ప్రగతిశీల ధోరణిని ప్రతిఫలిస్తూ, బాలోత్సవ్ తన దృక్పథాన్ని చాటుతుంది.

అందుకే, పిల్లలు ఏ పోటీలో ఎవరు గెలిచారు అన్న అంశం అప్రధానం అవుతుంది. ఏ బిడ్డలో ఏ కొత్త ఆలోచన ఉందో, ఏ కొత్త కళ వుందో చూద్దాం అన్న ఆలోచనే అందరిలోనూ. అంధులు, వికలాంగులు,







గిరిజనులు, పల్లెపిల్లలు, పట్టణవాసులు, నగరజీవులు, ఎవరైనా బాలోత్సవ్‌లో పిల్లలే.

బరంపురం, సుకుమ, గాంధీనగర్, కోయంబత్తూరు, మంగళూరు, చెన్నపట్నం, జనకపురి, కరోల్‌బాగ్, మదనపల్లి, మణుగూరు, పాలమూరు, మార్కాపురం, తెనాలి, శ్రీకాకుళం, ఆదిలాబాదు, వరంగల్ ... పూరేదయినా ఎల్లలు ఎరుగని తెలుగు భాష ఇక్కడ గిరికీలు కొడుతుంది. ఈమారు విశిష్ట అతిథి సం.వెం. రమేశ్ గారు చెప్పినట్లు, ఎల్లలు ఎరుగని తెలుగులోని వైవిధ్యాన్ని మనం గుర్తించి ప్రతి తెలుగు మాట పట్లా మమకారం పెంచుకొంటూ, ప్రతి పలుకునూ పదిలం చేసుకొంటేనే, మన తెలుగుకు మనుగడ.

డా.వాసిరెడ్డి రమేష్ గారు అంటారు కదా, "స్పర్థలు, ఫలితాలు అమ్మానాన్నలకు, ఉపాధ్యాయులకు, అనుభవం, ఆనందం పిల్లలకు అని.

బాలోత్సవ్ కరదీపికను బాలోత్సవ్‌కు రెండుమూడు నెలల ముందు విడుదల చేస్తారు. ఆ సంధర్భంగా, అమ్మనాన్నలకు, ఉపాధ్యాయులకు పిల్లలతో పెద్దల వ్యవహార శైలి పట్ల, సమకాలీన సమాజంలో పిల్లల విషయాల్లో పెద్దల పాత్ర పట్ల భిన్న రంగాల్లోని నిపుణులతో సమావేశం నిర్వహిస్తారు.

పిల్లలెంత సంబరంగా ఒకరి నుంచి ఒకరు నేర్చుకొంటారో, వారితో వచ్చిన పెద్దలు కూడా అంతే ఉత్సాహంగా ఎంతో కొంత నేర్చుకొనే ప్రయత్నం చేస్తారు. గోదావరికి ఎంత కడవ తీసుకెళితే అన్ని నీళ్ళన్నట్లు, ఎవరు ఎంత మేరకు గ్రహించగలిగితే అంత నేర్చుకోవచ్చు.

అది పిల్లలనుంచి, తమ ఇంట ఆతిథ్యం ఇచ్చే ఇల్లాళ్ళ నుంచీ, ఆకలి తెలిసి అడక్కుండానే అన్నం పెట్టే అన్నదాత నుంచీ, టోకెన్లనుంచీ, కార్యక్రమం ఆసాంతం ఎక్కడా ఏ ఇబ్బందులూ రాకుండా కఠిన ప్రణాళికలతో పనిజేసే కార్యవర్గం నుంచీ, 'రాములోరి పెళ్ళికి వూరంతా సందడీ' అంటూ ఆనాటి వ్యవసాయ సంస్కృతిలో ఆచరించిన సమిష్టి భావనలోంచి, గెలుపు ఓటములకు అతీతంగా సాగే కార్యక్రమ వేదికల నుంచీ, వచ్చిన వారందరికీ తిరిగి వెళ్ళాక వారింట ఒక మొక్కను నాటుకొమ్మని ఆప్యాయంగా ఒక వీడ్కోలు కానుకను ఇచ్చే, అతి సామాన్య విశ్రాంత ఉద్యోగి రాయి వెంకటప్ప గారి నుంచీ... ఎంత నేర్చినా తక్కువే!

గిరీశం మాటల్లో చెప్పాలంటే, "బాలోత్సవ్"లో తిరుగాడడమే ఓ ఎడ్యుకేషన్!

మరి, "తెలుగువారే కాదు తీవర పడకున్న" అన్నారు కదా నార్లవారు ఇంతటి కార్యక్రమ నిర్వహణ సున్నితంగా సాగుతోందంటే ఎన్నెన్ని ఒడిదుడుకులను దాటి వచ్చిందో ఎన్నెన్ని సమస్యలను అధిగమించిందో... వాటన్నిటినీ ఎక్కడికక్కడ సమాధాన పరుచుకొంటూ సావధానపరుస్తూ సమర్ధించుకొంటూ ముందుకు నడిపింది డా॥వాసిరెడ్డి రమేష్ గారి సమర్ధత. దానితో పాటు, వారి బృందం యొక్క నిబద్ధత, నిజాయితీ, చేస్తోన్న పని పట్ల మొక్కవోని నమ్మకం.

ఒకరికి ఒకరు ఇచ్చిపుచ్చుకుంటూ ఒకరి నుంచి ఒకరు నేర్చుకొంటూ.. "అబ్బా.. అప్పుడే అయిపోయిందా" అనుకొంటూ ఇంటిముఖం పడతారు. పిల్లలూ పెద్దలూ. మళ్ళీ బాలోత్సవ్ వరకూ స్నేహాలు కొనసాగుతాయి.

బాలోత్సవ్ స్ఫూర్తితో ఒంగోలు, కాకినాడ తదితర ప్రాంతాలలో బాలోత్సవ్‌లు మొదలయ్యాయి. డా.రమేష్ గారు స్వయంగా అక్కడికి వెళ్ళి వారి కార్యక్రమాలకు తమ అనుభవాన్ని జోడిస్తారు. అక్కడి నుంచి ఏమైనా నేర్చుకోవాల్సి ఉన్నదా అని ఆలోచిస్తారు. ఇచ్చి పుచ్చుకొనునదే విద్య అన్న

తీరుగా అణకువగా సాగుతుంది బాలోత్సవ్ నడక, నడవడిక.

ఇవ్వాళ బాలోత్సవ్ పాతికేళ్ళలోకి అడుగు పెట్టింది. వచ్చే ఏడాది 2016, బాలోత్సవ్‌కు సిల్వర్ జూబ్లీ కావడం, డా.రమేష్ గారు డెబ్బై ఏళ్ళవారు కావడం బాలోత్సవ్ అభిమానులందరికీ రెండు పండ గల సంబరం.

పాల్గొనే వారి సంఖ్యకు పరిమితులు పాటించగా ఈ ఏడాది పదహారు వేల పైచిలుకు పిల్లలు వివిధ అంశాలలో పాల్గొ న్నారు. ఆ పరిమితులను ఏ కొద్దిగా సడ లించినా తొలగించినా, పాల్గొనే పిల్లల సంఖ్య కొత్తగూడెం జనాభాని మించుతుందనడంలో సందేహం లేదు. అతిశయోక్తి కాదు.

అందుకే, ఈ ఏడాది ప్రారంభోత్సవ ఉపన్యాసం చేసిన ప్రొ.కోదండరాం గారు అన్నారు, "ఇక్కడ చేరిన ఇన్ని వేల మంది పిల్లల ముఖాలలోని ఆనందం చెప్పకనే చెపుతున్నది. ఒక బలమైన సంకేతాన్ని ఇస్తు న్నది. ఒక గట్టి సందేశాన్ని ఇస్తున్నది. వాళ్ళకు ఎటువంటి చదువులు కావాల్నో. వాళ్ళకు కావల్సింది పాఠాలు కుక్కి కుక్కి, ఫలితాలు కక్కించే చదువులు కాదు. ఇట్లా సహజంగా సంతోషంగా నేర్చుకొనే జ్ఞానం కావాలి. ఇంటిలోనూ, బడిలోనూ, ప్రభుత్వం లోనూ ఉన్న పెద్దలందరూ ఈ పిల్లలు ఇస్తోన్న సంకేతాన్ని సందేశాన్ని గ్రహించుకోవాలి. అట్లాగే నడుచుకోవాలి!

పిల్లల సహజ ప్రతిభా పాటవాలను చూస్తుంటే, "అడవిలోని నెమలి కెవడు ఆట నేర్పెను? కొమ్మపైని కోకిలమ్మ కెవడు పాట నేర్పెను?" అన్న సినీ కవి మాట మదిలో మెదులుతుంది. అలాంటి సహజ జ్ఞానాన్ని, ప్రకృతి తత్వాన్ని అందించే చదువులను మనం మన పిల్లలకు అందించ గలిగిన నాడు, తెలుగు పలుకులోని వైవిధ్యాన్ని పదిలపరుచుకోగలిగిన నాడు, ఈ పిల్లల పండుగ మూడునాళ్ళ ముచ్చట కాదనీ మనం సంతోషిద్దాం. పిల్లల పట్ల అపారమైన నమ్మకం, ప్రేమ కలిగిన పెద్దలందరి కల నెరవేరుతుందనీ కోరుకొందాం.

**–చంద్రలత,**

ఫోను : 98491 44605

కవిత

## అతడు

అతనేగా మన శరీర భాగాలకు ఉనికినీ, నైపుణ్యాన్నీ ఇచ్చింది
డార్విన్ 'సర్వైవల్ ఆఫ్ ద ఫిట్టెస్ట్' కాదంటుందా?

మన మాటలు అతను మౌనంతో చేసిన పోరాటమేగా
చేతలు అతని భిక్షేగా

నిలబడి నడిచిందీ మనకోసమేగా
ఆలోచనలకీ, ఆత్మవిశ్వాసానికీ కాపీరైట్లు అతనివేగా

గెలుపే అన్నీ కాదని వారసులకి చెప్తాం
మరి ఆ గెలుపేగా అతనికి బ్రతుకు అయింది

అతను దొరికింది తిన్నాడు-ఛాయిస్ లేదు
మనకేమో సమాధుల ప్రక్కనే నక్షత్రాల బఫే వుందిగా

అతను కొంచెం కొంచెంగా ధరించాడు
మనమేమో కొంచెం కొంచెంగా తీసేస్తున్నాం...

ఇక్కడా వ్యతిరేకమే
ఇద్దరి 'జీన్స్' ఒక్కటేనా? లేక బ్యాక్ టు బేసిక్సా?

కుక్క డొక్కలో రాయితో కొట్టడానికీ బ్యాట్‌తో సిక్సర్ కొట్టడానికీ
ఒకే బేసిక్ ఇన్‌స్టింక్ట్ కారణమా
ఫ్రాయిడ్‌ని అడగొద్దులే
బంధాలకన్నా ముందు జంతువులమేగా

మొబైల్స్ జైళ్ళలో కాలాన్నీ, ప్రపంచాన్నీ కంప్రెస్ చేస్తాం
తొమ్మిది నెలలనీ, తల్లి గర్భాన్నీ అలా చేయగలమా?

సీతాకోక చిలుకది నాలుగో దశేగా
కాదంటే విజయాట్టహాసం చేసేది గొంగళిపురుగేగా

డబ్బులు డబ్బులు డబ్బులు...
డబ్ల్యూ డబ్ల్యూ డబ్ల్యూ- అంటూ
భూగోళాన్ని వొళ్ళో కూర్చోబెట్టుకుంటాం
అదేగా మన ఇరుకు మనసుల ఎలక ప్రపంచం

అతనూ, బాబేజ్ ఒక్కటయితే
'సెలక్ట్ ఆల్ కట్' అని
ఏమార్స్‌లోకో మనల్ని పేస్ట్ చేయరా

అతని అమాయకపు ప్రకృతేగా రాక్షసబల్లులనూ
విష సర్పాలనూ అంతం చేసి
మనకు పచ్చదనాన్ని మిగిల్చింది
అందుకేనా దానిపై మనకి అణువంత ప్రేమా-
అణువంత కక్ష!

అతని హృదయం ఉడికిపోతోంది
కొలవడానికి మీ దగ్గర ఏదో
థర్మామీటర్ వుండే వుంటుంది

ప్రకృతితో శ్రుతి కలిపి మనందరం
విశ్వ వనభోజనాలకు తయారయితే
చందమామలూ, సూర్యుళ్ళూ, నక్షత్రాలూ
ఒకే పంక్తిలో కూర్చుంటాయి

ఈ గ్రహణం మంచిదే అంటూ
క్లార్క్ సాక్షిగా అతడు జ్యూపిటర్ నుండి
మనల్ని ఆనందభాష్పాలతో దీవిస్తాడు.

**–కోదారి నరసింహారావు**

ఫోను : 90006 46471

-వుప్పల నరసింహం

# తెలంగాణ సమాజాన్ని ఉన్నతంగా నిలిపిన ఒద్దిరాజు సోదరులు!

**ఒ**ద్దిరాజు సోదరులు. ఇనుగుర్తి బ్రదర్స్...అపూర్వ సహోదరులు... సకల కళావల్లభులు... తెలంగాణ సాహితీ, సాంస్కృతిక, సామాజిక పునర్వికాస వేగుచుక్కలు.... వైతాళికులు. తెలంగాణ సమాజాన్ని సమున్నత స్థాయిలో నిలిపిన బహుముఖ ప్రజ్ఞాశాలురు. పుంభావ సరస్వతీ పుత్రులు.

వీరిలో పెద్దవారు ఒద్దిరాజు సీతారామచంద్రరావు, చిన్నవారు ఒద్దిరాజు రాఘవ రంగారావు. వీరి శరీరాలు వేరైనా ఆత్మ ఒక్కటేనన్న విధంగా తమ ప్రతిభను, వైదుష్యాన్ని వ్యక్తం చేయడం అపురూపం. రాఘవ రంగారావు 17 మే 1973న స్వర్గస్తులయ్యారు.

రాఘవరంగారావు 1894 సంవత్సరంలో వరంగల్లు జిల్లా ఇనుగుర్తి గ్రామంలో జన్మించారు. ఒద్దిరాజు సీతారామచంద్రరావు 1887 సంవత్సరంలో అదే గ్రామంలో పుట్టారు.

తెలంగాణ సమాజానికి వారు చేసిన సేవలు, అందించిన జ్ఞానం, చూపిన మార్గం అసామాన్యమైనవి. సాహిత్య, సంగీత, విద్య, విజ్ఞాన, ముద్రణారంగాలలో వారి సేవ అపూర్వమైనది.

ఎప్పుడైనా తాము పుట్టి పెరిగిన కాలంనాటి జ్ఞానాన్ని ఎత్తి పట్టినప్పుడు, ఆ జ్ఞానాన్ని, విజ్ఞానాన్ని పదిమందికి పంచినప్పుడు ముఖ్యంగా వెనుకబడిన ప్రాంతంలో దాన్ని దీక్షగా కొనసాగించినప్పుడు వారు దీపధారులుగా మిగులుతారు. అలాంటి వారిలో ఒద్దిరాజు సోదరులు నిస్సందేహంగా ముందువరుసలో ఉంటారు.

వంద సంవత్సరాల క్రితం వరంగల్లు జిల్లా, అటవీ ప్రాంతమైన కే సముద్రం దగ్గరలోని మారుమూల గ్రామంలో, నిజాం పరిపాలన సమయంలో ప్రపంచంతో పోటీపడి తమ ప్రతిభను, ప్రజ్ఞను, పాండిత్యాన్ని ప్రదర్శించడం అపూర్వం, సంస్కృతం, తెలుగు, ఇంగ్లీషు, ఉర్దూ, పారసీ లాంటి ఎన్నో భాషలు వారికి వశపడటం ఈనాటికీ ఆశ్చర్యం కలిగిస్తుంది. వారిద్దరూ ఏక సంతాగ్రాహులు. అనేక విద్యలు, భాషలు పాఠశాలల్లో, విశ్వవిద్యాలయాల్లోనే గాక స్వయంగా నేర్చుకోవడం వారి దక్షతకు నిదర్శనం. వారి చుట్టూగల ఎన్నో విద్యలను సునాయాసంగా ఔపోసన పట్టి, ఇంకా ఇంకా కొత్త విషయాల అధ్యయనానికి తపన పడిన వైనం వింటే వారెంతటి మహానుభావులో తెలుస్తోంది.

ఈ ఇద్దరు సోదరుల జ్ఞానస్థాయి (ఐక్యూ)ని, పాండిత్య ప్రజ్ఞను ఆ రోజుల్లోనే ఆచార్య, బిరుదురాజు రామరాజు, ఆచార్య సి.నారాయణ రెడ్డి, దాశరథి లాంటి వారు కొనియాడారు. రామరాజుగారైతే ఇరుగుర్తికి వెళ్లి వారి అతిథిగా ఉండి ఆ సోదరుల శక్తి సామర్థ్యాలను, ప్రతిభా వ్యుత్పత్తులను, ప్రజ్ఞను, వదాన్యతను, ఔదార్యాన్ని, కాలానికన్నా ఎంతో ముందున్న వైనాన్ని చూసి ముగ్ధులై చిన్న పుస్తకమే రాశారు.



మాజీ ప్రధాని పి.వి. నరసింహారావు, కాళోజీ నారాయణరావు, కోదాటి నారాయణరావు, మాడపాటి హనుమంతరావు...ఇలా ఒకరా, ఇద్దరా... ఎంతోమంది ప్రముఖులు ఆ సోదరులు భాషా, సాహిత్య, సంగీత, విద్యా రంగాల్లో చేసిన సేవలను కొనియాడారు. ప్రేరణ పొందారు. ముగ్ధులై మురిసిపోయారు.

తెలంగాణ ప్రాంత ప్రముఖులచేతనే గాక కందుకూరి వీరేశలింగం పంతులు లాంటి ఇతర ప్రాంత సంస్కర్తల ప్రశంసలను వారు అందుకున్నారు. తెలంగాణ ప్రాంతం వారి భాష, సాహిత్య, సామాజికాంశాలపై చులకన భావం వ్యక్తం చేసినవారి చేత ఔరా అనిపించుకున్నారు.

మద్రాసు, బెజవాడ, బందరు, కలకత్తాలాంటి నగరాలతో, పట్టణాలతో సంబంధాలు పెట్టుకుని ఎన్నో వ్యవహారాలను సమర్థవంతంగా నిర్వహించారు. మద్రాసులోని విజ్ఞాన చంద్రికా పరీక్షలకు హాజరై ఉత్తీర్ణులై బంగారు పతకాన్ని గెలుచుకున్నారు. ముత్యాల లాంటి అక్షరాల రాతతో వీరేశలింగం పంతులు అబ్బురపడేలా చేశారు. ఎడమ చేత్తో సైతం (ఇది అతిశయోక్తి కాదు-వాస్తవం) అంతే పొందికగా రాసి పంతుల్ని ఆశ్చర్యచకితుల్ని చేశారు.

వంద సంవత్సరాల క్రితం అటవీ ప్రాంతమైన ఇనుగుర్తికి టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికను బొంబాయి నుంచి తెప్పించుకున్నారు. అలాగే కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు గారి ఆంధ్రపత్రిక

(వారపత్రిక)ను తెప్పించుకుని చదివేవారు. టైమ్స్‌లో వచ్చే సమాచారాన్ని తెలుగులోకి తర్జుమా చేసి ఆంగ్లభాషపై మరింత పట్టు సాధించారు.

మద్రాసులోని ఆంధ్రాసభ ప్రస్తుతం ఆంధ్ర క్లబ్ సంస్థకు గొప్ప చరిత్ర ఉంది. తెలుగు సాహితీ, సాంస్కృతిక ఉద్దండులందరు అక్కడి నుంచే వచ్చారు. అందులో ఈ సోదరులకు సభ్యత్వం ఉంది. అంటే తెలుగు సమాజం చైతన్యానికి నిజామాంధ్ర (తెలంగాణ) చైతన్యం ఏమాత్రం తక్కువ కాదని, అనేక రంగాల్లో రెండాకులు ఎక్కువేనని వారు ఆనాడే చాటి చెప్పారు.

పత్రికల ప్రచురణ, నిర్వహణ చైతన్యానికి చిహ్నం. అది సమకాలీన పరిస్థితులకు స్పందించే గుణాన్ని కూడా చెబుతుంది. ఆంధ్ర పత్రిక బొంబాయి నుంచి మద్రాసుకు తరలించినప్పుడు ఒద్దిరాజు సోదరులు కాశీనాధుని నాగేశ్వరరావుని కలిశారు. చర్చలు చేశారు. ఏమాత్రం న్యూనతా భావం లేకుండా పత్రికారంగం గూర్చి ఆలోచనలు పంచుకున్నారు. అలాగే బందరులో ముట్నూరి కృష్ణారావును కలిసి తమ ప్రాంతంలో పత్రిక పెట్టే ఆలోచనను వారి ముందు ఉంచారు. విచిత్రమేమిటంటే కాశీనాధుని వారి పత్రికపేరు ఆంధ్ర పత్రిక, ముట్నూరి వారి పత్రికపేరు కృష్ణాపత్రిక కాగా ఒద్దిరాజు సోదరులు నిజామాంధ్రలో, పల్లెటూరు ఇనుగుర్తిలో స్థాపించిన పత్రిక పేరు తెనుగుపత్రిక. ఆ విధంగా భాష, సాహిత్యాలకు ప్రతిబింబంగా పత్రిక పేరు ఖరారు చేశారు. ప్రాంతానికి ప్రాధాన్యత ఇవ్వలేదు. తెలుగుభాష, సాహితీ, సంస్కృతి పట్ల ఆ సోదరులకు ఎంతటి లోతైన కమిట్‌మెంట్ ఉందో ఆ పేరుతోనే తెలిసిపోయింది.

రాజధాని పట్టణం లాంటి ప్రాంతంలో గాక ఓ పల్లెటూరిలో ప్రెస్‌ను స్థాపించి పత్రికను తీసుకురావడమంటే... అది కాశీనాథుని, ముట్నూరి వారి ధైర్యంకన్నా ఎన్నో రెట్లు ఎక్కువ ధైర్యం- సాహసంగానే అభివర్ణించాలి. నిజామాంధ్ర వారికి తెలుగుభాష. సాహిత్యం, పురోగమన దృక్పథం లేవని కొందరు అవాకులు, చవాకులు పేలుతున్న సమయంలోనే ఒద్దిరాజు సోదరులు ఒంటిచేత్తో అటు ప్రెస్‌ను, ఇటు పత్రికను విజయవంతంగా నిర్వహించడం చూసి కంగుతిని ఉంటారు. తెనుగు పత్రిక ప్రారంభమైన తర్వాత కొన్ని సంవత్సరాలకు హైదరాబాదులో సురవరం ప్రతాపరెడ్డి గోల్కొండ పత్రికను ప్రారంభించారు. నిజామాంధ్ర వారి పాండిత్యం, సాహిత్యం, భాషపై ఒక ప్రత్యేక సంచికను తీసుకొచ్చారు. అందులో ఒద్దిరాజు సోదరులవి రెండు రచనలున్నాయి. ఆ విమర్శలకు ఒద్దిరాజు సోదరులు తమ పత్రిక ద్వారా, వ్యవహారం ద్వారా, ప్రజ్ఞ ద్వారా సమాధానం చెప్పకనే చెప్పారు.

ఓ మారుమూల పల్లెలో, విద్యుత్ సౌకర్యం లేని చోట, ఇతర వసతులు కూడా లేని ప్రదేశంలో ఇద్దరు సోదరులు రెండువందల మంది పెట్టు పనులు చేస్తూ పత్రిక నడపడం ఇప్పుడు ఊహించడానికే కష్టంగా ఉంటుంది. ఆ కష్టమైన పనిని ఎంతో ఇష్టంగా, విజయవంతంగా సంవత్సరాల తరబడి చేయడం నిజామాంధ్ర వారి చొరవకు, జ్ఞానానికి, అంకితభావానికి నిదర్శనం. నాణ్యత విషయంలో వారెక్కడా రాజీపడలేదు. తమ ప్రెస్‌కు విజ్ఞాన ప్రచారిణీ ముద్రణాలయమని పేరుపెట్టారు. పత్రికతోపాటు అనేక పుస్తకాలను విజ్ఞాన గ్రంథమాల పేర ప్రచురించారు. ఆనాడు నిజామాంధ్రలో జ్ఞానానికి, విజ్ఞానానికి పెద్ద పీట వేసే సంస్కారం ఎంత గొప్పగా పరిఢవిల్లిందో దీనివల్ల తెలుస్తోంది. పెద్దాయన సీతారామచంద్రరావు ఆ రోజుల్లో రచించిన రుద్రమదేవి నవలను తమ తొలి ప్రచురణగా ప్రచురించారు. కాకతీయుల వైభవం కొనసాగింపు ఆ విధంగా ద్యోతకమైంది. ఇదంతా వంద సంవత్సరాలప్పుడు జరిగిందంటే ఇప్పటికీ కొందరు నమ్మజాలరు.

నిజాం రాజు కోట వున్న హైదరాబాద్ నగరంలోనే ఈ విప్లవాత్మక కార్యాచరణకు బీజం పడింది. నిజాం ప్రభుత్వం అనుమతితోనే పత్రిక, గ్రంథమాల తరపున అనేక పుస్తకాల ప్రచురణ జరిగిందంటే మాడపాటి హనుమంతరావు లాంటి ప్రముఖుల సహకారం దీనికి లభించింది.

“వెనుకబడిన తెలంగాణ ప్రాంతమున సాహిత్య, సాంఘిక, రాజకీయ చైతన్యమునకెంతయో తెనుగు పత్రిక దోహదం చేసినది” అని బిరుదురాజు రామరాజు ఆ రోజుల్లోనే పేర్కొన్నారు. ఎలాంటి ప్రజాస్వామిక వాతావరణం లేనప్పుడు అన్ని రంగాలను ప్రభావితం చేసే ‘నిశ్శబ్ద విప్లవా’న్ని ఆ సోదరులు తీసుకొచ్చారు. ఉత్తర భారతం నుంచి ప్రేమ్‌చంద్ రచనలు తెప్పించి అధ్యయనం చేశారు. అనేక హిందీ పత్రికలను ఇనుగుర్తికి ఈ రోజుల్లోనే తెప్పించారు. బ్రిటీష ఇండియాలో జరుగుతున్న విషయాలను వాటి ద్వారా తెలుసుకున్నారు. ఇది గొప్ప అభ్యుదయ అంశం. నియమ నిష్టలతో ధర్మబద్ధ జీవితం గడుపుతూ తమ కాలానికన్నా ఎంతో ముందు ఆలోచనలు వారు చేశారు. రవీంద్రనాథ్ టాగూర్ రాసిన ‘రెక్’ అన్న ఆంగ్ల రచనను ‘నౌకాభంగం’ అన్న శీర్షికతో తెలుగులోకి అనువదించారు. ఆవిధంగా రవీంద్రుని సాహిత్యం వంద సంవత్సరాల క్రితం ఇనుగుర్తిలో దర్శనమిచ్చింది. సంస్కరణాభిలాషతో వారు వితంతు వివాహాలను ప్రోత్సహించారు. ఇందులో కందుకూరి ఆదర్శం స్పష్టంగా కనిపిస్తుంది. టాగూరు, ప్రేమ్‌చంద్ రచనలే కాదు మద్రాసు నుంచి, లండన్ నుంచి, న్యూయార్క్ నుంచి ఆ కాలానికి చెందిన గొప్ప గ్రంథాలను తెప్పించారు. Masters pieces of the world best litetature అన్న క్లాసిక్ పబ్లికేషన్ వారి సెట్‌ను తెప్పించి ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. ఈ జ్ఞానదాహం, సాహిత్యాభిలాష, ఉత్తమ సారస్వతం పట్ల ఆరాటం అత్యంత అరుదైన విషయం. ఆవిధంగా ప్రపంచసాహిత్యమంతా ఒద్దిరాజు సోదరుల ఇంట ఒదిగిపోయింది.

అంతేకాదు Peoples of all Nations. The Life Today and History of the past అన్న పదేసి వాల్యూములు గల సెట్లను విదేశాల నుంచి తెప్పించారు. ఒక్కోసెట్‌లో మూడువేల పేజీలకు మించి ఉన్నాయి. వేల ఫోటోలు, వందల మ్యాపులున్నాయి. వాటిని చదివి ప్రపంచం మొత్తం చుట్టి వచ్చిన అనుభూతిని వారు పొందారు. ఇది వారి విశాల దృక్పథన్ని, జ్ఞానతృష్ణను, అధ్యయన ఆరాటాన్ని చూపుతుంది. అంతేగాక Book of Knowledge అన్న విజ్ఞాన సర్వస్వం సెట్‌ను సైతం 1924 సంవత్సరం ప్రాంతంలోనే కొన్నారు. పత్రిక ప్రారంభం-కొనసాగింపునకు వారెంత హోంవర్క్ చేశారో దీనివల్ల బోధపడుతోంది. వారు సేకరించిన అపూర్వ గ్రంథాలు, వారి స్వీయ రచనలు కమ్యూనిస్టుల దాడిలో కాలి బూడిదయ్యాయి.

రుద్రమదేవి లాంటి స్వతంత్ర రచనలు చేయడం, నౌకాభంగం

లాంటి అనువాదాలు చేయడం. పత్రికకు అవసరమైన సమాచారం, రచనలు సేకరించడం, స్వయంగా రాయడమే గాక వారు సంగీత రంగంలోనూ రాణించారు. శాస్త్రీయ సంగీతంలో మంచిపట్టును సాధించారు. ఫిడేలు, వీణను ఎంతో ప్రావీణ్యంతో వాయించారు. అనేక సంగీత పరికరాలపై పట్టు సాధించారు. కొన్ని సంగీత పరికరాలను వారు స్వయంగా తయారు చేశారు. ఫ్లూటు వాయిస్తే శ్రీకృష్ణుడే వాయిస్తున్నాడా... అన్నంత మధురంగా ఉండేదని అంటారు. వాద్య కచేరి చేసేంత వైదుష్యం వారు సంపాదించారంటే కొందరికి నమ్మశక్యం కాదు. ఇదంతా నిజామాంధ్రలో ఓ మారుమూల పల్లెలో సాక్షాత్కారమైనదంటే అసలు కొందరు నమ్మక పోవచ్చు. కాని ఈ జ్ఞాన ప్రకటన, విద్వత్ ప్రదర్శన, వినమ్రతతో కూడిన పాండిత్యం, అనేక వస్తువుల ఆవిష్కరణల గూర్చి వింటే నిజంగా ఇది జరిగిందా?.. అని విస్మయానికి గురవక తప్పదు. కాని ఇదేకాదు ఇంకా అబ్బురపరిచే ఎన్నో ఆ సోదరులు సునాయాసంగా చేసి గొప్ప చరిత్రను సృష్టించారు.

మద్రాసు కాశీవిశ్వ విద్యాలయ పరీక్షలు రాసే విద్యార్థులకు వసతి, భోజన సౌకర్యం ఉచితంగా కల్పించారు. గురుకులాన్ని నిర్వహించారు.

ఇది ఇలా ఉంటే– ఆయుర్వేదం. హోమియోపతి, అలోపతి వైద్య విధానాల్లో వారికి మంచి పట్టుంది. ఆయుర్వేదంలో కొన్ని ఔషధాలను కనుగొని తయారు చేశారు. దేశవ్యాప్తంగా పంపిణీ చేశారు. ఆయుర్వేదంపై గ్రంథాలు రాశారు. అలోపతి వైద్యం చేయడమే కాదు, శస్త్ర చికిత్సలు కూడా సర్జన్‌లా చేశారు. ఇప్పుడు ఈ విషయాన్ని కొందరు నమ్మకపోవచ్చు కాని పరమ సత్యమని ఆయన సమకాలికులే చెప్పారు.

ఆ రోజుల్లోనే కలకత్తా నుంచి సైకిళ్ళు తెప్పించి తొక్కారు. బొంబాయి నుంచి కెమెరా తెప్పించి ఫోటోలు తీశారు. ఫోటోగ్రఫీపై పుస్తకమే రాశారు. దాదాపు వెయ్యి ఉపాధి మార్గాల గూర్చి, తయారీ పద్ధతుల గూర్చి రాశారు. శాస్త్రీయంగా భూముల సర్వే చేశారు. ఆ పరికరాలను విదేశాల నుంచి తెప్పించారు. ఇళ్ళకు ప్లానులు గీశారు. స్వయంగా తమ బంగళాకు ముగ్గుపోసి నిర్మించుకున్నారు. తలుపులను చెక్కారు. జాలీలు రూపొందించారు. అవి ఇప్పటికీ ఇనుగుర్తిలో దర్శనమిస్తున్నాయి.

ఇవన్నీ వారు స్వయంగా పూనికతో నేర్చుకున్నారు. మాస్టరీ చేశారు. ఎన్నో వ్యవస్థలు చేయాల్సిన పనులు వారు ఒంటిచేత్తో చేసి నిజామాంధ్ర (తెలంగాణ)కు ఎనలేని కీర్తిని తీసుకొచ్చారు. వారి చైతన్యం, పాండిత్యం, ప్రతిభ, భాషా సౌరభాలు, అపూర్వ ఆవిష్కరణల ఓజస్సు చూస్తూ వుంటే, వింటూ వుంటే ఒళ్లు పులకరిస్తోంది. ఆ సోదరులు పుట్టిన గడ్డపై మనం పుట్టి ఊపిరితీసుకుంటున్నందుకు, గుండె ఉప్పొంగుతున్నందుకు గర్వపడదాం.

వారి ఇంటిని రాష్ట్ర స్మారక చిహ్నంగా తీర్చిదిద్దాలి. భావితరాలకు ప్రేరణ కలిగించేలా వారి విగ్రహాలను గ్రామంలోనూ, వరంగల్లు నగరంలోనూ ఏర్పాటు చేస్తే సముచితంగా ఉంటుంది. ఈ ఆశాభావానికి అందరి మద్దతు లభిస్తుందని విశ్వసిద్దాం!

–రచయిత సీనియర్ జర్నలిస్టు, గ్రంథ కర్త,
హైదరాబాదు, ఫోన్ : 99857 81799

# ఘటికురాలు

చేగొండి రామజోగయ్య

సత్యం, శివం, సుందరం– ఈ ముగ్గురూ ఎప్పుడో పదిహేనేళ్ల క్రితం గుడివాడలోని ఒక ఇంజనీరింగు కాలేజీలో కలసి చదువుకున్నారు. నాలుగేళ్లూ రూమ్మేట్లుగా ఉండి, చాలా ఆప్తమిత్రులుగా మెలిగారు. చదువైపోయిన తర్వాత విడిపోయి, తలోదారై పోయి, ఇన్నేళ్లుగా ఒకరినొకరు కలుసుకోలేకపోయారు. కనీసం ఉత్తరాల ద్వారా గానీ, ఫోన్ల ద్వారా నైనా ఒకరి సంగతు లొకరికి తెలియకుండా ఉండిపోయారు. పదిహేనేళ్ల తర్వాత, తమ కాలేజీ 'స్వర్ణోత్సవాల' సందర్భంగా జరిగిన పూర్వవిద్యార్థుల సమ్మేళనంలో పాల్గొనటానికి వచ్చి, అంతమందిలోనూ, పరస్పరం గుర్తుపట్టుకుని, ఆ రోజంతా కలిసి ఉండి, పాత జ్ఞాపకాలు పంచుకున్నారు. ప్రస్తుత స్థితిగతులు పరస్పరం తెలుసుకున్నారు.సత్యం ఇప్పుడు హైదరాబాద్‌లో ఒక ప్రముఖ నిర్మాణ సంస్థలో ఎమ్.డి.గా ఉన్నాడని, శివం బెంగుళూరులో ఒక కంప్యూటర్ కంపెనీలో మంచి ఉద్యోగంలో ఉన్నాడని, ఇక మూడో మిత్రుడు సుందరం చదువుకున్న పట్టణం గుడివాడలోనే స్థిరపడిపోయి, చదువుకి ఏమాత్రం సంబంధం లేని హోటల్ బిజినెస్‌లో కుదురుకున్నాడని, ముగ్గురికీ పెళ్లిళ్లయి తలో ఇద్దరు పిల్లల్ని కలిగి సంసార సాగరాన్ని ఈదుతున్నారని తెలుసుకున్నారు. కాలేజీ ఫంక్షన్ ముగిసిన తర్వాత, అందరు పూర్వ విద్యార్థులతోపాటు సత్యం, శివం, సుందరంలు కూడా బరువెక్కిన గుండెలతో తిరుగుప్రయాణమయ్యారు ఆ సాయంత్రమే.

మిత్రులిద్దరినీ సాగనంపటానికి స్థానికుడు సుందరం రైల్వే స్టేషన్‌కి వచ్చాడు. వాళ్ళెక్కాల్సిన రైళ్లు రావడానికింకా కొంత సమయ మున్నందున క్యాంటీన్‌లో కాఫీ తాగి వెయిటింగ్ రూమ్‌లో పక్కపక్కనే ఆశీనులయ్యారు. అప్పుడు ఎందుకనో ఆ రూమ్‌లో తాము తప్ప ఇంకెవరూ లేకపోవటం వాళ్లకానందాన్ని కల్గించింది. అక్కడ కాలేజీ ప్రాంగణంలో అంతమంది మధ్యన, స్వేచ్ఛగా మాట్లాడుకోలేకపోయిన వ్యక్తిగత విషయాల్ని ఇప్పుడు చెప్పుకోవడానికి అవకాశం లభించిందనుకున్నారు.

సత్యం ముందు అందుకున్నాడు– "మీ ఇద్దరికీ జ్ఞాపకం ఉందో లేదో–విడిపోయిన రోజున మనం ఎలాంటి ఉద్యోగాల్లో స్థిరపడాలో చర్చించుకున్నాం. దానికన్నా ఎక్కువగా ఎలాంటి భార్య వస్తే బాగుంటుందో కూడా తర్జన భర్జన పడ్డాం కదా! వెంటనే స్పందించాడు శివం– "ఔను సత్యం! నేనూ సుందరం అయితే ఏదో సంసారపక్షంగా ఉండేది, గయ్యాళితనం, దుబారా ఖర్చుల అలవాట్లు లేనిది భార్యగా రావాలి..మొగుడితోపాటు అత్తమామల్ని బాగా చూసుకునేదైతే ఇదే పదివేలు అన్నాం. కానీ నువ్వైతే మాత్రం పెద్ద లిస్టు చదివావు. నీ భార్య ఎలా ఉండాలో"'

"మంచి అందం, మనసు, చదువు, సంస్కారాలతో పాటు భర్త అడుగుజాడల్లో నడిచే అణకువ, అత్తమామల, ఆడబడుచుల పట్ల విధేయతగలదే నీ భార్యగా రావాలని, అంతేకాదు పుట్టింటినుంచి మెట్టింటికి అపారమైన సంపద తెచ్చేదై ఉండాలని స్పష్టంగా చెప్పావు. మరి అలాంటి భార్య వచ్చిందా?.."

"ఏం చెప్పమంటావ్రా!..తానొకటి తలిస్తే దైవం మరొకటి తలచి నట్టైంది...నేను కోరుకున్న గుణాలేవీ లేవు మా ఆవిడలో..వివరాలు చెప్పి మీ మనసుల్ని బాధించలేను. అందుకే ఒకే మాటలో చెబుతా.. తనని వర్ణిస్తా...అది.. అది గయ్యాళి" ఎటో చూస్తూ క్లుప్తంగా, స్పష్టంగా సత్యం పలికాడు సత్యం.

ముగ్గురి మధ్య కాసేపు మౌనం రాజ్యం చేసింది–వాతావరణాన్ని తేలికపరిచే ఉద్దేశంతో శివం మెల్లగా అన్నాడు– "నేనూ మా ఆవిడ గురించి ఒకే మాటలో చెబుతా–ఆమె మంచిది"

"పోనీలే అదృష్టవంతుడివి" అన్నట్లు శివం వైపు చూశారే గానీ మిత్రులిద్దరూ "మంచిది" అంటే ఎలా ఎంత, ఆ వివరాలడగలేదు. మరీ అతి మంచితనంతో నీకేమీ ఇబ్బంది కలగజేయటం లేదుకదా, అన్న అనుమానమూ వ్యక్తపరచలేదు. ఒక్క పదంతో చెబితే చాలు– వివరాలేమీ అడగకూడదు" అన్న అలిఖిత ఒప్పందమేమో తమ మధ్యన ఉన్నట్లుగా–

ఇక, సుందరం వంతు వచ్చింది. తన భార్య ఎలాంటిదో చెప్పడానికి. కానీ అతను మౌనంగానే ఉండిపోయాడు.

"ఫర్వాలేదు చెప్పు సోదరా! నేను చెప్పలేదా? నా పెళ్ళాం గురించి ఒకే పదంలో 'గయ్యాళి' అని. నువ్వూ ఒకే పదంలో చెప్పు" అన్నాడు.

ఇక తప్పదనుకుని మెల్లగా గొంతు విప్పాడు సుందరం. తనలో తనే మాట్లాడుకునే ధోరణిలో ఉన్నాడు– "నా భార్య గురించి చెప్పాలంటే తెలుగులో ఎన్నో మంచిపదాలున్నాయి. వాటికెన్నో పర్యాయ పదాలున్నాయి. తనని సంపూర్ణంగా వర్ణించడానికి ఏ ఒక్కపదమూ చాలదు. నేను ఎన్నోసార్లు విన్నాను. అందరితో కాదు గానీ, తన అత్యంత సన్నిహితులతో సగర్వంగా ఆత్మవిశ్వాసంతో తన గురించి చెప్పే మాట. 'నేను ఘటికురాల్ని' అనేది. నేనూ అదే మాట వాడుతా. నా భార్య ఘటికురాలు.

సత్యం, శివం కాసేపు అయోమయంలో మునిగిపోయారు. గయ్యాళి అంటే, మంచిది అంటే అందరికీ స్పష్టంగా తెలిసే అర్థాలున్నాయి. కానీ ఘటికురాలంటే? ఏమిటర్థం?

"ఏమీ అనుకోకు సుందరం–ఘటికురాలు అంటే మాయ మాటలు చెప్పి తన కార్యం సాధించుకునేదన్న అర్థం కూడా ఉందేమో" కొంచెం సంతోషిస్తూనే అన్నాడు సత్యం.

ఆ మాటలకి సుందరం కొంచెం నొచ్చుకున్నాడనిపించి శివం

సముదాయింపుగా అన్నాడు. "సత్యం ఉద్దేశం ఘటికురాలు అంటే మోసకారి అని కాదు. తను అనుకున్నది, కోరుకున్నది అది మంచి దైనా, చెడ్డదైనా సరే, చాలా తెలివిగా ఏదోలా సాధించుకునే వాళ్ళను కూడా ఘటికురాలు అంటారు కదా– ఉదాహరణకి ఇందిరాగాంధిని, మాయావతిని, జయలలితను కూడా అనిపిస్తోంది. ఆవిడ గురించి ఏమీ తెలియదు గానీ, ఈసారి సుందరం మిత్రుల కళ్ళల్లోకి నేరుగా చూస్తూ అన్నాడు. "చాలా సమర్థురాలు" ఇతరులకి అసాధ్యమైనవి కూడా అతి సులభంగా సాధించగల్గే ఘటికురాలు, అపూర్వమైన తెలివితేటలు గలది అని చెప్పటమే నా ఉద్దేశం. ఘటికురాలు అన్నపదం వేర్వేరు సందర్భాల్లో కూడా ఇంకా ఎంతమంది పట్లనో వాడవచ్చన్నది వాస్తవమే. కానీ మా ఆవిడ ఎలాంటి ఘటికురాలో మీకు స్పష్టంగా తెలియాలంటే ఎన్నో వివరాలు చెప్పాలి. మీ రైళ్ళు రావడానికి ఇంకా సమయం ఉంది కాబట్టి కొన్ని ముఖ్యమైనవి మాత్రం చెబుతాను, నా తృప్తికోసం కూడా...

అంతకన్న కావాల్సిందేముందన్నట్లు మిత్రులిద్దరూ సుందరంకి దగ్గరగా జరిగి, ఉత్కంఠతో అతని మాటలు వినసాగారు.

మీకు మొదటగా చెప్పాల్సింది మాకు పెళ్ళయిన – కాదు కాదు, తను నన్ను పెళ్లి చేసుకున్న వైనం. నా చదువు పూర్తవటం, మా నాన్న రిటైరవటం దాదాపు ఒకేసారి జరిగింది. నాన్న ఉన్న కాసిన్ని డబ్బులతో గుడివాడలో ఒక పెంకుటిల్లు కొన్నాడు. ఇన్నాళ్లకు సొంతిం టిలో ఉంటున్నామన్న తృప్తిని అమ్మకు, నాకు, చెల్లికి కల్పించారు. అప్పుడే మా ఇంటిపక్కనే ఉన్న ఒక మేడను కొనుక్కుని, నాయుడిగారి కుటుంబం అందులో దిగారు. నాయుడుగారి భార్య కాంతం గారు చాలా మంచిదని, వాళ్ల ఏకైక కుమార్తె ప్రతిభ చాలా పద్ధతైన పిల్ల అని మా అమ్మ, నాన్నతో చెబు తుంటే విన్నాను. అందగత్తె కూడా అని కొసరింది కూడా. అయినా నేను పెద్దగా పట్టించుకోలేదు. ఔను, ఇంకా స్థిరపడని నాకు ప్రేమా దోమా అనుకునే పరిస్థితి లేదు కదా అప్పుడు. అందుకే అప్పుడప్పుడు ఎదురై మధురంగా నన్ను పలక రించినా ప్రతిభతో ముభావంగానే ఉండేవాణ్ని. అంత అందమైన అమ్మాయి పలకరిస్తున్నందుకు మది పులకరించేది గానీ పొడిపొడిగానే జవాబిచ్చి తప్పుకునేవాణ్ని. నాకన్న అందమైన, తెలివైన, డబ్బున్న అమ్మాయితో ఎక్కువ చనువు మేలు కాదన్న న్యూనతాభావం కూడా ఉండేది నాలో. ఇక నాతో లాభం లేదు. అట్నుంచి నరుక్కుని రావా లనుకుందనుకుంటాను. ప్రతిభ నేనున్నప్పుడు, లేనప్పుడు మా ఇంటికి రాకపోకలు ఎక్కువ చేసింది. వాళ్లింట్లోంచి తినుబండారాలు తెచ్చేది. అమ్మకి వంటలో సాయం చేసేది. క్రమంగా 'అత్తమ్మ' అంటూ వరస కలిపింది. నాన్నతో చదరంగం ఆడేది. ఓ శుభదినాన, నాయుడుగారు భార్యతో సహా నేను లేనప్పుడు మా ఇంటికి వచ్చి నాన్నతో, అమ్మ ఆనందంగా వింటుండగా అన్ని వివరాలూ మాట్లాడేసి, సంబంధం ఖాయం చేసేసుకున్నారు."మీ ఇంటిపక్కనున్న ఈ మేడ మా అమ్మాయి పేరుమీదనే కొన్నాం. అందులోకి మీ కుటుంబం మారిపోయి, మీ పెంకుటింటిని అద్దెకిచ్చేసుకోవచ్చు. లేదా మీ అమ్మాయికి పెళ్లిలో



కట్నంగా ఇచ్చుకోవచ్చు. మేం ఊళ్లోనే మాకున్న ఇంకో మేడలోకి మారిపోతాం. అందరం ఇరుకుగా ఈ మేడలోనే ఉండాల్సొస్తుందేమో అనుకోవద్దు. ఇకపోతే మాకున్న నాలుగు హోటళ్లలో రెండు అల్లుడికిచ్చేస్తాం. వాటిని చూసుకుంటే చాలదా, వేరే ఉద్యోగం ఎందుకు? ఏమైనా మీ గౌరవానికి ఎప్పుడూ భంగం కలగదు నమ్మండి– మా తదనంతరం మా ఆస్తి అంతా అమ్మాయికే దక్కుతుంది. తనే మా ఏకైక సంతానం అని తెలుసు కదా" ఇలాంటి మాటలతో మావాళ్లు పడిపోయారు. నా ప్రమేయం లేకుండా సంబంధం కుదిరిపోయింది. వెంటనే మా వివాహం వైభవంగా జరిగిపోయింది. పెళ్లిరోజునే 'ఎలా సాధించావే' అని ఎవరో స్నేహితురాలు తన చెవిలో గుసగుసగా అడిగితే, మా ఆవిడ నాకు వినపడేలానే సగర్వంగా చెప్పింది, 'నేను ఘటికురాలిని' అని. నిజమే..ఘటికురాలే అని నేను కూడా అనుకున్నాను. తర్వాత కూడా తను ఘటికురాలినని నిర్ధారించే సంఘటనలెన్నో జరిగాయి. కొన్నే చెబుతాను.

వివాహం ద్వారా నా చేతికి వచ్చిన రెండు హోటళ్లను ఆదాయ పరంగా, ప్రతిష్టపరంగా కూడా అనతికాలంలో ఎంతో అభివృద్ధి పరచగలిగానంటే అదంతా నా గొప్పేమీ కాదు. ఇంటిపనుల్లో, అత్త మామల సేవలతో పాటు, వ్యాపారాల నిర్వహణలో కూడా, ప్రతిక్షణం ఆ ఆవిడ ప్రతిభ, ప్రతిభావంతంగా నాకు మార్గదర్శనం చేయటమే ప్రధాన కారణం, మా వ్యాపార ప్రగతికి.

ఇంకో ప్రధాన సంఘటన చెబుతా– మా చెల్లికి మాకు తెలియకుండానే ప్రేమ వ్యవహారంలో పడి, కొంతదూరం వెళ్ళాక, అతగాడు తల్లిదండ్రులకు జడిసి కాబోలుముఖం చాటేస్తే ఆత్మహత్యా ప్రయత్నం చేసింది. సమయానికి మా ఆవిడే దాన్ని కాపాడింది. అంతేకాదు అతడిని వెతికి పట్టుకుని పోలీసు కేసు పెడతానని, మహిళా సంఘాలను కూడగట్టి మీడియాలో నానా గొడవ చేస్తానని భయపెట్టి దారిలోకి తెచ్చింది. మంచికట్నం ఆశ చూపి మా చెల్లితో పెళ్లికి అతడి తల్లిదండ్రులకు అభ్యంతరం లేకుండా చేసిన ఘటికురాలు మా ఆవిడ. పెళ్లయ్యాక బావకి మా హోటల్‌లో మేనేజర్ ఉద్యోగం ఇప్పించిన ముందుచూపు గలది. ఏమైనా, మా చెల్లి కాపురం చక్కగా ఉందంటే అదంతా మా ఆవిడ ప్రతిభే.

ఓసారి నేను నిర్వహిస్తున్న ఓ హోటల్ మీద పోలీస్ దాడి జరిగి, ఒక రూమ్‌లో ఒక వేశ్య, విటుడు పట్టుబడ్డారు. మాపై క్రిమినల్ కేసు దాఖలైంది. ఏంచేయాలో తెలియక నిశ్చేష్టుడినై నేనుండగా, మా ఆవిడ రంగంలోకి దిగి ఇదంతా మా వ్యాపార ప్రత్యర్థులు చేసిన కుట్ర అని, పట్టుబడ్డ వేశ్యతోనే సాక్ష్యం ఇప్పించి కోర్టులో కేసు కొట్టేయించింది. చాలా ఘటికురాలే అని మా వ్యాపార ప్రత్యర్థులే అన్నారప్పుడు. ఆఖరిగా ఇంకోటి చెబుతాను. కొంచెం నలతగా ఉందని వైద్యపరీక్షలు చేయించుకుంటే నా రెండు కిడ్నీలు చెడిపోయేయన్న భయంకర సత్యం తెలిసింది. ఇక నా పనైపోయిందని ఏడుస్తుంటే, కేవలం సముదాయించడానికే కాబోలు మా అమ్మ నా తల నిమురుతూ అంది. 'భయపడకురా కన్నా–నీకేం కానీయదు మీ ఆవిడ–సతీ సావిత్రిలా నీ ప్రాణాన్ని కాపాడుతుంది' అని. నిజంగానే అదే జరిగింది. వివరాలు మాకెవరికీ తెలియనీయకుండా ప్రతిభ నాకు మూత్రపిండ మార్పిడి ఆపరేషన్‌కి అన్ని ఏర్పాట్లు చేసింది. భర్తని మృత్యుముఖం నుండి రక్షించిన ఘటికురాలు బాబూ మీ ఆవిడ అని నాకు ఆపరేషన్ చేసిన డాక్టరు గారు అన్నప్పుడు తన కోసం చుట్టూ చూశాను కనపడలేదు. 'నీ ఆపరేషన్ సక్సెస్ అయింది. నీ భార్యే నీ కిడ్నీదాత' అని డాక్టరు గారు అన్నప్పుడు మాకు అసలు విషయం– అదే ప్రతిభ చేసిన త్యాగం గురించి తెలిసింది. 'మీ ఆవిడ పక్కరూమ్‌లోనే ఉంది. త్వరలోనే కోలుకుంటుంది' అని డాక్టరు గారు చెప్పారు. కానీ.." ఇంక మాటలు రాక సుందరం భోరున ఏడ్వసాగాడు.

"ఏమైంది? సత్యం, శివం ఒకేసారి అరిచారు.

"ప్రతిభ కోలుకోలేదు. ఏదో ఇన్‌ఫెక్షన్ వచ్చి ఎంత చికిత్స జరిగినా నెలరోజుల తర్వాత కోమాలోకి వెళ్ళిపోయింది. రెండు రోజుల్లో నన్ను శాశ్వతంగా విడిచిపోయింది. చనిపోయింది. కాదు తను చచ్చిపోలేదు. మూత్రపిండం నాకు దానమిచ్చి నాలో బతికి ఉంది. అంతేకాదు, తను కోరిన ప్రకారం బ్రెయిన్‌డెడ్ అయిన తర్వాత తన శరీరంలోని మరికొన్ని భాగాలు–గుండె, లివర్, ఊపిరితిత్తులు, రెటీనా వంటివి తీసి, మరో అయిదుగురు సంబంధిత రోగులకు అమర్చారు. ఆ విధంగా ఆ ఘటికురాలు నాతోపాటు మరో ఐదుగురు మనుషుల్లో జీవిస్తున్నది"

ముగ్గురు మిత్రులూ చాలాసేపు ఏడుస్తూ ఉండిపోయారు.

*–రచయిత ఫోన్ : 9391007780*

కవిత

## ఇదేనా పెద్దరికం?

ఇదేనా పెద్దరికం? ఇదేనా పెద్దరికం?
తాతయ్యా, యిదేనా పెద్దరికం?
అసేవ్ కాఫీ! ఒసేవ్ వంటయ్యిందా?
ఇదేనా పెద్దరికం?

నాన్నగారూ! నాన్నగారూ!
దండాలెట్టినోడికే సంతకాలు పెట్టడం
ఇదేనా పెద్దరికం? ఇదేనా పెద్దరికం?

నచ్చినోళ్ళకు, డబ్బులిచ్చినోళ్ళకు
మార్కులెక్కువెయ్యడం



మాస్టారూ! ఇదేనా పెద్దరికం?

పేదోళ్ళను లాఠీలతో తన్నడం
ప్రశ్నిస్తే దొంగకేసు బనాయించడం
పోలీస్ మామా! ఇదేనా పెద్దరికం?

ఇదే పెద్దరికం అయితే
నేనూ చలాయిస్తా
లాఠీ చేతికొస్తే మీ
పెద్దరికాలు సరి చేస్తా!
మీ వంకరలు సరితీస్తా!

**–డి.నటరాజ్,** 94404 28597

-డా॥బొర్రా గోవర్ధన్

# మానవ విలువల మణిమకుటం

### ప్రజా క్షేత్రంలో...

సిద్ధాంతం సిద్ధాంతంగా కాగితాల మీదో, తాటాకుల మీదో ఉన్నంతవరకూ దానికి ఎలాంటి ఇబ్బంది ఉండదు. ఎలాంటి ఆటుపోట్లూ ఉండవు. అది ఒక్కసారి ప్రజాక్షేత్రం లోకి వచ్చిందంటే చాలు, ఆటుపోట్లు తినక తప్పదు. పచ్చి అవకాశవాదానికే ఈ ఇబ్బందులొస్తాయి. ఇక నైతిక ధార్మిక మానవీయ సిద్ధాంతానికైతే చెప్పనవసరం లేదు. ఎన్నో ఆటుపోట్లు ఎదుర్కోక తప్పదు. బౌద్ధం అలాంటి ఆటుపోట్లు ఎదుర్కొంది. ఆ తర్వాత మార్క్సిజం కూడా అలాంటి ఆటుపోట్లనే ఎదుర్కొంటోంది. ప్రపంచ వ్యాపితంగా మార్క్సిజం, లెనినిజం, మావో ఆలోచనా విధానం...ఇలా ఎన్నోవిధాలుగా మారింది. మన దేశంలో అయితే..ఎన్ని శాఖలుగా విడిపోయిందో..విడిపోతుందో.. తేల్చలేం.

అలాగే...మానవీయ ధర్మమైన బౌద్ధం కూడా ప్రజాక్షేత్రంలోకి వచ్చే సరికి ఎన్నో శాఖలుగా విడిపోయింది. దీనికి ఆయా ప్రాంతాల ప్రజల జీవనవిధానం, దానిలోని సామాజిక సంబంధాలు ఒక కారణం కాగా, ఆయా కాలాల్లో వచ్చిన ఇతర ధర్మాల ప్రభావం కూడా మరో కారణమే. మరీ ముఖ్యం వైదిక కులాల ప్రభావం.

వైదిక కులాల ప్రభావం వల్ల బౌద్ధంలో ప్రధానంగా మార్పులు జరిగాయి.

ఆ మార్పుల్లో...

**ఒకటి :** వైదిక భావజాలాన్ని ముఖ్యంగా ఆత్మవాదాన్ని మరో రూపంలో బౌద్ధంలోని అనాత్మ వాదంలో కలిపేశారు. పునర్జన్మ భావాన్ని ప్రతిపాదించారు.

**రెండు :** బుద్ధుడు తను చెప్పిన ప్రబోధాలన్నీ, చేసిన సిద్ధాంతాలన్నీ సాధారణ ప్రజలకి కూడా అర్థమయ్యే భాషలో, ప్రజల భాషలో చెప్పాడు.

'నా ఉపదేశాలను ప్రజల స్థానిక భాషల్లోనే ఉపదేశించండి. మాండలికాల్లోకి కూడా మార్చి ఉపదేశించండి. కానీ ఎట్టి



పరిస్థితుల్లో సంస్కృతంలోకి మార్చొద్దు, చెప్పొద్దు' అని ఖచ్చితంగా చెప్పాడు. కానీ, ఆ తర్వాత వైదిక భాషైన సంస్కృతంలోకి బుద్ధ ప్రవచనాలు వచ్చాయి. అంటే ప్రజల భాష నుండి పండిత భాషలోకి మళ్ళాయి. తేలిగ్గా అర్థం కావలసిన బుద్ధుని బోధనల్ని తల బాదుకున్నా అర్థంకాని కఠోర పాకాలుగా మార్చేశారు. ఈ స్థితి ఇంకా కొనసాగుతూనే ఉంది.

**ఇక మూడు :** బుద్ధుణ్ణి వైదిక దైవాలకు ప్రత్యామ్నాయ దైవంగా నిలబెట్టారు.

ఈ ప్రధానమైన మార్పులే వివిధ బౌద్ధ శాఖలుగా వ్యక్తమయ్యాయి.

### బౌద్ధ శాఖలు:

మౌర్యసామ్రాజ్యం ఏదొక మేర ఉన్నంత వరకు మగధ రాజ్యం బౌద్ధానికి కేంద్రంగా ఉండేది. ఆ తర్వాత కొద్ది కాలానికే మగధలో బౌద్ధం కనుమరుగై పోయింది.

బుద్ధుడు నిర్వాణం పొందిన వందేళ్ళకి హీనయానం, మహాయానం అనే రెండు శాఖలుగా విడిపోయింది బౌద్ధం. మనం గతంలో చెప్పుకున్నట్టు హీనయానం(చిన్నవాహనం) ఆ తర్వాత వందేళ్ళలో 12 శాఖలుగా విడిపోయింది. వీరిలో బలమైనవారు స్థవిరులు. కాలక్రమంలో స్థవిరవాదులే మిగిలారు. అందుకే హీనయానాన్ని స్థవిరవాదంగా పిలుస్తున్నారు. వీరు బుద్ధుడు చెప్పిన నియమాల్ని ఎలాంటి మార్పులు లేకుండా అనుసరిస్తారు.

అలాగే...మహాయానం కూడా ఆ వందేళ్ళలో ఆరు ప్రధాన శాఖలుగా విడిపోయింది.

అంటే బుద్ధుని నిర్వాణం తర్వాత 200 ఏళ్ళలో అంటే అశోకుని కాలానికే బౌద్ధం ప్రధానంగా 18 శాఖలుగా ఏర్పడింది.

మనం ఇంతకుముందు చెప్పుకొన్నట్లు మగధ తర్వాత మధుర, ఆ తర్వాత కాశ్మీరు గాంధారలు, అటు పశ్చిమాన బౌద్ధ దార్శనిక కేంద్రంగా పరిఢవిల్లాయి. అలాగే, దక్షిణాన మన తెలుగు ప్రాంతంలో ధాన్యకటకం మరో అతిముఖ్య కేంద్రంగా రాణించింది.

### ధాన్యకటకం-మహాయానం:

మనం ఈ వ్యాసాల మొదట్లోనే చైత్యాల గురించి చెప్పుకున్నాం. రాళ్ళతో నిర్మించిన సమాధులే...ఆ తర్వాత చైత్యాలుగా రూపొందాయని. స్మృతిచిహ్నాలుగా (ఈజిప్టు పిరమిడ్లులా...) బౌద్ధ భిక్షువుల స్మృతిచిహ్నాలుగా చైత్యాలు నిలిచాయని..వీటికి తొలి రూపకర్తలు మన తెలుగువారేనని..అందుకే చైత్యాన్ని గౌరవించే తెలుగు బౌద్ధుల సంప్రదాయానికి 'చైత్యవాదం' అనే పేరు వచ్చింది. ఈ చైత్యవాదం మహాయాన సంప్రదాయం పుట్టడానికి అతిముఖ్యమైన శాఖ. ఈ చైత్యవాద కేంద్రం ధాన్యకటకం. తెలుగు సామ్రాజ్య తూర్పుభాగంలో ఈ ధాన్యకటకం ఉంది. అలాగే పశ్చిమ భాగంలో (ఈనాటి మహారాష్ట్రలో అజంతా ఎల్లోరా ప్రాంతాలు) సామ్మితీయ అనే మరో బౌద్ధశాఖ ఉండేది.

నిజం చెప్పాలంటే...ఈ రెండు తెలుగు బౌద్ధ శాఖలే కాలక్రమంలో 'మహాయానం' బౌద్ధానికి మార్గం తీశాయి.

క్రీ.పూ.3వ శతాబ్దికి ఈ రెండు శాఖలు ఉన్నాయి. ఆ తర్వాత క్రీ.పూ.1వ శతాబ్ది కాలం నాటికి (అంటే 200 ఏళ్ళలో) ఈ రెండూ ఐదు ప్రధాన ఉపశాఖలుగా మారాయి. అవి. 1) వైపుల్య, 2) పూర్వ శైలీయ, 3) అపర శైలీయ, 4) రాజగిరిక, 5) సిద్ధార్థిక.

వీటిలో చైత్యవాదాన్ని పాటించేవాళ్ళని

మహా సాంఘికులు అంటారు. అంటే ఈ మార్గాన్ని పాటించిన వారు ఎక్కువమంది. కాబట్టి ఈ మహాసాంఘిక పదమే కాలక్రమంలో 'మహాయానం'గా పిలువబడింది. అలా క్రీ.శకం 1వ శతాబ్దం నాటికి మహాయానం ప్రత్యేకంగా వేరుపడింది.

ధాన్యకటకాన్ని కేంద్రంగా చేసుకుని చైత్యకవాదం ఎదిగింది. ఈ ధాన్యకటకానికి చుట్టుపక్కల దగ్గర్లో ఉన్న కొండలమీద నివసించిన బౌద్ధ భిక్షువుల్ని తూర్పున ఉన్నవారిని పూర్వశైలీయులు అని, ఉత్తరాన కొండలమీద ఉన్నవారిని ఉత్తర శైలీయులు అని, ధాన్యకటకానికి దూరంగా నాగార్జునకొండ మీద ఉన్నవారిని అపర శైలీయులని పిలిచేవారు.

ఈ చైత్యకులకు, శైలులకు సంబంధించిన శిలా శాసనాలు అమరావతిలో దొరికాయి. అలాగే నాగార్జునకొండ దగ్గర అపర శైలీయుల శాసనాలు దొరికాయి.

చైత్యకుల్ని 'అంధకులు' అని కూడా అంటారు. అంధకులు అంటే ఆంధ్రులే. పురాతన కాలం నుండీ మన తెలుగు ప్రాంతాన్ని ఆంధ్ర పేరుతోనే పిలిచే వారు. బౌద్ధంలో కూడా 'అంధక' శబ్దమే ఉంది.

అశోకుని కాలానికి చెందిన బౌద్ధ గురువు మొగ్గలిపుత్త తిస్స రాసిన 'కథావత్తు'లో ఆంధ్రదేశంలో 41 బౌద్ధ సంప్రదాయాలున్నాయని రాశాడు.

ఐతే మరోచోట 73 అనీ, ఇంకోచోట 33 అని ఉన్నాయి. ఇవన్నీ అభిప్రాయాలేగానీ ప్రత్యేకశాఖలు కావు అనేది బౌద్ధ పండితుల అభిప్రాయం.

ఏమైనా–

మహాయాన సంప్రదాయ పురిటిగడ్డ మన తెలుగు గడ్డే. మహాయానంలో ప్రధానంగా రెండు పాయలున్నాయి. 1) మాధ్యమిక వాదం 2) యోగాచార వాదం.

ఇందులో యోగాచార వాదానికి పుట్టిల్లు గాంధార. యోగాచార వాదాన్ని విజ్ఞానవాదం అని కూడా అంటారు. ఆ రోజుల్లో గాంధార (నేటి పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్) గ్రీకుల ఏలుబడిలో ఉండేది. కాబట్టి గ్రీకు తత్వవేత్తలైన సోక్రటీసు, ప్లేటోల ప్రభావం దాని మీద బాగాఉండేది. కాబట్టి అప్పటి, అక్కడి బౌద్ధులు బౌద్ధంలోని ప్రతీత్య సముత్పాదాన్ని, ప్లేటో విజ్ఞానవాదాన్ని కలిపి, యోగాచార వాదాన్ని ముందుకు తెచ్చారు. అసంగుడు, వసుబంధు, అశ్వఘోషుడు– ఈ యోగాచార సంప్రదాయాన్ని నడిపించిన వారే.

ఇక మన తెలుగునేలలో... మహాయానంలో మరో సంప్రదాయమైన మాధ్యమికవాదం పరిఢవిల్లింది. దీన్నే 'మధ్యమ మార్గం' అంటారు.

**భట్టిప్రోలు పంచాయితీ:**

శరీరాన్ని పూర్తిగా ఎండగట్టుకొని, కఠోరమైన యోగం చేయడం వల్ల శారీరక బాధలు తప్ప జ్ఞానం రాదు. అలాగే అతి సౌకర్యాలకు లోనైనా అంతే..అతిగా తింటే అరగని జబ్బు...అసలు తినకపోతే ఆకలి జబ్బు. ఈ రెండు 'అతులు' దుఃఖాన్ని కలిగిస్తాయి. 'తగినంత' మాత్రమే సుఖాన్నిస్తుంది. ఇదీ బుద్ధుడు ప్రధానంగా నిర్మించిన సామాజిక నైతిక సిద్ధాంతం.

కానీ ఈ మాధ్యమిక వాదం దానితో పాటు ఆత్మ–అనాత్మ ఈ రెండింటికీ మధ్యమ మార్గాన్ని సూచించింది. శాశ్వతం–క్షణికం ఈ రెండింటికీ మధ్యమ మార్గాన్ని సూచించింది. అంటే అటు వైదికానికీ (ఆత్మ ఉంది, అది శాశ్వతం) ఇటు మూలబౌద్ధానికి (ఆత్మ లేదు, శాశ్వతమైంది ఏదీ లేదు) అనే రెండింటికీ ముడివేసింది.

ఈ మాధ్యమిక వాదానికి మన తెలుగు నేల కేంద్రంగా మారింది. ఆచార్య నాగార్జునుడు ఈ మాధ్యమిక వాద సిద్ధాంత కర్త. అతని గ్రంథం మూలమాధ్యమిక కారిక.

చివరికి ఈ వాదం ప్రజల్లో ఎంతగా నాటుకుపోయిందంటే– గ్రామాల్లో ఇద్దరు వ్యక్తుల మధ్య ఆస్తి, డబ్బు, ఇతర విషయాల్లో తగవులు వచ్చినప్పుడు 'మధ్యవర్తులు' వారిద్దరికి మధ్యస్థంగా తగాదాను తెగ్గొడతారు. ఇలా తెగ్గొట్టడాన్ని 'భట్టిప్రోలు పంచాయితీ' అంటారు. భట్టిప్రోలు ఒక బౌద్ధక్షేత్రం కావడం వల్ల, ఆనాడు తెలుగునేలమీద 'మాధ్యమిక వాదం' బహుళంగా విస్తరించడం వల్ల ఈ 'భట్టిప్రోలు పంచాయతీ' అనే నానుడి ఏర్పడింది.

మహాయానులు బుద్ధుణ్ణి ఒకే ఒక వ్యక్తిగా అంగీకరించలేదు. కారణం బుద్ధుడు చెప్పిన ప్రతీత్య సముత్పాదమే.

ఏ వస్తువూ ఈ ప్రపంచంలో ఉన్నది ఉన్నట్లుగా ఉండదు. ఇంతకుముందు లేదు. తర్వాత కూడా ఉండదు. ప్రతిదీ మారిపోతూ ఉంటుంది. మార్పే ఉంటుంది. ప్రతీత్య సముత్పాదం ప్రధానంగా చెప్పేది ఇదే.

**బుద్ధుడు– బోధిసత్త్వుడు:**

ఇది నేటి డార్విన్ సిద్ధాంతం లాంటిది. ఇప్పుడున్న ఏ జీవీ ఈ భూమ్మీద 'ఇలాగే' పుట్టలేదు. ప్రతి జీవీ కొన్ని వేల, లక్షల మార్పులు జరిగి మరో జీవిగా పరిణామం చెందుతుంది. అమీబా నుండి మనిషి రావటానికి 300 కోట్ల సంవత్సరాల పరిణామం జరిగింది.

మనిషే కాదు...ఒక వస్తువు కూడా అంతే. గుండ్రని గుండ్రాయి నుండి, చెక్క గుండ్రాయి మొదటిగా పుట్టింది. ఇదే మొదటి చక్రం.ఆ తర్వాత సన్నగా గుండ్రంగా చెక్కిన బిళ్ళలాగా ఉన్న చక్రం, ఆ తర్వాత ఆకులతో ఉన్న చక్రం, ఆ తర్వాత ఇనుప చువ్వల చక్రం, ఆ తర్వాత దానికి టైరు, ఆ తర్వాత ట్యూబు, గాలి ఉన్న చక్రం, ఇప్పుడు ట్యూబులేని గాలి నింపిన చక్రం..ఇలా ఎన్నెన్నో మార్పులతో చక్రం అభివృద్ధి జరిగింది.

అలాగే బుద్ధుడు కూడా. 'బుద్ధుడు' అనే వ్యక్తి మానవీయుడు, మహోన్నతుడు. దానం, శీలం, ప్రజ్ఞ, ఉపేక్ష, క్రాంతి, మైత్రి..ఇలాంటి పది పరమ ఉత్తమగుణాల్ని పరిపూర్తిగా సాధించిన మహామానవుడు. బౌద్ధం చెప్పిన ప్రతీత్య సముత్పాదం ప్రకారం బుద్ధత్వం సిద్ధించడం కూడా క్రమంగా జరగాల్సిందే. ఒక వ్యక్తి ఒకేసారి గొప్ప దానగుణాన్ని సంపాదించలేడు. వస్తుదానం, అన్నదానం, ఆస్తిదానం...చివరికి ప్రాణదానం ..ఇలా దానగుణం కూడా క్రమేపీ పెంపొందాల్సిందే. కాబట్టి 'బుద్ధుడు' అనే వ్యక్తి ఒక వ్యక్తి కాదు. ఒక వ్యక్తి ఒక జన్మలో బుద్ధునికి కావల్సిన పదిగుణాల్లో పరిణతిని సాధించలేడు. కాబట్టి ఎన్నోజన్మలుగా ఈ పదిగుణాల్ని (దశపారమితలు) సాధించి..సాధించి చివరకు బుద్ధుడవుతాడు. బుద్ధత్వాన్ని పొందుతాడు. ఈ బుద్ధత్వాన్ని సాధించడం కోసం పాటుపడే జన్మల్లో ఆ వ్యక్తిని బుద్ధుడనకూడదు. బోధిసత్త్వుడు అనాలి. బోధిసత్త్వుడు ఎన్నో జన్మలెత్తి..ఈ దశ పారమితల్లో ప్రావీణ్యం పొంది చివరకు పరిపూర్ణత సాధించి బుద్ధునిగా మారతాడు–మారాలి. ఇదీ ప్రధానంగా బుద్ధుని జన్మల వెనుక ఉన్న మహాయానుల వాదం.

**కల్కి - మైత్రేయుడు:**

ఇలా..అనేక బుద్ధుల భావన వచ్చింది. ఈ అనేక బుద్ధుల్లో కూడా ఒక్కొక్క శాఖ వారు బుద్ధునికి ఒక్కొక్క పేరు పెట్టుకున్నారు. అక్షోభ్యబుద్ధుడు, అమితాభ బుద్ధుడు, రాబోయే కాలంలో మైత్రేయ బుద్ధుడు.

ఇది వైదిక సంప్రదాయంలో కల్కి అవతారం లాగా. అయితే మనం ఇక్కడ గమనించాల్సిన ప్రధాన మైన తేడా ఒకటుంది.

దుష్టుల్ని (వర్ణాశ్రమ ధర్మాల్ని పాటించని వారిని) సంహరించడానికి కత్తి తీసుకుని కల్కి వస్తాడు వైదికంలో. దుష్టత్వాన్ని (వర్ణాశ్రమ ధర్మాల్ని పాటించే వారిని) సంస్కరించడానికి, మానవుల్లో ప్రేమ, మైత్రి వ్యాపింపజేయడానికి 'కరుణ'ను ధరించి మైత్రేయుడు వస్తాడు మహాయాన బౌద్ధంలో. ఇదీ ఆ తేడా.

అయితే...మహాయానానికి, మహాయానులు నమ్మే బుద్ధత్వానికి దశ పారమితలు...(కరుణ, మైత్రి, శీలం, దానం, ఉపేక్ష లాంటి మానవీయ గుణాలు) మూలం కాబట్టి మహాయానులు ఈ భావాల్ని తెగ ప్రచారం చేశారు. అంటే మానవీయ విలువల్ని ఘోషించారు.

ఈ ఘోష తెలుగునేల నలుమూలలా మారు మ్రోగింది. బుద్ధుణ్ని స్మరించడం అంటే దశ పార మితల్ని స్మరించడమే. బుద్ధుణ్ని పూజించడం అంటే దశ పారమితల్ని పూజించడమే.

అంటే...మొత్తం తెలుగు సమాజం మీద మాన వీయ గుణాల్ని పెద్ద ఎత్తున కుమ్మరించారు మహా యానులు.

బుద్ధుని ఆరాధనలు, చైత్యారాధనలు లాంటి భౌతిక విషయాలు ఈనాడు లేకుండా పోయినా, మహాయాన బౌద్ధ నైతిక విలువలు మన నరనరాల జీర్ణించుకుపోయాయి.

ఈ విలువల్ని బౌద్ధం మాత్రమే ఈ నేలకి అందించింది.

బౌద్ధం ముఖ్యంగా మహాయాన బౌద్ధం ఇలాంటి మానవ విలువల్ని ప్రపంచానికి పంచింది అనటం అసత్యం కాదు. అతిశయోక్తీ కాదు.

అందుకే ఈనాడు ఆసియా అంతటా ఆరా ధించే బుద్ధుడు అవలోకితేశ్వరుడు. కరుణకి ప్రతి రూపుడు. అలాంటి మహోన్నత మానవీయ రూపానికి మూల మైనవారు మాధ్యమిక వాదులైన మన తెలుగు బౌద్ధులే!

అందుకే....మానవీయ విలువల మణిమకుటం మన తెలుగు బౌద్ధం!

---


రచయిత ఉపాధ్యాయుడు, కవి. నగరం (గుంటూరు జిల్లా) 93906 00157


పుస్తక పరిచయం

# ఆధునిక అద్వైతంపై ఒక చెవి పెడతారా?




**ఆ**ధునిక సమాజంపై తాత్విక చింతనతో వుప్పల నరసింహం 'ఈ ఆధునిక అద్వైతంపై ఓ చెవి పెడతారా!' అన్న పుస్తకాన్ని ప్రచురించారు. ఒక రకంగా ఇది సాహసోపేతమైన ప్రయత్నం. పుస్తకం చివరి అట్టపై...సంఘటితం కావాలని..తెగ పెద్ద ఆజ్ఞలు పాటించాలని, ఏదో మేర క్రమశిక్షణ పాటించాలన్న ఆలోచన మానవ సమూహాలకు వచ్చినపుడే (సమాజంలో) వ్యత్యాసాలకు, తేడాలకు, అంతిమంగా దోపిడీ స్వభావానికి బీజం పడింది. అంతేగానీ రాచరికం రోజుల్లోనో, ఫ్యూడల్ వ్యవస్థలోనో, పారిశ్రామిక యుగంలోనో ఆర్థిక వ్యత్యా సాలకు, దోపిడికి తెరలేవలేదు. మార్క్సిస్టులు దర్శిస్తున్న ఆర్థిక వ్యత్యాసాలు, తేడాలు, వర్గాలు కొత్తవి కావు. మానవ సమూహాల ప్రాథమిక దశ నుంచే వీటిని పిండ రూపంలో తిలకించవచ్చు.

ద్వైతాన్ని (కమ్యూనిజం-క్యాప్టలిజం) తలకెక్కించుకున్న తూర్పు జర్మనీ లేపిన అడ్డుగోడ (బెర్లిన్‌వాల్) ఎంతోకాలం నిలువలేదు. పాతికేళ్ళ క్రితమే అక్కడి ప్రజలు దాన్ని కసికొద్దీ కూల్చేశారు. ఉభయ జర్మనీలు (ద్వైతం) లేవు. ఉన్నది ఒక్క జర్మనీయేనని/అద్వైతమని అక్కడి ప్రజలు చాటిచెప్పారు. అనంతరం ప్రపంచ రూపురేఖలే మారిపోయాయి. ప్రజలు ఆధునిక అద్వైతాన్ని కోరుకుంటున్నారని చెప్పటానికి ఇంతకన్నా ఇంకేమి నిదర్శనం కావాలి?..

పై వాక్యాల కేంద్రబిందువుగా ఈ పుస్తక రచన సాగించి. పాతికేళ్ళ క్రితమే బెర్లిన్‌గోడ కూలినా మన దేశంలో మావోయిస్టులు ద్వైత (కమ్యూనిజం-క్యాప్టలిజం) భావనతో దండకారణ్యంలో అమాయక ఆదివాసీలను ఊచకోత కోయడాన్ని, నరమేధాలకు పాల్పడడాన్ని రచయిత తప్పు పట్టారు. జ్ఞాన వెలుగులు అన్న అధ్యాయంలో ఆధునిక సమాజంలో సంపద సృష్టిస్తున్న కారకాలపై పాఠకుల దృష్టిని ఆకర్షించారు. జ్ఞానం ప్రపంచాన్ని ఏ విధంగా మారుస్తున్నదో పేర్కొన్నారు. సంపద సృష్టించి పంచే యుగమిదని ప్రతిపాదించారు.

ఈ పుస్తకంలో పరిశోధనానుబంధం అధ్యాయం కీలకమైనది. వెయ్యి సంవత్సరాల క్రితం నల్లగొండ జిల్లా కొలనుపాక గ్రామంలో 18 కులాలకు 18 మఠాలను వీరశైవులు ఆవిష్కరించిన నేపథ్యం, అవి కొనసాగిన తీరు, భక్తి, జ్ఞాన ప్రజాస్వామ్యానికి ఈ మఠాలు ప్రతీకలని ప్రతిపాదన చేశారు.

బుద్ధుని బోధనలపై సరికొత్త ప్రశ్నలను సంధించారు.

**ఈ ఆధునిక అద్వైతంపై ఓ చెవి పెడతారా?**- రచన : వుప్పల నరసింహం, పేజీలు -224, వెల : రు.200/-లు, ప్రతులకు : జ్ఞానం పబ్లికేషన్స్, 2-3-764/1/4, తులసీనగర్ కాలనీ, అంబర్‌పేట, హైదరాబాదు-500 013 మరియు విశాలాంధ్ర బుక్‌షాపులు అన్ని బ్రాంచీలలో. ❊

-గంగులబాబు

# మన తిరువైయారు

అవును తిరువైయారు మన తెలుగువారిదే. తమిళనాట నడి బొడ్డున ఉన్న, ఒకనాటి చోళ చక్రవర్తుల రాజధాని తంజావూరు, దాపున 20 కి.మీ. దూరంలోనున్న తిరువైయారు మనదెలా అవుతుంది? అని మీ సందేహమా? మన ఆదికవి నన్నయ్య అవతరణకు వంద సంవత్సరాల పూర్వమే అది మన తెలుగువారిది అని తెలిపే ముందు దాని భౌగోళిక స్వరూపాన్ని స్థూలంగా తెలియజేస్తాను.

శ్రీరంగనాథునికి దండగా మారిందా అన్నట్లు, శ్రీరంగానికి అయిదఉరి కిలోమీటర్ల ఎగువన, పడమట దిశన, కావేరి రెండు పాయలుగా చీలి, శ్రీరంగానికి ఉత్తరాన ఒకపాయ, దక్షిణాన మరొక పాయగా, విడిపోయి పెద్ద దీవి నేర్పాటు చేసి, 25 కి.మీ. దిగువకు తూర్పుగా ప్రవహించి, ఆ రెండు పాయలు కలిసిపోతవి. మళ్ళీ, ఆ సంగమస్థానంనుండే, అయిదు నదులుగా విడిపోయి, మరొక 15 కి.మీ. దిగువకు ప్రక్కప్రక్కనే ప్రవహిస్తూ, ఉత్తరాన ఉన్న పెద్ద పాయ, దాన్ని కొల్లగొట్టడం అంటారు. తూర్పు ఈశాన్యంగా, సముద్రంవైపు పోతుండగా, మిగిలిన నాల్గునదులు తూర్పునకు పారి సముద్రం చేరిపోతాయి.

వానాకాలంలో వరదపోటుకు పొంగి, నాల్గు నదులలో నీరు ప్రవహించి తూర్పు ప్రాంతాన్ని నీటికరువు లేకుండా చేస్తాయి. వానాకాలం పోయి, వరద తగ్గగానే, నీరంతా ఉత్తరపు పెద్దపాయ కొల్లడానికి పరిమితమై, ఈ నాల్గు చిన్న నదులు వట్టిపోతవి. దీన్ని గ్రహించే కీ.శ.2వ శతాబ్దంలోనే కరికాళచోళుడనే చక్రవర్తి రెండు పాయలు కలిసిన చోట, ఆనకట్ట కట్టి నిరంతరం ఈ నాల్గు నదులలో కూడా నీరు పారే ఏర్పాటు చేశాడు. బహుశః ప్రపంచంలోనే ఒక నదికి ఆనకట్ట కట్టిన మొట్టమొదటి మొనగాడీతడే అయి వుంటాడు. ఆ, ఆనకట్టవల్ల తమిళనాట నాల్గైదు జిల్లాలు సస్యశ్యామలమయ్యాయి. ఆ ఆనకట్టకు ఈతడు పెట్టినపేరు కళ్యాణి. తమిళంలోనికి పరభాషా పదం ప్రవేశింపగానే, దాన్ని చితకగొట్టి, రూపుమార్చి తమ తమిళ పదంగా తయారుచేసుకునేవరకు దాన్ని వదలరు. అలా మారిందే 'కల్లనై'. కళ్యాణికి అపభ్రంశరూపం. ఆ కల్లనై ఆనకట్ట దగ్గరలోనే అయిదు నదులమధ్య అంటే కొల్లడానికి దక్షిణాన వున్నది తిరువైయార్. ఇక్కడున్న, దొడ్డ కోవెలను పంచనదకోవిల్ అంటారు. అందున్న స్వామి పంచనదస్వామి. శివుడు ఇక్కడ గల మరో ముఖ్య ఆకర్షణ. భద్రాద్రి రాముని ఆరాధ్య దైవంగా సేవించి, తరించిన మన నాదబ్రహ్మ త్యాగ రాజస్వామి సమాధి, ఆశ్రమము ఇక్కడే ఉన్నాయి. దేశం నలుమూలల నుండి యాత్రికులక్కడికి వస్తుంటారు. ప్రకృతి ప్రేమికులంతా కల్లనై డ్యాంను పరిసర ప్రాంతాలను చూడడానికి విహారయాత్రగా వచ్చి పనిలో పనిగా త్యాగరాజస్వామి సమాధిని దర్శించుకుని వెడతారు.

మన వేంగికి, తిరువైయారుకు విడదీయరాని సంబంధమున్నది. మనకు వెయ్యి కిలోమీట్ల దూరాన వున్న తిరువైయ్యార్‌తో మనకేంపని అంటారా? అదే తెలుపబోతున్నాను.

పదవ శతాబ్ది ప్రారంభంనుండే తంజావూరుకు చక్రవర్తులతో, మన వేంగీరాజ్యపాలకులు బలమైన రాజకీయ సంబంధాలే వున్నవి. వైవాహిక సంబంధాలతో దాన్ని మరింత పటిష్టం చేసుకున్నారు.

1. వేంగిని పాలించిన చక్రవర్తి రెండవ భీముడు (క్రీ.శ.934-45) తన కుమార్తె కుందవ్వను చోళరాజు అరింజయనకిచ్చి వివాహం చేస్తాడు.
2. వంజయన్ పెర్రప్లై అనే చోళరాజు, తన కూతురు 'వాంబవై'ని రెండవ భీముని పెద్ద కుమారుడు దానార్ణవునికిస్తాడు.
3. దానార్ణవుని చిన్న కుమారుడు విమలాదిత్యునకు రాజరాజచోళుని, కూతురు కుందవ్వనిస్తాడు.
4. విమలాదిత్యుని కుమారుడు, రాజరాజ నరేంద్రునకు (నన్నయ భారతకృతిభర్త) రాజేంద్రచోళుని కుమార్తె అమ్మంగాదేవినిస్తాడు.
5. రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రుడు బాల్యమంతా తన మేనమామల ఇంటనే గడిపాడు. చోళచక్రవర్తి రెండవ రాజేంద్ర చోళుని, పెద్ద కూతురును పెండ్లి చేసుకొంటాడు. చోళచక్రవర్తి మగ సంతానం లేకనే మరణించటంతో, అతని పెద్దల్లుడైనందున వేంగి తంజావూరు రాజ్యాలను కలిపి,కులోత్తుంగ చోళుడనే పేరుతో తమిళ సింహాసనాన్ని అధిష్టిస్తాడు.

కన్నడ నాట బాదామి చాళుక్యులు రాజ్యస్థాపన చేసిననాటినుండి, తమిళ చోళులకు బాదామి రాజ్యస్థాపన చేసిన నాటినుండి తమిళ చోళులకు, బాదామి చాళుక్యులకు, ఆధిపత్యపోరు ప్రారంభమైనది. చాళుక్యులలో రెండవపులకేశి తన తమ్ముని వేంగిరాజ్యాన నిల్పి, కన్నడ, తెలుగు దేశాలలో, తిరుగులేని, చాళుక్య పాలన కొనసాగించాడు.

ఆరవ శతాబ్ది మధ్య భాగంలో, బాదామి చాళుక్యులు సామంతుడు, రాష్ట్రకూట దంతిదుర్గుడు, తిరుగుబాటు చేసి, బాదామి చాళుక్యులు కూలదోసి, రాష్ట్రకూట రాజ్యస్థాపన చేశాడు. దీనితో వేంగి ఒంటరి రాజ్యమైంది. చోళ, రాష్ట్రకూట చక్రవర్తులలో వేంగి ఎవరివైపు మొగ్గితే, దక్షిణాదిలో వారికి తిరుగులేని ఆధిక్యత లభిస్తుంది. కనుక వేంగిని తమ అంకెకు తెచ్చుకునే ఏ అవకాశాన్ని, చోళ, రాష్ట్రకూట చక్రవర్తులు వదులుకోలేదు. దీనితో వేంగి ఇరువురు సామ్రాట్టుల మధ్య యుద్ధ భూమియై విలవిలలాడిపోయింది. ఆ క్రమంలో వేంగి రాజులు అనివార్యంగా చోళులకు దగ్గర కావలసిన స్థితి ఏర్పడ్డది. చోళులు ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకుని, వైవాహిక సంబంధాలతో రాజకీయ సంబంధాన్ని మరింత గట్టి పరుచుకున్నారు.

కన్నడ చక్రవర్తులు, వేంగి రాజుల్లో వారసుల మధ్య చిచ్చుపెట్టి, రాజును వ్యతిరేకించిన వారసుని పక్షాన నిలబడి రాజును పదవీభ్రష్టుని చేయటం, ఇలా పదవి పోగొట్టుకున్న వేంగి రాజులు ప్రతిసారి తమ బంధువులైన తమిళ చక్రవర్తిని ఆశ్రయించటం, తమిళ చక్రవర్తి వీరిని సాదరంగా ఆహ్వానించి, తమ రాజధాని తంజావూరుకు 20 కిలోమీటర్ల దూరంలో వున్న తిరువైయారు అనే సుందరమైన గ్రామం అన్ని వసతులతో విడిది వేర్పాటు చేసి, తిరిగి తమ బలాలతో వేంగిని సాధించి, వీరిని తిరిగి సింహాసనం మీద కూర్చోబెట్టటం, ఇదొక అనివార్యమైన రాచక్రీడగా మారింది. ఇలా వేంగిరాజుల ప్రవాస జీవితమంతా తిరు

వైయార్‌లోనే గడిచింది. వేంగి రాజ్య ప్రణాళికలన్ని తిరువైయార్‌లోనే రచింబడ్డాయి.

మొట్టమొదట ప్రవాస జీవితం దానార్ణవునితో ప్రారంభమయింది. చోళచక్రవర్తి సాయంతో వేంగిని సాధించి తిరిగి సింహాసనాన్ని వశం చేసుకున్నా, అతనితోపాటు వచ్చిన వందల కుటుంబాలవారు, తిరిగి వేంగి వెళ్ళటానికిష్టపడక చాలామంది అక్కడే స్థిరపడ్డారు. దానార్ణవుని రాణులలో ఒకతె 'వాంబవై' తిరిగి వేంగి వెళ్ళనిచ్ఛగించక, తిరువైయార్ లోనే వుండిపోయింది. వేంగి రాజకుమారులలో ఒకడు జననాధుడు, రాజేంద్రచోళుని మంత్రిగాను, మరొక రాజకుమారుడు సర్వలోకాశ్రయ విష్ణువర్ధన మహారాజనబడే విక్రమాధిత్య విక్కి- తూర్పుగోదావరి జిల్లాలోని బిక్కవోలు ఇతనిపేర నిర్మాణమైనదే- సర్వసైన్యాధ్యక్షుడుగా చోళరాజ్యంలో స్థిరపడ్డారు.

ఇరువురు మహాచక్రవర్తుల (కన్నడ-చోళ) మహాత్వాకాంక్ష, వేంగికి శాపమై, రణరంగ క్షేత్రమై, నిత్యాగ్నిగుండమై, బలియైపోయింది. ఎనిమిదవ శతాబ్ది మధ్యలో విజయాధిత్యునితో ప్రారంభమైన వేంగి మారణ హోమము రాజరాజనరేంద్రుని కుమారుడు రాజేంద్రుడు కుళోత్తుంగ చోళుడనే బిరుదంతో తమిళ సింహాసనమధిష్టించే వరు (క్రీ.శ. 1068) పదకొండవ శతాబ్ది మధ్యవరకు అంటే సుమారు మూడువందల సంవత్సరాలు వేంగిలో యుద్ధంలేని సమయమేలేదు. వందలుగాదు, వేల యుద్ధాలే జరిగాయి. వేంగిని పాలించిన రాజులు దానార్ణవునినుండి కుళోత్తుంగ చోళుడనబడే రాజేంద్రుని వరకు సుమారు 150 సంవత్సరాలపాటు, వేంగిలో గడిపిన కాలంకంటే ప్రవాస జీవితం తిరువయార్‌లో గడిపిన కాలమే ఎక్కువ. మన వేంగి రాజులు-వారి రాణులు పంచనది కోవిల్‌లో వేయించిన అనేక శాసనా లక్కడున్నాయి. ప్రతి విడత వీరితోపాటు వెళ్ళిన వందల, వేల కుటుంబా లకు అక్కడి చక్రవర్తి అండ, యుద్ధభీతి, ప్రాణభయం లేని ప్రశాంతమైన జీవితం, ఆ సుందరమైన భౌగోళిక పరిసరాలు, కాలువ తీసుకుంటే చాలు సస్యశ్యామలం చేసే నీటివసతి మనవారినెంతగానో ఆకర్షించి, వ్యవసాయదారులుగా స్థిరపడి, తిరిగి వేంగి రావటానికిష్టపడలేదు. వెళ్ళిన మనవారందరికి తిరువైయారు చాలక ఆ చుట్టుపట్టు ప్రాంతా లను తమ చేతుల్లోనికి తెచ్చుకుని తెలుగు ప్రాంతానికి పెద్ద తాలూకాకు సరిపోను విస్తరించుకున్నారు. అదంతా తమిళం లేని అచ్చ తెలుగు ప్రాంతమైంది. వారందరికి తిరువైయ్యారు కేంద్రము. వేంగి రాజులకు రెండవ రాజధాని.

1863-64లో ఖమ్మం సుల్తాను ధంసా ఆగడాలకు బెదిరి, ప్రాణ భయంతో త్యాగరాజస్వామివారి తండ్రి రామబ్రహ్మంగారు కాకర్లను వదలి తిరువైయారు పారిపోయి అక్కడ స్థిరపడటానికి, అక్కడిదంతా తెలుగునేల కావటమే కారణం. త్యాగరాజు తమిళంలోకాక తెలుగులో కీర్తను వ్రాయటానికి, మాతృభాషపై మమకారం మొదటి కారణమైతే, తమిళం వినబడని అచ్చ తెలుగునేల కావటం రెండవ కారణం.

నన్నయ్యకు వందసంవత్సరాల పూర్వం నుండి నిన్న మొన్నటి వరకు - ఆంధ్రప్రదేశ్ ఏర్పడేవరకు - అక్కడ తెలుగు తప్ప తమిళం వినబడలేదు. ఇప్పుడు తమిళం తప్ప తెలుగు వినబడటంలేదు. అక్కడి వృద్ధులందరికి తెలుగు వచ్చు. బ్రాహ్మణ కుటుంబాలవారంతా మనవలె తమిళ యాసలేని తెలుగు మాట్లాడతారు. శ్రీరంగంలోను కొన్ని తెలుగు వీధులున్నవి. వృద్ధులకు మాత్రమే తెలుగు వచ్చు. యువకులకు రాదు.

నేనీమధ్య తిరువైయారు, శ్రీరంగం వెళ్ళాను. తిరువైయారులో త్యాగరాయ పరంపరలో అయిదవ తరానికి చెందినవారు, 85 ఏండ్ల వృద్ధురాలు, తెలుగులోను, సంగీతంలోనూ, విదూషీమణియైన వసంత లక్ష్మిగారిని దర్శించాను. ఖమ్మం జిల్లా నుండి వచ్చానన్న అభిమానంతో వారి పూర్వుల సంగతులు ముఖ్యంగా త్యాగరాజస్వామివారిని గూర్చి తెలుపుతూ, తంజావూరి ప్రభువు శరభోజి, ధన, కనక, వస్తు వాహనాలను, వారు కోరినచోట, మడిమాన్యాలివ్వజూపితే త్యాగరాజు తిరస్కరించగా, ఆతని అన్న వదినెలు, నాయనా మనది పెద్దకుటుంబం, పేదరికంతో రోజులు వెళ్ళదీయటం కష్టంగా వుంది. పైగా మనకు ఆడసంతానం. తిరిపె మెత్తుకుని బ్రతుకుతున్న మనకు వాళ్ళ పెండ్లిండ్లు చేయటం కష్టమౌతుంది. తీసుకో, వద్దంటే రాజధిక్కారం, మహానేరం - అని నయాన, భయాన చెప్పజూచినా, నిధి సుఖమా? రాముని సన్నిధి సుఖమా? అంటూ ప్రపంచం నలుమూలల సంగీత సభలలో మార్మోగుతున్న ఆ కీర్తననుఉ ఆశువుగా ఆలపించి తిరస్కరించారట. ఆ కీర్తనను నాకు వినిపించి ధన్యుని చేశారు. ఆమెగారు చెప్పిన అనేక సంగతులు ఈ వ్యాసానికి అనావస్యం గనుక నేను చెప్పబూనటం లేదు. ఆమె మనుమరాలు ఇంటరు చదువుతూంది. ఆమెకు తెలుగు రాదు. అమ్మా, నీ పూర్వుల మాతృభాష తెలుగుగదా, నీవెందుకు నేర్చుకోవు అనడగితే అనవసరపు శ్రమ తప్ప దానివల్ల మా కొనగూడే అదనపు లాభమేమిటి అదేదో తమిళంలో శ్రమిస్తే బ్రతుకులో స్థిర పడతాం అని నానోరు మూయించటం కొసమెరుపు.

మనం భాషా రాష్ట్రమంటూ గొప్పగా ఏర్పాటు చేసుకున్న ఆంధ్ర ప్రదేశ్ వల్ల ఆ ప్రాంతంలో నూటికి నూరుశాతమున్న తెలుగువారిని, తెలుగును కోల్పోయాము. మిగిలిన తమిళదేశంలో వున్న 45% తెలుగును కోల్పోయాము. మన సరిహద్దు రాష్ట్రాలకు తలా రెండు మూడు తెలుగు జిల్లాలను సమర్పించుకున్నాము. తమిళనాట ఉక్కు పిడికితో తెలుగునదిమి తమిళాన్ని తప్పనిసరి చేశారు. అక్కడిప్పుడు తెలుగు మాట్లాడితే నేరం చేసినవాణ్ణిలా అసహ్యించుకుంటున్నారు. వెయ్యేండ్లుగా వర్ధిల్లుతూ వచ్చిన తెలుగును నామరూపాలు లేకుండా చేశారు. కాదు, కాదు మనమే, చేజేతులా చేసుకున్నాము. ఇదీ మన వారు గొప్ప తెలివిడితో ఆంధ్రప్రదేశ్ ఏర్పాటు చేసుకున్నందుకు తెలుగునకొనగూడిన మేలు. ఇప్పుడు తెలంగాణ విడివడి తెలుగు నేల రెండు చెక్కలైంది. రేపటి పరిస్థితేమిటోతెలియదు. ఇప్పటికైనా తెలుగు మేధావులు కండ్లు తెరిచి తెలుగు పాలకులనంకెకు దెచ్చుకొని తెలుగును బ్రతికించుకునే స్థాయి కెదగక, ఆంధ్రులు తెలంగాణ వారిది తుర్కీ తెలుగని, తెలంగాణవారు ఆంధ్రులది ఆంగ్లాంధ్రమని పరస్పరం వెక్కిరించుకుంటూ, కాలక్షేపం చేస్తే ఇక్కడకూడా తెలుగు మిగలదు. ఇప్పటికే అమ్మనుడి పత్రికాసంపాదకులు, తెలుగు అభిమానులనేకం చేసి, తెలుగు పరిరక్షణకు,కృషి చేస్తూ చిన్న చిన్న విజయాలే అవుగాక! సాధిస్తున్నందుకు ఆనందిస్తూ కటిక చీకట్లో ఇదొక్కటే మిణుగురు దీపంగా భావిస్తున్నాము.

ఇప్పుడు చెప్పండి, ఈనాడుకాక పోవచ్చుగాక, వెయ్యేండ్ల నుండి, నిన్న మొన్నటివరకు తిరువైయారు మన తెలుగువారిది కాదా? మనదే అనటంలో నేను పొరబడలేదుకదా?

-రచయిత ఫోను : 9391685686

**"ఏమి కేళికో పో రామక్కా. ఆ లచ్చుమమ్మని చూస్తుంటే కడుపు బగీరుమంటా ఉంది. వారం దినాలుగా ఎర్రబట్ట నిలువనే లేదంట, నెత్తురు పోతానే ఉందంట. నిలిచేకీ కూకొనీకీ కూడా సగితి లేదు ఆయమ్మ ఒంట్లా. ఇంగ కేళికెట్ల ఆడుతుందో" సున్నం పూసుకొన్న ఆకును నోట్లో పెట్టుకొంటా చెప్పింది తిమ్మక్క.**

**"అవును తిమ్మీ, నాకూ తెలుసు. అయితే మగ నా బట్టలకు ఎట్ల తెలుస్తుంది? మనూరి నాయినోళ్లనీ, రెడ్డోళ్లనీ కాదంటే అయితుందా? అబ్బుటికీ మునసామికి చెప్పి చూసిందంట. 'పెద్దోళ్లు కోపం చేసుకొంటారు. ఎట్లో ఒగట్ల ఆడే కావాల కా' అనేసినాడంట. 'ఊరంతా వానల్లేక అల్లాడతుంటే, వానల కోసం కదా ఆడమంటా ఉండేది, ఊరు బాగుపడేది నీకు ఇష్టం లేదా?' అనెనంట పెద్దరెడ్డి. ఆయమ్మ మటుకు ఏమీ చేసేకి అయితుంది. దానికే ఆడేకి ఒప్పుకోనుండాది " అనింది అమ్మ.**

# బానమ్మ ఏడిపించింది

## రామక్కగారి సుమ

**క**వురు కవురు మబ్బు బానమంతా కమ్ముకొని పొద్దప్పని రవంత రవంత మూసుకొంటా ఉంది. సుంటురుగాలికి తెంకాయమాన్లు వంగి వంగి లేస్తా ఉండాయి. నేను బడినింకా ఇంటికి వస్తా ఉండాను. తిమ్మక్క, 'బొబొబొ' అంటా కావేరప్పోళ్ల తిప్పగుంటతావ తిరుగులాడతా ఉంది. అంతలోగానే తుంపరవాన మొదులయింది.

"ఏల తిమ్మక్కా, తిప్పగుంటల్లా ఏమో తడుకులాడతా ఉండావు?" సంచిని తలమింద, చినుకులకి అడ్డంగా పెట్టుకొంటా అడిగితిని నేను.

"అమ్మాయా, మా కోడిపుంజు కనపడతా లేదు. వాన చినుకులు ఉదురుతా ఉండాయి. అదేమో ఇంటికి రాలేదు. నువ్వు వచ్చిన దోవలా ఏమయినా చూస్తివా?" అనింది తిమ్మక్క.

అంతలికే మా ఇంటిపక్కనింకా మా అమ్మగోక విన పడింది, "ఓయ్ తిమ్మీ, మీ కోడిపుంజూ మా పెట్టకోడీ, వీరుబద్రుగాని చింతమాను తొర్రలో ముడుక్కోనుంటే పట్టుకొస్తిని రా" అని కెర్లింది. మా ఇంటితావ మక్కిరికింద మూసి పెట్టిండే పుంజును సంకలోకి ఎత్తుకొనింది తిమ్మక్క. తుప్పరవాన నిలిసింది. మబ్బు వెలిసి పొద్దప్ప బయటికి వచ్చినాడు.

"ఈపొద్దు రెయ్యి దేవిసెట్టిపల్లిలా సాసువుల చిన్నమ్మ కేళిక ఆడతా ఉండారని వానరాయునికి తెలిసినట్లుంది రామక్కా, దానికే ఈడ కురిసి చెడిచేది ఏల అనుకోని డెంకనికోట దోవను పట్టుకొని పొయ్యేసిండాడు" అనింది తిమ్మక్క మా అమ్మతో.

"తిమ్మీ, ఇట్లా పుంగులు తోలేకి నువ్వూ నా కూతురు సుమా ఇద్దరూ ఒగటే. వానల్లేక అగసాట్లు పడతా ఉండాము. రెండు నెలలబుదు కురిసిన ఆద్రోనే. అనెంక వాన కురిసిందీ లేదు, వంక పారిందీ లేదు. ఇంట్లా ఉండిన గింజాగిటకల్ని అన్నీ ఎత్తుకొనిపోయి నేలమ్మ ఒళ్లో పోసేసి వచ్చిండాము. మొలిసింది అరదరకలు, మొలిసినంక ఉసురుతో ఉండేది ఇంగా అరదరకలు. ఆద్రోన గుడిగితే ఆరోన్లు చేటు అంటారు. ఈ ఏడాది అట్లే అయ్యేనట్లుంది. పెద్దసిలి, చిన్నసిలి, అసిలి, మగ, ఉబ్బ, అయిదోన్లు కురిసిందే లేదు. ఈ ఉత్తరోనలా అన్నా నాలుగు చినుకులు పడకపోతే బతికేదెట్టా? ఉత్తరోన కాలానికి చేన్లా నూగులు ఇంట్లాకి వచ్చి, ఇంట్లా ఉలువులు చేన్లాకి పోవాల్సుండే. రెండూ నడవలేదు" ఉసూరుమంటా అనింది మా అమ్మ.

"వాన కోసమే కదా రామక్కా, సాసువుల చిన్నమ్మ కేళికను ఆడిపిస్తా ఉండేది. మన దిగువింటి లచ్చుమమ్మ యేసికం కట్టితే సాసువుల చిన్నమ్మే దిగొచ్చినట్లు ఉంటుంది. లచ్చుమమ్మ పాడే పదానికి మనుసులే కాదు, మాన్లు కూడా ఏడుస్తాయి. కావాలంటే చూడు, ఈపొద్దు రెయ్యి బానమమ్మ కూడా ఏడుస్తుంది. ఆ ఏడుపు వానయి కురుస్తుంది" అనింది తిమ్మక్క.

తిమ్మక్క మాట తవళి కాదు. దిగువింటి లచ్చుమత్త పదమెత్తు కొనిందంటే దిక్కులే దణి పలకాల, అట్లుంటుంది. సాసువుల చిన్నమ్మ, అల్లిరాణి, నల్లతంగ, బాలనాగమ్మ...ఇట్లావి ఎన్నో యేసికాలు కట్టేది లచ్చుమత్త. ఏ యేసికం కట్టినా దాంట్లా ఇమిరిపొయ్యేది.

లచ్చుమత్తది వెతల బతుకు. మాకు మూడు మైళ్లదూరంలో ఉండే ఆవులపల్లిలో పుట్టి మా దేవిసెట్టిపల్లికి కోడాలయి వచ్చింది. లచ్చుమమ్మ మొగుడయిన మదనగిరి మామది కూడా మా అట్లా కూలిబతుకే. పని చిక్కితే కూడు లేదంటే మాడు, అట్లా బతుకులే మావి. దానికి తోడుగా అంటరానితనం అనేదొకటి, మాకు తెలియకుండానే మేము కోరకుండానే మా నెత్తిన కూకొని ఉంటుంది. ఎవరయినా వాళ్లకు నచ్చనిదానినీ, వద్దనుకొన్నదానినీ వదిలిపెట్టె య్యొచ్చు. కానీ మేము మటుకు కన్నతల్లి కడుపులానింకా నేలతల్లి కడుపులాకి పోయేకంటా ఈ అంటరానితనాన్ని మటుకు మోసే కావాల.

మదనగిరి మామ, పెండ్లికాకముందు రెండుమూడేండ్లు కోలారు సీమలా ఏదో ఊరికిపోయి పని చేసుకొంటా ఉండెనంట. ఆ వూర్లా ఉండినబుడే కేళికలు ఆడేది నేరిచి ఉండాడు. అనెంక మాఊరికి వచ్చినంక, ఇక్కడనే మా మాలగేరిలో మాదిగ్గేరిలో పదిమంది చిన్నోళ్లను చేర్చి, వాళ్లకు కేళిక పదాల్ని నేరిపించి కేళికల గురువు అయినాడంట.

ఇదంతా నేను పుట్టకముందు నడిచిన సుద్ది. మా ఊర్లా, మా చుట్టుపక్కల ఉండే ఆవులపల్లి, నందిమంగళము, బడదేపల్లి, పెరుమాళ్లపల్లి, పలవనపల్లి, కారుపల్లి, చూడగొండపల్లి, వెంకటేశపురము, అట్లూరు...ఇట్లా ఊర్లల్లా మామోళ్ళు ఆడే కేళికలకు మంచి పేరొచ్చె. అదే వాళ్ల కుటుంబముకు రవంత ఆసరింపు ఆయె.

"పగులు నువ్వేడ చిక్కుతావు రామక్కా. ఆ మేకల్ని మేపేకే నీకు పొద్దు చాలుతా లేదే. దీపము పెట్టిండావని తిట్టుకోకుండా రవంచ చూడు కూతురా. నాకేమో పాడు కండ్లు కనపడతా లేవే" అనింది పాపవ్వ.

"రావే ఈడకు" అంటా ఆ బిడ్డని దగ్గరికి పిలుచుకొని తలను విప్పి "అయ్యయ్యో" అని కెర్లింది మా అమ్మ. ఏమాయె అనుకొంటా



లచ్చుమత్త కూడా కేళికలను నేర్చి యేసికాలు కడతా ఉండె. వానలు కురవక కరువుకాలము వచ్చి ఊర్లమింద పడితే, మామోళ్లకు పిలుపు వచ్చేది. సాసువుల చిన్నమ్మ కేళికను ఆడిపిస్తే వాన వచ్చి తీరుతుందని మా పల్లెల్లా నమ్మకము అయిపొయింది. అదీ లచ్చుమత్త, చిన్నమ్మ యేసికం కట్టి కండ్లనీళ్లు విడస్తా పదం పాడిందంటే వాన కచ్చాయంగా కురవాలంట.

"సుమా, ఇట్లొచ్చి ఈ ఉలువుల్ని ఏరీ కొడుకా. నేను ఇంట్లా దీపము పెట్టేసి వస్తాను" అంటా పిలిచింది అమ్మ. నా జతగత్తెలతో వాటాట ఆడతా ఉండిన నేను, అమ్మ కూతతో ఆటను నిలిపేసి ఆతట్టుకి పోతిని. అమ్మ మాపుదీపము వెలిగించి దీగూట్లో పెడతా ఉంది. జగిలిమింద మొరములో ఉండే ఉలువుల్ని ఏరతా కూకొంటిని. అంతలికే మనమరాలిని తోడుకొని పాపవ్వ మా ఇంటితట్టుకు వచ్చింది.

"రామక్కా, నా మనమరాలి తలను రవంచ చూడమ్మా. గబ్బు ముండ, తలని గీరి గీరి పుండ్లు చేసుకొని ఉంది" అంటా జగిలిమింద కూకొనింది.

"ఏలమ్మా, నీకు ఇబ్బుదే తీరిందేమి?" అంటా బయటకి వచ్చింది మా అమ్మ.

నేను పొయ్యి చూస్తిని. తలనిండా బలిసిండే ఈపులూ, సప్పిడి ఈపులూ, నెత్తులూ, పేలూ పిలపిలమంటా నిండిపోయి ఉండాయి. తలంతా పుండ్లుపడి చీమూ నెత్తురూ కారతా ఉంది. అది చూసి మా అమ్మకు కోపం వచ్చినట్లుంది.

"ఏమి పాపమ్మా, నీకు వచ్చిండే పొద్దు, నీ రావిడి అణుగునాని... బిడ్డని ఇట్లు చేసి పెట్టిండావె...బిడ్డ తలంతా బంత కట్టుకోని పుండ్లయిపోయి ఉందే" అని పాపమ్మని తిట్లు తిరగేసింది.

"ఏమి చేసేది రామక్కా, నాకా కండ్లు తెలిసేది లేదు. దీని అమ్మేమో బిడ్డల్ని పట్టించుకొనేదే లేదు. నా కొడుకు ఉన్నెబుడు నా కోడాలు ఎట్లుండె. పేరుకి తగినట్లా లచ్చిమిదేవి ఉన్నేట్లుండెనే. వాడు తీరిపోయినంక, నా కోడాలు మనిసిగా ఏడుంది. రాయి మాదిరిగానే కదా బతకతా ఉండేది. కాటికి కాళ్లు నీటుకోనుండే ఈ ముసిలిదాని కోసం, కడుపున పుట్టిండే ఆ పసిబిడ్డల కోసం మట్టుకే ఉసురును నిలబెట్టుకోని ఉంది. కూలి పని చేసి, కేళికలాడి, సంపారిచ్చిన ఆ నాలుగు కాసుల్లా మా ముగ్గురి కడుపులు నిండేదే ఇక్కట్టుగా ఉంది. ఇంక బిడ్డకి నూనీ సీకాయి అంటా ఏడ సూసేది. వానికేమి, తావుకు పొయి చేరి సుకం పడిపోయినాడు. ఆయె, వాడా పొయి చేరుకొనింది.

చేర్చేరేసి మగానుబావులు" అంటా ముక్కు చీదింది పాపవ్వ.

"నడిసింది నడిసిపోయె, ఏడిస్తే యెతలు తీరేది లేదు, కలకుండు పెద్దమ్మా" అంటా మా అమ్మలేసి మూలింట్లోకి పొయి, నసురుగడ్డను కాల్చి బూడిద చేసి, ఆ బూడిదనీ రవంచ గద్దకరుపూరాన్నీ, కానగ నూనెలా వేసి వేడి చేసింది. ఆ నూనెని ఒగ కోడిరెక్కలా అద్ది అద్ది పుండ్లమీదంతా పూసింది. అట్ల పూసేనబుడు ఆ బిడ్డకు సగించినట్లు ఉండెనేమో 'ఊం అమ్మా' అంటా మూలిగింది.

మదనగిరి మామ, కేళికల గురువుగా పేరు తెచ్చుకొనె. ఆవూర్లా, ఈవూర్లా నెలకు రెండూమూడూ కేళికలు ఆడి రవంత కాసూ దుడ్డూ కండ్ల చూసె. అబ్బుడే పెరుమాళ్లపల్లెలా ఒగ కాపోళ్లామెకి జతపడి నాడంట. కేళికల్లా రాజు యేసికం కట్టే మామ, ఆయమ్మ కండ్లకి నిజం రాజట్లానే కనబడెనో ఏమో, మామని మెత్తుకొనేసింది. తెలిసిన కాపుగేరి కలకండా ఉంటుందా? కాపుగాసి నడిరెయ్యిలా నంది మంగళం నింకా నడిసి వస్తా ఉంటే పొడిచేసిపోయిరి. దేవరెద్దు పొడిచి చచ్చిపోయినాడని నాలుగూర్లూ చెప్పుకొనె. నిజం తెలిసినా నోరిప్పేవాళ్లు ఎవురు?

ఇద్దురు బిడ్డల్నీ ఒగ ముసిలిదాన్నీ లచ్చుమత్తపాలు చేసేసి, తనపాటికి తాను తావును చేరేసినాడు మామ. నడుములు విరిగినట్లు అయిపోయింది అత్తకు. అయినా ఎట్లనో సుదారించుకొనింది అత్త. కూలికి నాలికి పొయి కాపురాన్ని ఈడుస్తా ఉండె.

మామ దగ్గిర కేళికల్ని నేర్చిన అట్టూరు మునసామన్న, ఒగనాడు అత్తోళ్ల ఇంటికి వచ్చినాడు. కూలికి పొయేసి వచ్చి, పొయ్యిమీద సంగటికి ఎసురుపెడతా ఉంది అత్త.

"అకా, మామ తీరిపోయి ఏడాది దాటిపోయింది. ఈ ఏడాదిగా మన పల్లెల్లా కేళిక పదాలు వినపడిందే లేదు. అన్ని ఊర్లల్లా అడగతా ఉండారు. మన గుంపు తిరగా కేళికలు ఆడాలని అనుకొంటా ఉండాము. నువ్వే ముందుండి నడిపించాల కా " అని అడిగినాడు.

అత్త రవంత సేపు ఏమీ మాట్లాడలేదు. అనెంక నోరిప్పి "తమ్ముడా, చింతకాయిని కాల్చి గొజ్జు పిసికిండాను. సంగటి అయి పోవచ్చింది. ఉండు, ముద్ద తినేసి పోదువు. ఇట్లే ఎబుడయినా నువ్వు వచ్చినబుడు నాకు కలిగింది పెడతాను, తినేసి పో. కేళికల కత నా తావ మాట్లాడద్దు" అనేసింది.

అప్పుడు పోయేసినా, మునసామన్న విడవలేదు. వాళ్ల గుంపంతా మూడునాలుగు తూర్లు వచ్చి బతిమాలి బతిమాలి అత్తను ఒప్పించిరి. 'సరే కానీ, బిడ్డలకు కడుపుకు అంత కూడన్నా దొరుకుతాదిలే' అనుకొని అత్త తిరగా మొకానికి అద్దలం వేసుకొని, ఒద్దిక మొదులు పెట్టింది.

"ఏమి రామక్కా, ఇంగా వంట చేస్తానే ఉండావా? నువ్వు వండే దెబుడు, మా అన్నకు తెలలా ముద్ద యేసేదెబుడు? కేళికకు వస్తా ఉండావా లేదా?" అంటా ఇంట్లోకి వచ్చింది తిమ్మక్క.

"లేయ్, వండిందీ అయె, తినిందీ ఆయె. రా నువ్వు తింటువు" అనింది అమ్మ.

"తినిడిసి వస్తిని. వక్కాకు ఉంటే ఈ సాలు" అంటా నా పక్కన కూకొనింది తిమ్మక్క. అమ్మ వక్కాకు తిత్తిని విప్పి, తిమ్మక్కకు ఆకూ వక్కా అందిస్తా "ఇంగా శానా పొద్దుంది కేళిక మొదులయ్యేకి, పోదాము లే కూకో" అనింది.

"ఏమి కేళికో పో రామక్కా. ఆ లచ్చుమమ్మని చూస్తుంటే కడుపు బగీరు మంటా ఉంది. వారం దినాలుగా ఎర్రబట్ట నిలువనే లేదంట, నెత్తురు పోతానే ఉందంట. నిలిచేకీ కూకొనేకీ కూడా సగితి లేదు ఆయమ్మ ఒంట్లా. ఇంగ కేళికెట్ల ఆడుతుందో" సున్నం పూసుకొన్న ఆకును నోట్లో పెట్టుకొంటా చెప్పింది తిమ్మక్క.

"అవును తిమ్మీ, నాకూ తెలుసు. అయితే మగ నా బట్టలకు ఎట్ల తెలుస్తుంది? మనూరి నాయినోళ్లనీ, రెడ్డోళ్లనీ కాదంటే అయితుందా? అబ్బుటికీ మునసామికి చెప్పి చూసిందంట. 'పెద్దోళ్లు కోపం చేసుకొంటారు. ఎట్లో ఒగట్ల ఆడే కావాల కా' అనేసినాడంట. 'ఊరంతా వానల్లేక అల్లాడ తుంటే, వానల కోసం కదా ఆడమంటా ఉండేది, ఊరు బాగుపడేది నీకు ఇష్టం లేదా?' అనెనంట పెద్దరెడ్డి. ఆయమ్మ మటుకు ఏమీ చేసేకి అయితుంది. దానికే ఆడేకి ఒప్పుకోనుండాది " అనింది అమ్మ.

అందరమూ చాపలూ గోనెపట్టలూ చుట్టి చంకల్లా పెట్టుకొని కేళిక చూసేకి బయలుదేరితిమి. సాసువుల చిన్నమ్మ యేసికం కట్టిండే లచ్చుమత్త, ఆపొద్దు ఆడినట్లా ఏపొద్దూ ఆడలేదు. ఆపొద్దు పాడినట్లా ఏపొద్దూ పాడలేదు. లచ్చుమత్త ఆడిన పదుల కేళికల్ని చూసినోళ్లు కూడా ఇదేమాటను అనిరి, సాసువుల చిన్నమ్మ కతే ఏడుపు కత. లచ్చుమత్త ఆ కతలోగాకి నుగ్గి ఆడిపాడింది. అత్త ఆటని దిక్కులు కూడా రెప్ప వేయకుండా చూసినాయి. అత్త పాటని చుక్కలు కూడా కదలకుండా వినినాయి. తెల్లవారి కోడిగూజాముకి కేళిక ముగిసింది. ఎవురిండ్లకి వాళ్లు పొయిరి.

నేను బడికి కూడా పోకుండా పగులంతా నిదరపోతిని. మాపుసరి తిమ్మక్క మా ఇంటికి వచ్చి "ఏయ్ బుడుగునక్కా లెయ్యే, దీపము పెట్టే పొద్దయింది" అని తట్టి తట్టి లేపితే లేస్తిని.

"ఒగరెయ్యి నిదర చెడిన దానికి, ఇట్లా పగులంతా నిదరపోతారా ఎవురన్నా! ఆడపుటక పుట్టిందానికన్నా లేసి ఆపనీ, ఈపనీ అందుకో వద్దా. ఎక్కి మునగమాను కొమ్మమింద కూకోనుండాది. ఎబుడు పడుతాదో తెలీదు" అంటా తిట్లు తిరగేస్తా ఉంది మా అమ్మ. నేను లేసి బచ్చలింట్లాకి పొయి, మొకము కడుక్కోని వస్తిని. మేతకు పొయిన ఆవులు ఇండ్ల పక్కకు వస్తా ఉండాయి. వాటి దూడలు అమ్మల్ని తడుక్కొంటా అంబా అంబా అని పిలుస్తా ఉండాయి. గువ్వలు గూళ్లకు తిరుక్కొని వచ్చి, పిల్లల్ని రెక్కల కింద పొదుక్కొంటూ ఉండాయి. ఉన్నెట్లుండి దిగువింటినింకా పాపవ్వ గోక పెద్దగా వినపడింది.

"అయ్యో...లచ్చుమే...ఇద్దురు నేదర బిడ్డల్ని యిడిసిపెట్టి కండ్లు మూసుకొంటివా...ముసిలినక్కను నన్ను తీసుకోని పోకుండా, నిన్ను పిలుసుకోని పోడిసెనా ఆ పాపిదేవుడు..." మేమందురుమూ లచ్చు మత్తవాళ్లింటికి పోతిమి. బిడ్డల్ని పట్టుకోని లచ్చుమత్తమింద పడి దొర్లి దొర్లి ఏడస్తా గోళాడుతా ఉంది పాపవ్వ. లచ్చుమత్త మొగుడిని తడుక్కోని పొయ్యేసుండాది.

ఆపొద్దు రెయ్యి మా లచ్చుమత్తని తలుచుకొని లబలబ నోరు కొట్టుకొనింది బానమ్మ. ఆ అరుపులు మించులయి మెరిసినాయి. బొదుసుకొని బొదుసుకొని కెర్లింది బానమ్మ. ఆ కెరళ్లు గుడుగులయి గుడిగినాయి. ఓ అని ఎలుగెత్తి ఏడిసింది బానమ్మ. ఆ ఏడుపు ఉత్తరోన అయ్యి ఊరిమింద పడింది.

### కతలో కొన్ని ఆ ప్రాంతపు మాటలకు అర్థాలు

1. బానము - ఆకాశము
2. పొద్దప్ప - సూర్యుడు
3. సుంటురుగాలి- సుడిగాలి
4. తిప్పగుంట- ఎరువుదిబ్బ
5. తడుకు - వెతకు
6. ఉదురు - రాలు
7. ఆద్రోన- ఆరుద్రవాన
8. అరదరకలు- అరకొర
9. పెద్దసిలి - పునర్వసు
10. చిన్నసిలి - పుష్యమి
11. అసిరి- అశ్లేష
12. ఉబ్బ - పుబ్బ
13. మక్కిరి - గంప
14. పుంగులు - బడాయిలు
15. తవళి - అబద్ధం
16. కేళిక - వీధి భాగవతం/యక్షగానం
17. గేరి- వాడ
18. కద్దాయం - తప్పనిసరి
19. వాటాట - తొక్కుడుబిళ్ల
20. జగిలి - అరుగు
21. మొరము - చేట
22. నెత్తులు - పేనుపిల్లలు
23. సీటుకొను- చాపుకొను
24. కలకుండు - ఊరకుండు
25. మెత్తుకొను - అంటుకొను
26. గొజ్జు - పచ్చిపులుసు
27. అద్దలం - మేకప్
28. ఒద్దిక - రిహార్సల్
29. తెల - కంచం
30. నుగ్గు - దూరు
31. బచ్చలిల్లు - స్నానాల గది
32. గోక - గొంతు
33. నేదర - లేత
34. మించులు - మెరుపులు
35. బొడుసుకొను- గుండెలు బాదుకొను
36. గుడుగులు - ఉరుములు

రచయిత్రి చిరునామా :
దేవిసెట్టిపల్లి, హోసూరు(తమిళనాడు)
ఫోను నెం.09715420303

# తెనుగు లెంక సూక్తులు-5



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

*తన జాతిన్ దనపల్కును*
*దన సంస్కృతి నుద్ధరించు తగులము వలయున్*
*విను మన్యుని బాధింపని*
*'తన' యిది; చేకొమ్ము సముచితంబీ సేవన్*

మనిషి సమాజంలో ఒక భాగం. సమాజం కొన్ని ప్రత్యేక లక్షణాలను కలిగి ఉంటుంది. ఆ ప్రత్యేక లక్షణాలున్నదే ఆ జాతి. ఆ జాతి పేరుతో అది గుర్తింపు పొందుతుంది. ఆ జాతితో సంబంధం లేని ఏ ప్రదేశానికి వెళ్ళినా, ఆ జాతి పేరు చెప్పిన వెంటనే ఆ లక్షణాలు, ఆ లక్షణాలు కనిపించిన వెంటనే ఆ జాతి స్ఫురణకు వస్తాయి. ఆ జాతి లక్షణాలు నేర్చుకుంటే వచ్చేవి కావు. అవి పుట్టుకతో వస్తాయి. అవి రక్తంలో సహజంగా ఉంటాయి. తల్లి గర్భంలో ఉన్నప్పుడే అవి కండలో, ఎముకలో, బుద్ధిలో అణువణువు చొచ్చుకు పోతాయి. తెలుగుజాతిలో జన్మించినవాడికి తెలుగు లక్షణాలన్నీ జన్మతః వచ్చేవే.

ఒక జాతికి చెందిన వాడికి తన జాతిమీద దురభిమానం ఉండకూడదు గాని అభిమానం ఉండాలి. ఇతర జాతులు నశించాలి అనే తలంపు ఉండకూడదు. కానీ తన జాతి అభివృద్ధి చెందాలనే తపన ఉండాలి. తన జాతి, తన భాష, తన సంస్కృతి మిగిలిన జాతులకంటే, మిగిలిన భాషల కంటే, మిగిలిన సంస్కృతుల కంటే ఉన్నతంగా, ఉజ్జ్వలంగా, ఉండాలని కోరుకోవాలి. అందుకు తగినట్లు కృషి చేయాలి.

దురదృష్టవశాత్తూ తెలుగువాళ్ళలో జాతి, భాష, సంస్కృతి పట్ల అభిమానం లేదు. జాతి లక్షణాలను పరజాతీయులకు తాకట్టు పెట్టారు. పరభాషా వ్యామోహంతో స్వభాషను చిన్నచూపు చూస్తున్నారు. విదేశీ సంస్కృతికి దాసోహమంటున్నారు. ఇతర సంస్కృతులలోని మంచిని గ్రహించవచ్చు. కానీ అందుకోసం తన జాతిని, తన భాషను, తన సంస్కృతిని విడనాడవలసిన అవసరం గాని, అగత్యం గాని లేదు.

ఎప్పుడయితే జాతి, భాష, సంస్కృతులను కాపాడుకోవాలని, అభివృద్ధి చేసుకోవాలని ఆసక్తి కొరవడుతుందో, అప్పుడే ఆ జాతి 'తన'ను కోల్పోతుంది. తెలుగువాళ్ళకు ఆ ఆసక్తి లేకపోతే తెలుగుతనము నశిస్తుంది. అది నశిస్తే కాలక్రమంలో ఆ జాతే నశిస్తుంది. అందుకే 'తనము'ను ప్రతివ్యక్తి కాపాడుకోవాలి. దీనికోసం ఇతరులను బాధించవలసిన అవసరం లేదు. ఇతరులు నశించాలని కోరుకోవలసిన అగత్యం లేదు.

తమిళనాడులో ప్రభుత్వానికి తమ భాషపట్ల అభిమానం ఉంది. దాన్ని అభివృద్ధి చేసుకోవాలనే తపన ఉంది. కానీ అందుకోసం వాళ్ళు 'తెలుగు'ను బలి చేయడానికి పూనుకున్నారు. తమిళాన్ని అభివృద్ధి చేసుకోవడానికి పూనుకోవడాన్ని హర్షించవచ్చు గాని అందుకోసం సోదర భాషను బలి చేయడానికి ప్రయత్నించకూడదు. మన భాష తమిళనాట బలి అవుతున్నా మన జాతి నాయకులకు చీమకుట్టినట్లయినా లేదు. వారికున్న భాషాభిమానంలో శతాంశమయినా మన వారిలో ఉంటే దాన్ని ప్రతిఘటించేవారే. తెలుగు నాయకులలో నిజంగా భాష పట్ల అభిమానం ఉంటే తమిళ ప్రభుత్వంతో పోరాటం చేయాలి. తెలుగును అక్కడ నిలబెట్టాలి. అందుకు ఎంతదూరం వెళ్ళినా తప్పు లేదు.

అందుకే జాతి, భాష, సంస్కృతుల పట్ల ఆసక్తి ఉండాలని, అది ఇతరులను బాధించని విధంగా ఉండాలని తెలియజేశారు తుమ్మలవారు. ఒకవేళ పరాయివాడు మనను బాధిస్తే దానిని బాగు చేయడానికి ప్రయత్నించే ఆసక్తిని కలిగి ఉందామని హితవు చెప్పారు.

**-డా॥నాగభైరవ ఆదినారాయణ,**
ఫోను : 98497 99711

-రాణీ శివశంకరశర్మ

# తురక తెలుగు...తురక వేదం!

**నం**దమూరి తారక రామారావు 'కేంద్రం మిథ్య' అన్నాడు. కెసీఆర్, తెలంగాణా వాదులూ 'ఆంధ్రరాష్ట్రం మిథ్య' అన్నారు. ఈ క్రమంలో తెలుగు భాషా చరిత్ర కూడా ఇమిడి వుంది.

కులమతాలే కాదు భాష కూడా అణచివేత సాధనమే. కోస్తా తెలుగువాళ్లు తెలంగాణ తెలుగును తురక తెలుగు అన్నారు. 'తౌర క్యాంధ్ర' అన్నారు. ఈ మాట అన్నది ప్రముఖ తెలుగు కవి జంధ్యాల పాపయ్య శాస్త్రి గారు. బౌద్ధం ప్రభావంతో పుష్పవిలాపం విన్న 'కరుణశ్రీ' గారు తెలంగాణ వారి విలాపాన్ని, విప్లవ భావాల్నీ కూడా చవిచూడవలసి వచ్చింది. తురక సాంకర్యం లేని తెలుగు అసలు ఎక్కడ వుంది అని నిలదీశారు తెలంగాణ ఉద్యమకారులు. శ్రీశ్రీ కవితల్లోనే కాదు, జంధ్యాల పాపయ్యశాస్త్రిగారి పద్యాల్లోనూ పర్షియన్ అరబిక్ ఉర్దూ పదాల్ని ఎత్తిచూపారు. అంతేకాదు తెలుగు భాషపైన సంస్కృత, ఆంగ్ల భాషా ప్రభావాల్ని హృదయపూర్వకంగా అంగీకరించే మీరు ఉర్దూ ప్రభావానికి ఎందుకు గిలగిలలాడ్తారు? ముస్లింలు మమ్మల్ని పరిపాలించారు కనుక మా భాషపైన అటువంటి ప్రభావం సహజమేనని ఎందుకు అర్థం చేసుకోరు? మీ భాషపైన మాత్రం ఉర్దూ ప్రభావం లేదా? అని నిలదీశారు జయశంకర్ ప్రభృతులైన తెలంగాణ ఉద్యమకారులు. అంతేకాదు తౌరక్యాంధ్రం అనే సమాసమే తెలుగు వాసన కాక సంస్కృత వాసన కొడ్తోందన్నారు. మీపైన సంస్కృతం, ఇంగ్లీషు ప్రభావాలు లేవా అని నిలదీశారు. ఈ తురక సాంకర్య భయం మన తెలుగు కవుల్ని చాలా కాలమే వెంటాడినట్లు కనిపిస్తుంది. షాజహానా కవిత్వంలో ఉర్దూ మాటలు ఎక్కువగా వున్నాయన్నారు జయప్రభ. ఈ చర్చ ఆంధ్రజ్యోతి (డైలీ)లో కొన్ని సంవత్సరాల క్రితం జరిగింది. అంతటితో ఊరుకోలేదు ఫెమినిస్టు కవి జయప్రభ. ఉర్దూ కవిత్వంలో తెలుగు మాటలు కనపడవు, మన కవిత్వంలో మాత్రమే విరివిగా వాడ్తున్నారు అన్నారు. తాను వాడిన ఇంగ్లీషు పదాలు మాత్రం సులభగ్రాహ్యాలని సమర్థించు కొన్నారు. భాషా సాంకర్యం జరగకుండా తాను మడిగట్టుకొంటానని అన్నారు.

మన 'మడి'లో కూడా సాంకర్యం తప్పదని చరిత్రకారులు చెప్తున్నారు. బ్రాహ్మణులు పరమపవిత్రంగా భావించే యజ్ఞోపవీత ఆచారం ఇరాన్ నుంచి మనకి దిగుమతి అయిందని ఆర్.ఎస్.శర్మ అనే చరిత్రకారుడు 'శూద్రవర్ణం ఎలా పుట్టింది?' అనే పుస్తకంలో రాశారు. చరిత్రకారుల సంగతి సరే, వైదికమైన మీమాంస సూత్రాలకి రాసిన శబర భాష్యంలో వైదిక పదజాలాన్ని అర్థం చేసుకోవడానికి మ్లేచ్ఛభాషల అధ్యయనం ఉపకరిస్తుందని రాశారు. మ్లేచ్ఛ పదానికి గ్రీకు, ముస్లిం అనే అర్థాలు వస్తాయి. *(పికనేమాధికరణం, తృతీయః పాదః)*

తెలంగాణ ప్రాంతంతో, తెలంగాణ సంస్కృతితో అనుబంధం వుండటం వల్ల కావచ్చు విశ్వనాథ సత్యనారాయణగారిని తురక సాంకర్య భయం అంటలేదు. 'వేయి పడగలు' నవలలో అన్యాయాల్ని ప్రశ్నించే ఉదాత్త వ్యక్తిగా కబీర్ అనే పాత్రని సృష్టించారు. నిజానికి కబీర్ హిందూ-ముస్లిం సంస్కృతుల సంగమానికి ప్రతీక. అతడు భారత గ్రామీణ సంస్కృతిలో భాగమని విశ్వనాథ భావించి వుండ వచ్చు. సంగమాన్ని సాంకర్యమని చీదరించుకోవడం వల్లే తెలంగాణ కోస్తాల మధ్య భాషా సాంస్కృతిక పోరాటం మొదలైంది.

నిజానికి మనం నిత్యజీవితంలో తెనుగు పదాలుగా భావించే ప్రయోగించే అనేక పదాలు తెలుగు పదాలు కానే కావు. వాటిలో ఉర్దూ, అరబిక్, పర్షియన్ పదాల సంఖ్య ఎక్కువే. కలము, ఖైదీ, కిటికీ, కబురు, తారీకు, జవాబు, మేకు, ఖాళీ, గూడుపురాణీ, రోజు, మోజు, జమీందారు ఇలా ఎన్నో..ఎన్నెన్నో..

సంస్కృతం అంటే ముద్దు. ఇంగ్లీషు క్లాసులంటే మరీ ఇష్టం. మరి ఉర్దూ అంటే ఎందుకు అంత భయం? దీని చారిత్రక నేపథ్యాన్ని తెలుసుకోవాలి.

'చెయ్యెత్తి జైకొట్టు తెలుగోడా' అంటూ తెలుగుజాతిని ప్రత్యేక జాతిగా భావించిన వాళ్ళు మొదటితరం కమ్యూనిస్టులు. కమ్యూనిస్టు భావాల నుంచి, క్రమేపీ ఆధిపత్యశక్తిగా ఎదిగిన ఒక అగ్రవర్ణ శూద్రకులం తెలుగు ఎంతో కమ్మనిది, తీయనిది అంటూ యిటాలి యన్ ఆఫ్ ది యీస్ట్ అంటూ చివరికి తెలుగు అంటే గుంటూరు, కృష్ణా జిల్లాలకి పర్యాయపదంగా మార్చేశారు. దీని వెనుక బ్రిటీషు విద్యావిధానం నుంచి ఎదిగిన మేధావుల, సంస్కర్తల పాత్ర వుంది.

గురజాడ అప్పారావు భాష విషయంలో 'యూనిఫార్మిటీ' అవ సరం అని భావించారు. భాషలోని వైవిధ్యభరితమైన వ్యక్తీకరణల్ని, మాండలిక భేదాల్ని ప్రస్తావిస్తూ, వొక ప్రామాణిక భాష అవసరం అంటాడు. బ్రిటీష్ ప్రభుత్వంలో కృష్ణా గోదావరి జిల్లాలు ఆర్థికంగా విద్యాపరంగా అభివృద్ధి చెందాయి కనుక వారి భాషనే ప్రామాణిక భాషగా అంగీకరించాలంటాడు. ఉత్తరాది భాషలతో పోలిస్తే తెలుగులో యూనిఫార్మిటీ ఎక్కువ అని కూడా అంటాడు. (Minute of Dissent).

బలమైన కేంద్రం, వొకే జాతి, వొకే జాతీయ భాషలతో మొదలుకొని, వొకే ప్రామాణిక భాష, భావనలు ఆధునిక ప్రపంచాన్ని వెంటాడాయి. ప్రత్యేకతలపై, విశిష్టతలపై, వైవిధ్యంపై 'యూనిఫార్మిటీ' యుద్ధంగా పరిణమించింది. కృష్ణా గుంటూరు జిల్లాల భాష భాషగానూ, మిగిలిన ప్రాంతాల భాష మాండలికంగాను నిర్వచించ బడింది. భాషలో ఐక్యతకి చిహ్నంగా కృష్ణా గుంటూరు జిల్లాల భాష (ప్రామాణిక భాష) భావింపబడింది. మిగిలిన జిల్లాల భాషలు వైవిధ్యానికి చిహ్నంగా భావించబడ్డాయి. కృష్ణా గుంటూరు జిల్లాల భాష శిరస్థానీయంగా వర్ణించబడింది.

నిజానికి కృష్ణా గుంటూరు జిల్లాల భాష అంటూ ఏదీ లేదు. అది కూడా వివిధ మాండలికాలతో అలరారేది. మల్లాది రామకృష్ణ శాస్త్రి గారి కథలు కృష్ణాజిల్లా బ్రాహ్మణ మాండలికం మాత్రమే. శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారిది గోదావరి జిల్లా బ్రాహ్మణ మాండలికం

మాత్రమే. శూద్రపలుకుబడి వేరేగా వుండేది. ఉదాహరణ–ఎంకిపాటలు. అందువల్ల కృష్ణా గుంటూరు జిల్లాల భాషలు కూడా మాండలికాలే.

క్రమేపీ ప్రామాణిక భాష అనేది వార్తాపత్రికలు, ఇంగ్లీష్ న్యూస్ ఏజన్సీలు పంపిన వార్తల్ని అనువదించడం నుంచి ఏర్పడినట్లు కనిపిస్తుంది. సినిమాలు కూడా రంగూ రుచీ లేని భాషని తయారు చేశాయి. ఒకరకంగా ఆధిపత్యవర్గంగా ఎదిగిన ఒక కులం సృష్టించిన కృతక భాషే ప్రామాణిక భాషగా మారింది. యిది ఉచ్చారణలో, వ్యక్తీకరణలో వైవిధ్యాన్ని చంపేసింది. తనకి యాస అనేది లేదని ఆధిపత్య భావంతో విర్రవీగింది. తమిళభాష, పరాయి భాషయైన హిందీ ఆధిపత్యంపై పోరాటం చేసింది. తెలుగు తెలుగుతోనే పోరాటం చేయవలసి వచ్చింది.

కెసీఆర్ రాజకీయాల కంటే భాషకి చేసిన సేవ ఎక్కువ. ఈ కృత్రిమ భాషని తనదైన తెలంగాణా నుడికారంతో బలంగా ఎదుర్కొన్నాడు కెసీఆర్. ఆయన భాష ముందు కోస్తా రాజకీయ నాయకుల కృతక తెలుగు నిర్జీవంగా, నిస్తేజంగా తేలి పోయింది. చివరిక తురక తెలుగే గెలిచింది.

(వ్యాపారతత్వమూ, ఇంగ్లీషు భాషా ప్రభావాల వల్ల కోస్తా తెలుగు క్షీణించింది. ఈ ప్రభావాలకి దూరంగా వుండటం వల్ల తెలంగాణ తెలుగు సజీవంగా నిలిచి వుంది.)

భాషకీ, సంస్కృతికీ అవినాభావ సంబంధం వుంది. నన్నయ పంచమవేదమైన మహాభారతాన్ని తెలుగు చేయడం విప్లవం అంటారు. ఛాందసవాదుల నుంచి వ్యతిరేకత ఎదుర్కొన్నాడంటారు. మరి వేదాలనే తురక భాషలోకి అనువదించిన వ్యక్తిని ఎంత విప్లవకారుడనాలి? మొగల్ వంశానికి చెందిన దారాషికోహ్ (16వ శతాబ్దం) వేదాలలో అంతర్భాగమైన ఉపనిషత్తుల్ని పర్షియన్ భాషలోకి అనువ దింపజేశాడు. అంతేకాదు, ఖురాన్‌లో చెప్పిన కితాబ్ అల్‌ముక్నున్ (రహస్య గ్రంథం) యిదేనన్నాడు. స్వీయ మతస్తుల నుంచి వ్యతిరేకతని ఎదుర్కొన్నాడు. ముస్లింలు పర్షియన్ అరబిక్ భాషల లోకి చేసిన సంస్కృత గ్రంథాల అనువాదాలే మొదటివి. వాటి ఆధారంగానే యూరోపియన్ భాషల్లోకి అనువాదం జరిగింది. ఆర్థర్ షోపన్ హోవర్ లాంటి తత్వవేత్తల్ని, టి.యస్.ఇలియట్ లాంటి మహాకవుల్ని ఉపనిషత్తులు ప్రభావితం చేశాయి. కారణం– దారాషికోహ్. వివేకానంద జయంతులు జరుపుతారే కానీ దారాషికోహ్ లాంటి విప్లవకారుల, ప్రపంచ వైతాళికుల జయంతులు ఎందుకు జరపరు? కారణం వారు తురకవాళ్ళు కావడమే.

నిజానికి భారతదేశంలో ఇస్లాం రూపుమార్చుకొని అద్వైతంతో చెలిమి చేసి సూఫీయిజంగా పరిణమించింది. ఇదీ సాంకర్యమే. దేవుడూ ప్రకృతీ వేరని చెప్పే ముస్లిం సంస్కృతి, దేవుడూ ప్రకృతి ఒకటే అనే సూఫీయిజంగా పరిణమించింది. వైకం మహమ్మద్ బషీర్ అనే మలయాళ రచయిత 'అనల్ హఖ్' అనే కథ రాశాడు. మంజూర్ –అల్ –హల్లాజ్ అనే సూఫీ యోగి 'అనల్ హఖ్' అని నినదించినందుకు, ప్రభుత్వమూ పూజారి వర్గమూ ఆయన్ని ముక్కలు ముక్కలు చేస్తుంది. ఇంతకీ అనల్ హఖ్ అంటే ఏమిటి? ఈ పదాన్ని ప్రముఖ దళిత కవి కలేకూరి ప్రసాద్ 'అహం బ్రహ్మాస్మి' అని అనువాదం చేశాడు. ఇది ఉపనిషత్ వాక్యం. ఇస్లాంలో అంతర్గతంగా పోరాటం జరిగింది. సూఫీయిజం విస్తరించింది. ఈ మిశ్రమ సంస్కృతి భాషలోనూ ప్రతిబింబించింది. ఉర్దూ అనే భారతీయ భాష అవతరించింది. తెలుగు మాత్రం ఈ మిశ్రమ సంస్కృతి నుంచి ఎలా తప్పించుకోగలదు? ఒక తత్వగీతంలో శివునికి పూజ చేద్దామన్నా అభిషేకం చేద్దామన్నా చెరువులోని నీళ్ళని చేపలు, కప్పలూ ఎంగిలి చేశాయని ఇలా ఎంగిలి కానిదేదీ, మడి కట్టుకొని కూర్చున్నదేదీ మిగలలేదని భక్తుడు బాధపడతాడు. అలాగే తురకతనం అంటని సంస్కృతి కోసం, భాష కోసం అన్వేషణ వ్యర్థం.

రచయిత ఫోను నెం.73966 66942

కవిత

## మొదలు పెడితే చాలు

కవిత రాయాలని కలం పట్టుకొంటానా
ఒక్కొక్క సారి
ఒట్టు పెట్టుకొన్నట్లు ససేమిరా...
సహాయనిరాకరణ!

అమ్మపై అలిగిన పసిపిల్లలు
విసురుగా వెనక్కి తల తిప్పుకొన్నట్లు
కాగితం చెట్టుపై వాలదు
ఒక అక్షర శుకం

వీధిలో పనిలేకుండా తిరిగే వారిలా
హృదయాకాశ వీధిలో
భావాల మేఘాలు
నిరంతరం సంచరిస్తున్నా
భూమిపుటలు పులకరించేలా
ఒక అక్షర బిందువూ కురవదు!
000
ఉన్నట్లుండి
నాలుగు బాటల కూడలిలో
ఎర్రదీపం వెలగడంతో
రాదారిపై వాహనాలు ఆగినట్లు
కాగితాల వనంలో విరబూయదు
అక్షర సుమం!

నిండుపున్నమిరేయి
నీలాకాశం ముసుగులో
దాక్కున్న చుక్కల ముఖాల్లా
కాగితం గగనంపై తళుక్కుమనదు
అక్షర తారక!

చూస్తూండగానే ఆకుపచ్చ దీపం వెలిగి
ధనుస్సులో ఎక్కుపెట్టిన బాణాల్లా
దూసుకొని పోతున్న వాహనాల్లా
అమావాస్య చీకట్లో
నీలిమబ్బుల తెరలు తొలగించి
గలగలనవ్వే నక్షత్రాల్లా
బొమ్మల కొలువులో పేర్చిన బొమ్మల్లా
కొమ్మపై వరుసలు తీర్చి కూర్చున్న పిట్టల్లా
వానవచ్చి వెలిశాక
కరంటు తీగకు గుచ్చిన
వాన చినుకుల పూసల్లా
అలకమానిన పిల్ల అనురాగంతో
అమ్మ మెడను వాటేసుకొని
మాటలముత్యాలు ఒలకబోసినట్లుగా
అక్షరాలు... అక్షరాలు...అసంఖ్యాక అక్షరాలు!

**–మందరపు హైమవతి,** 94410 62732

# 'మొల్ల' గురించిన అంశాలు అసంగతం

'అమ్మనుడి' నవంబరు సంచికలో– 'స్మృతి మంజూష'లో సోమసుందర్ గారు మొల్లను గురించి రాసిన అంశాలు సహేతు కంగా లేవు. నేను 'మొల్ల'పై, ఆమె రామా యణంపై పాతిక సంవత్సరాలుగా కృషి చేసి ఆమె కాలనిర్ణయం (ఆధారాలతో సహా) చేశాను.

కుమారి పదం కుమ్మరిగా అపభ్రంశం కాలేదు. ఆమె తండ్రి ఆతుకూరి కేసనసెట్టి కుమ్మరి కులస్థుడే. శైవమత గురువు. గురు లింగ జంగమార్చనాపరుడు. మహాపండి తుడు. నెల్లూరు జిల్లా, కలువాయి మండలం (పూర్వపు రాపూరు తాలూకా) గోపవరం గ్రామస్థుడు. గోపవరం శ్రీకంఠ మల్లేశుని భక్తుడు.(ఇప్పటికీ ఈ ఆలయం గోపవరం గ్రామ సమీపంలో వుంది) సోమసుందర్ గారు పేర్కొన్నట్లు ఆవిడ క్రీ.శ.1310–1380 (1980 అని అచ్చుతప్పు పడింది) జీవించలేదు.

అలా జీవించి వుంటే పూర్వ కవిస్తుతిలో శ్రీనాధుణ్ణి పేర్కొనడానికి వీలు కలిగేది కాదు.

శ్రీనాధుడు 1370–1450 ప్రాంతా లలో జీవించాడు. మొల్ల జీవితకాలం (అనేక చారిత్రక ఆధారాలతో నిరూపితం) క్రీ.శ. 1465–1535 ప్రాంతాలు. 'ప్రతాపరుద్ర చరిత్ర' రచయిత ఏకామ్రనాధుడు క్రీ.శ. 1581–1612 ప్రాంతాలలో గోల్కొండ పాలకుడు కులీకుతుబ్‌షాహి కాలంలో ఒక కరణం. ఇతను సిద్దేశ్వర చరిత్ర రచయిత కాసి సర్వప్ప అనూచానంగా వస్తున్న గాధ లను బట్టి మొల్ల కాకతి ప్రతాపరుద్రుని ఆస్థానానికి వెళ్ళినట్లు పేర్కొన్నారు.

ప్రతాపరుద్రుని పాలనాకాలం క్రీ.శ. 1262–1289 ప్రాంతాలు. తిక్క ననూ, శ్రీనాధుణ్ణి పేర్కొన్న మొల్ల ప్రతాపరుద్రుని ఆస్థానానికి వెళ్ళి నట్లు సమన్వయం కుదరదు.

నా పరిశోధనలో ఆమె గజ పతి ప్రతాపరుద్రుడి ఆస్థానానికి వెళ్ళినట్లు తేలింది. గజపతి కాలం క్రీ.శ.1497–1538. మొల్ల నెల్లూరు జిల్లాలోని ఉదయగిరికి క్రీ.శ.1501లో వెళ్ళి ప్రతాపరుద్ర గజపతిని కలిసింది. ఉదయగిరి అప్పట్లో గజపతి స్వాధీనంలో వుండేది.

సోమసుందర్ గారు పేర్కొన్నట్లు మొల్ల కొమ్మనకు (తిక్కన తండ్రి) గానీ, తిక్కనకు గానీ పుట్టిన అక్రమ సంతానం కాదు. ఏకామ్రనాధుడు తిక్కన వరప్రసాదం వల్ల మొల్ల రామాయణం రచించిందని చెప్పడం వల్ల ఇలాంటి ఊహాగానాలు పుట్టాయి. అవి అనవసర విషయాలు. ప్రఖ్యాత కవయిత్రిపై అభాండాలు వేసే విషయాలు – వాటిని సోమసుందర్‌గారు త్రోసి పుచ్చవలసింది.

శ్రీ ఆరుద్ర మొల్లను గురించి కాల నిర్ణయం చేయలేదు. (మొల్ల రచనా పద్ధతిని బట్టి, శైలీ విన్యాసాలను బట్టి) మొల్ల శ్రీనా ధుణ్ణి పేర్కొనడాన్ని బట్టి ఆమె ఆయన తర్వాతి కాలం నాటిదని మాత్రమే చెప్పారు. ఆమెను సమకాలీన కవులు గాని, తర్వాతి కవులు గానీ పేర్కొనకపోవడం, ఆమె శూద్రకుల సంజాత కావడమే.

ఈమె కవిత్వాన్ని నెల్లూరు కవి అయిన బైచరాజ వేంకట నాధుడు (క్రీ.శ.1500 ప్రాంతం) అనుకరించాడు. మొల్ల, ఆమ రామాయణంపై పరిశోధనలు చేసి డాక్టరేట్లు, ఎం.ఫిల్ పట్టాలు పొందిన 12 మంది కూడా ఆమె జన్మస్థలాన్ని సందర్శించడం గానీ, నిర్ధారించడం గానీ, ఆమె కాలనిర్ణయాన్ని పేర్కొనడం గానీ చేయలేదు. అలా వుంది మన పరిశోధనల స్థితి. ఏకామ్రనాధుడి పూచీ తీసుకుని ఆమెను కాకతి ప్రతాపరుద్రుని కాలం నాటిదిగా ముద్రవేశారు.

క్రీ.శ.1370–1450 ప్రాంతాలలో జీవించిన శ్రీనాధుణ్ణి, సోమసుందర్ ఉటంకిం పుల ప్రకారం క్రీ.శ.1310–1380 ప్రాంతా లలో జీవించిన మొల్ల – ఎలా పూర్వకవి స్తుతిలో పేర్కొన గలుగుతుంది? పైపెచ్చు మొల్ల, రామాయణ రచయిత్రి అవునో కాదో అని వ్యాఖ్యానించడం ఎంతవరకు సమం జసం?

శ్రీనాధుణ్ణి రసికుడిగానే పేర్కొనడం వల్ల, కవి సార్వభౌమ బిరుదాన్ని పేర్కొనక పోవడం వల్ల శ్రీనాధుడికి ఆ బిరుదం లభించకముందే మొల్ల వున్నదని, రామా యణాన్ని రచించిందనీ ఔచిత్య, అనౌచిత్య ప్రస్తావనలు కూడా అనవసరమే కదా!

మొల్లను గురించి ఏమి చెప్పాలను కున్నారో ఆయన 'మొల్ల' వ్యాసం చదివాక కూడా మనకు అర్థం కాదు.

మొల్ల పూర్వ కవిస్తుతిలో తెలుగులో తిక్కన, రంగనాధ, శ్రీనాధుల్ని, ఆపైన సంస్కృత కవి సమూహాన్ని కూడా పేర్కొం టుంది. ఆ విషయాన్ని కూడా వ్యాస రచయిత గమనించాలి. సోమసుందర్ గారు తెలుగు సాహిత్య చరిత్రలో మకుటం లేని మహారాజు. ఇలాంటి వివాదాస్పదమైన అంశాల జోలికి వారు వెళ్ళకపోవడమే మంచిదని నా అభి ప్రాయం.

మొల్ల–రామాయణ కవయిత్రిగా, రామాయణ కవులలో అగ్ర భాగాన నిలి చింది. ఆమెను సామాజికంగా ఆ కాలంలో అన్ని అవస్థలూ పెట్టారు. ఆమె రామాయణ ప్రతులు నాశనం చేశారు. అయినా ప్రతిభను, సూర్యోదయాన్ని అరచేతులడ్డుపెట్టి ఆప లేరన్న విషయం మొల్ల విషయంలో నిరూ పితమైంది.

నూట ఎనిమిది రామాయణాల్లో ఆమె రామాయణం అగ్రగామిగా నిలిచి సాహిత్య చరిత్రలో చరిత్ర సృష్టించింది. ఇవన్నీ సోమసుందర్ గారికి తెలి యని విషయాలు కావు. ఇలా రాసినందుకు సోమసుందర్ గారు సహృదయంతో అర్థం చేసుకుంటా రని ఆశిస్తున్నాను.

–డా॥పాయసం
**సుబ్రహ్మణ్య మహర్షి**, నెల్లూరు,
ఫోను : 94901 25878

# అప్రజాస్వామికంగా వ్యవహరిస్తున్న పాలకులు

ఈ నాలుగు ఎడద ముక్కల్ని రాయించింది, 2015 నవంబరు అమ్మనుడి. మొద్దునిద్దర్లనీ గుద్ది చెప్పేలా వున్నాయి, రాతలు.

'మన అమరావతి-మన రాజధాని సరే...మన తెలుగెక్కడ?' చదివాక ఎద నీరై పోయింది. తెలుగుపై కార్టూనులూ ఆలోచింప జేశాయి.

లక్షలూ కోట్లూ వెచ్చించి చేసుకునే వాటిల్లో అయితే ఆర్థికపు లోటును అర్థం చేసుకోవచ్చు. ప్రపంచవ్యాప్త దృష్టిపడే తెలుగువాడి ఆంధ్రరాజధాని శిలాఫలకంపై ఆత్మగౌరవ దీపకాలుగా తెలుగు అక్కరాలను చెక్కించుకోలేకపోవడం...ఇది ఆంధ్రుల హార్దికపు తలపు లోటును తట్టిచెబుతోంది.

రెండు రాష్ట్రాలుగా భౌగోళికంగా విడివడ్డాయి. అప్పుడే సద్బుద్ధిని ప్రసాదించే పెద్దలతోను, ప్రతిపక్షాలతోనూ, సామాజిక భాషా ఆలోచనాపరులతోనూ లోతుగా యోచించి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని 'శ్'ను ఆంగ్లనామంలోని 'ష్'ను తొలగించుకుని తెలుగుపేరు పెట్టుకునే చారిత్రక అవసరాన్ని మరచిపోయాం.

ఇప్పుడు చడీ చప్పుడు కాకుండా తెలుగు రాజధానికి పూర్తిగా ఆంగ్లశిలాఫలకాన్ని వేసుకుని రెండవ గొప్ప తప్పునకు ఒడిగట్టాం. రెండు గుండెల తెలుగుజాతి పత్రిక అమ్మనుడి విమర్శను దొరతనం నిర్మాణాత్మకంగా తీసుకోవాలి. ఆ శిలాఫలకంపై పైన తెలుగు, క్రింద ఆంగ్లం వుండేలా రాస్తే ఎంత ముచ్చటగా ఉండేది? దొరతనపు పెద్దలకు ఇంత ముఖ్య అంశంలో ప్రజావ్యతిరేకత రాకుండా చెప్పే సలహాదారులే కరువయ్యారా?

పక్షం కొందరిదవుతుంది కానీ దొరతనం అందరిదీ. వారు చేసే పనులూ అందరికీ చెందేవే. అందుకే శిలాఫలకం దోషాన్ని దొరతనంలోని పెద్దలు తాము తలాపిడికెడుగా భావించుకోవాలి. అమ్మనుడి అక్షర విమర్శను గ్రహించి ఎందుకిలా జరిగిందో...మనది నియంతృత్వ రాజకీయ వ్యవస్థ కాదు కనక ప్రభుత్వం ఒక ప్రకటన చేయాలి. తప్పును సవరించుకొని ఆ శిలాఫలకం ప్రక్కన తెలుగులో రాతిపలక పెట్టాలి, శభాషని కొంతైనా అనిపించుకోగలగాలి.

'ఏ భాషలో ఉంటేనేమిటి? ఎవరు పాలిస్తే ఏమిటి?' అనే బానిస చింతనలను వర్తమాన భవిష్యత్తరాలకు అందించడం మన చెట్టుకొమ్మల్ని మనమే నరుక్కోవడం సుమా!

'అమ్మనుడి' వేదన చూస్తుంటే- ఒకనాటి పత్రికల్లో భాషా సాహిత్య సాంస్కృతిక ప్రేమికులైన నార్ల వెంకటేశ్వరరావు గారి సంపాదకీయ వేదనలు గుర్తుకొచ్చాయి. సంపాదకులకు అభినందన. ప్రభుత్వానికి అభి'నిందన'!

**-తెలు'గోడు'**

ఏ రాష్ట్రంలో ఉన్నా, ఏ దేశంలో ఉన్నా
తెలుగువాళ్ళంతా ఒక్కటే




కేంద్రసాహిత్య అకాడమీ, ఏలూరు సాహితీ మిత్రులు సంయుక్త ఆధ్వర్యంలో నవంబరు 15న ఏలూరులో జరిగిన బుచ్చిబాబు శతజయంతి ప్రారంభ సభలో మాట్లాడుతున్న ఆచార్య ఎన్.గోపి, డా॥కాత్యాయినీ విద్మహే, శ్రీమతి శివరాజు సుబ్బలక్ష్మి, డా॥లంకా వెంకటేశ్వర్లు, అకాడమీ ప్రాంతీయ కార్యదర్శి ఎస్.పి.మహాలింగేశ్వర్.

## నవంబరు సంచికలో తప్పొప్పులు

1. 'జనవాణి' శీర్షిక-38వ పుటలో 'ఆంగ్లభాష మోజులో అమ్మభాషకు తూట్లు' వ్రాసిన వారి పేరు శ్రీ అమ్మిన బాలరాజు. ఫోన్ : 95153 91407. ఇది ముద్రణలో లేదు.
2. 39వ పుట 'స్మృతిమంజూష'లో 'మొల్ల' గురించిన వ్యాసంలో రెండవ పేరాలో 1980 అన్నదానిని 1380గా సరిదిద్దుకోవాలి.
3. 4వ పుటలో తిథుల వివరంలో తప్పులు దొర్లాయి. దానిని దయచేసి ఈ క్రింది విధంగా చదువుకోగలరు.
   బహుళషష్ఠి ఆదివారము నుండి కార్తీక *(జీరాపి) బహుళ పంచమి సోమవారము వరకు
   *కుందాపి, జీరాపి = తెలుగు నెలలు.
4. 11వ పుటలో- 'సన్నాయి నొక్కులు' కవితలో మొదటి వరుసలో 6వపంక్తి- 'ప్రజా ప్రయోజన కళలు, కలు' అని ఉన్న దానిని 'ప్రజా ప్రయోజన కళలు, కలలు' అని చదువుకోవాలి. రెండవవరుసలో 10వ పంక్తిలో 'నీతిలీలలు' అని ఉన్నదానిని 'నీటి లీలలు' అని చదువుకోవాలి. ఇబ్బంది కలిగించినందుకు చదువరులు మమ్మల్ని మన్నించగోరుతున్నాము. -సం.

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520 004.
ఇ-మెయిల్ : *ammanudi@gmail.com*

కవిత

# బరంపురం మిత్రులు

–డా॥ఎన్.గోపి,
93910 28496

నాలుగోసారి వచ్చినా
మొదటిసారి వచ్చినట్టుంది
తూర్పు సముద్రం అలలు
గుర్తుపట్టి పలకరించాయి
బరంపురంతో నా అనుబంధం
తడియారని నిరంతర మకరందం

ఎన్ని ఆటుపోట్లను
తట్టుకున్న సముద్రమిది
ఈ నేలలో
ఏదో మట్టితనముంది
విత్తనాలు చిట్లితే
జ్ఞాపకాలు మొలకెత్తుతాయి

కళింగ రాజ్యంలో
అశోకుడు హరించిన లక్షలాది శ్వాసలు
పశ్చాత్తాప శాసనంగా గడ్డ కట్టాయి
తెలంగాణ నుంచి
నాగార్జునుని రాయబారిగా వచ్చినట్టుంది

పర్లాకిమిడిలో అలిగి వెళ్లిపోతున్న
గిడుగువారి అడుగులు కనపడ్డాయి
తెలుగు భాషకోసం
ఒక ప్రాంతాన్నే వదిలేసిన
తాళ ప్రమాణ బేతాళ దార్శనికుడాయన

బరంపురంలో
సహపంక్తి భోజనానికొచ్చి
భార్యచేత గురజాడ
ఇంటి ముందు నిలబడి తిట్లు తిన్నాడు

దేవాలయాల మీద బూతుబొమ్మల
గుట్టు విప్పినందుకు
ఇప్పుడైతే తాపీ వారిపైన
దాడులు జరిగేవేమో!

బరంపురం మిత్రులు
పరిచిన విస్తళ్లలాంటి వాళ్లు
ఎవరూ ఖాళీ మనసుల్తో వెళ్లరు

'దయస్పోరా' లోంచి
జీవనసారాన్ని పిండిన ఉద్దండులు,
వారితో కరచాలనం
రెండు దిక్కులను కలిపినట్టుగా ఉంటుంది
తిరుగు ప్రయాణంలో
చంకసంచి మరింత బరువెక్కింది
హృదయాలు చెక్కిన
వారి పుస్తకాలున్నాయి మరి!

(కవిమిత్రుడు విజయచంద్రకు...)

*(22-11-2015న బరంపురంలో 'కళింగాంధ్ర సాహిత్యం'పై జరిగిన సదస్సులో పాల్గొని..)*




Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

# తెన్నాటి చరిత్రలో నిలిచిపోయే నవంబరు 7



యర్రా నాయుడు గారికి కంకణాల పుష్పరాజు నెనవు–
'తెలుగు విడుపరి' పోణిమి (పురస్కారం)



చి॥మార్టూరి సంజనాపద్మం కతల పొత్తం
'రేగడి నీడల్లా' విడుదల

నవంబరు 7 తెన్నాటి (నేటి తమిళనాడు) తెలుగువారికి చిరకాలం గుర్తుండిపోయే రోజుగా నిలిచిపోయింది. ఆంధ్ర, తెలంగాణలకు బయట– తెలుగు కోసం పోరాడిన వారికి ఒక పురస్కారాన్ని తెలుగువాణి (ట్రస్టు) నెలకొల్పి, తొలిగా ఈ మన్ననను బర్మా (మయన్మార్)లో తెలుగు కోసం కృషి సల్పిన యర్రా నాయుడు గారికి ఈ రోజున ఉడుమలపేట (తిరుపూర్ జిల్లా–తమిళనాడు)లో ఇచ్చి సత్కరించింది. 345 మంది తెలుగువారు పాల్గొన్న ఆ సభలోనే మార్టూరి వసంత్–కవితల కుమార్తె ఏడవ తరగతి చదువుతున్న సంజనా పద్మం రచించిన కవితల సంపుటి 'రేగడి నీడల్లా' పుస్తకాన్ని విడుదల చేయడం ఒక కొత్త చరిత్రకు నాంది పలికింది. (ఇందులోని తొలి రెండు కతలను 'అమ్మనుడి' ప్రచురించింది) వసంత్, కవిత తమ ప్రాంతంలోని తెలుగువారికి తెలుగు అక్షరాన్ని నేర్పే ఉద్యమాన్ని పెద్ద ఎత్తున నడపటానికి ముందుకు వచ్చిన కుటుంబం. వారి కుమార్తె సంజనాపద్మం కొద్దిరోజులు తెలుగువాణి తరగతుల్లో అక్షరాలు నేర్చుకొని వరుసగా కొన్ని కతలను కమ్మనైన తెలుగులో వ్రాసింది. వాటిని ఆ తల్లిదండ్రులు 'కొంగునాడు రచయితల సంగం' నుంచి ప్రచురించారు. పుస్తక విడుదల పండుగలో పాలుపంచుకోవడానికి అమెరికా నుండి శ్రీమతి అనిత, హైదరాబాదు నుండి వాసిరెడ్డి నవీన్, ఆంధ్రప్రదేశ్ పత్రిక సంపాదకుడు కందుల రమేశ్, ప్రముఖ రచయిత్రి చంద్రలత, తెలుగుజాతి ట్రస్టు కార్యదర్శి పారుపల్లి కోదండరామయ్య, తిరుపతి నుండి పాత్రికేయుడు ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు తదితరులు విచ్చేశారు.

ఈ రెండు గొప్ప పనులు ఒకే వేదికపైన నవంబరు 7న జరగడం తెన్నాట తెలుగు అక్షరాన్ని నేర్పే మహోద్యమంలో రెండవ అధ్యాయానికి తెర తీసింది. వేలూరు జిల్లాను దత్తత తీసుకొని సుమారు 4000 మందికి తెలుగు అక్షరాలను 2004లో నేర్పడం తొలి అధ్యాయం. ఇదంతా 'నడుస్తున్న చరిత్ర' చదువరులకు తెలిసిందే.

ఉడుమలపేట కార్యక్రమంలో తెలుగువాణి మేనేజింగ్ ట్రస్టీ పి.వేణుగోపాల్‌రెడ్డి, తెలుగువాణి ట్రస్టీ, అమ్మనుడి సంపాదకుడు, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥సామల రమేష్‌బాబు, మరొక ట్రస్టీ దామోదర్‌రెడ్డి పాల్గొన్నారు. ఈ కార్యక్రమాలు తెలుగువాణి ట్రస్టీ, ఎల్లలు లేని తెలుగు పుస్తక రచయిత స.వెం.రమేశ్ ఆధ్వర్యంలో జరుగుతున్న సంగతి అందరికీ విదితమే. చి॥సంజనా పద్మం తండ్రి వసంత్ కూడా ఇటీవలే ఒక ట్రస్టీగా తెలుగువాణిలో బాధ్యతను పంచుకొంటున్నారు.

**తెన్నాటిలో కంకణాల పుష్పరాజు తెలుగు విడుపరి పురస్కారం**

ఈ తెలుగు పండుగలో యర్రా నాయుడు గార్కి తెలుగువాణి ట్రస్టు తరఫున రు.25 వేల రూపాయలు ఇచ్చి ఘనంగా సత్కరించినందుకు వసంత్ తల్లి మార్టూరి పద్మావతి గారికి ట్రస్టు తరఫున శ్రీ వేణుగోపాలరెడ్డి మప్పిదాలు తెల్పారు. తమిళనాడులో తెలుగు భాష రక్షణకు, తెలుగువారి సమైక్యతకు, తెలుగు సంఘాల సంఘీభావానికి తన జీవితమంతా కృషి చేసి, స.వెం.రమేశ్‌కు స్ఫూర్తినిచ్చిన వ్యక్తి కీ.శే.పుష్పరాజు. తమిళనాడులోని తెలుగు జనసంఖ్యను ఆయన కులాల వారీగా, జిల్లాల వారీగా లెక్కలు ప్రకటించారు. ఆ రాష్ట్రపు జనాభాలో 42 శాతం తెలుగువారేనని నిరూపించిన వ్యక్తి పుష్పరాజు. ఆయన పేరిటనే 'కంకణాల పుష్పరాజు–తెలుగు విడుపరి పోణిమి (పురస్కారం)'ని వసంత్ కుటుంబం ప్రకటించింది. తెలుగువాణి తొలి ట్రస్టీలలో పుష్పరాజుగారు కూడా ఒకరు.

**2016 జనవరి నుండి తెలుగు తరగతులు మొదలు**

స.వెం.రమేశ్ పర్యవేక్షణలో ఈ ప్రాంతంలో సుమారు 100 గ్రామాల్లో తెలుగు తరగతులు మొదలు కానున్నాయి. వసంత్ నాయుడు ముఖ్యకర్తగా ఈ పనిని తెలుగువాణి చేపట్టింది. 'తానా'వారు ఆర్థిక సహకారం అందించనున్నారు.

–'అమ్మనుడి' ప్రత్యేక ప్రతినిధి




### జాతీయ గ్రంథాలయం (కలకత్తా) వారి అవగాహన సదస్సు

డెలివరీ ఆఫ్ బుక్స్ అండ్ న్యూస్ పేపర్స్ (పబ్లిక్ లైబ్రరీస్) చట్టం 1954ను ప్రచారం చేసే ఉద్దేశంతో– కలకత్తా లోని జాతీయ గ్రంథాలయం వారు విజయవాడ– ఆంధ్రలయోలా కళాశాలలో నవంబరు 27,28 తేదీలలో అవగాహన సదస్సును నిర్వహించారు. రాజారామ్మోహన్‌రాయ్ లైబ్రరీ ఫౌండేషన్ ఉపసంచాలకులు సొమెన్ సర్కార్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ప్రిన్సిపాల్ రెవ.ఫాదర్ డా॥కిశోర్, రెక్టర్ రెవ.ఫాదర్ రవిశేఖర్, రెవ.ఫాదర్ ఫ్రాన్సిస్ జేవిఆర్, రెవ.ఫాదర్ ఎన్.రాజు, ఆంధ్రవిశ్వవిద్యాలయ ఆచార్యులు సోమశేఖరరావు, మద్రాసు విశ్వవిద్యాలయ ఆచార్యులు బి.రమేష్‌బాబు, జాతీయ గ్రంథాలయం ప్రతినిధులు ఎన్.శివప్రసాద్, బి.నాగేశ్వరరావు, ప్రముఖ తెలుగు రచయితలు అనేకమంది పాల్గొన్నారు. కళాశాల గ్రంథాలయాధికారి డా॥జి.ఎ.ప్రసాదరావు, డా॥గుమ్మా సాంబశివరావు బాధ్యత వహించి సభను నిర్వహించారు. డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి, డా॥వెన్నా వల్లభరావు తదితరులు సహకరించారు. (ఈ డి.ఒ.బి.చట్టాన్ని గురించి, గ్రంథాలయం గురించిన సమగ్రమైన వ్యాసాన్ని వచ్చే నెల 'అమ్మఒడి'లో చదవండి)

